సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25 న.పై



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 47
24-7-57

హేవిళంబి ఆషాఢ బహుళ ద్వాదశి బుధవారం

# విషయానుక్రమణిక



ముఖచిత్రం: వైజయంతిమాల.

# ఆగాఖాన్

ప్రపంచంలోకల్లా ధనవంతులైన నలుగు రైదుగురు కోటీశ్వరుల పేర్లు చెప్పమని ఎవరన్నా అడిగితే తడుముకోకుండా ఆగాఖాన్ పేరు కళ్లుమూసుకుని చెప్పొచ్చు.

ప్రపంచంలోకల్లా ఉత్తమమైన రేసు గుర్రాలు, బ్రహ్మాండమైన గుర్రాలపాల ఎవరి దగ్గరున్నాయీ అంటే, మళ్ళీ ఆగాఖాన్ పేరు నిరాఘాటంగా చెప్పవచ్చు

ఇస్లామ్‌మత ప్రవక్త మహమ్మదు వంశంలో 40 వ తరం వాడైన ఆగాఖాన్ ఈ నెల 11 వ తేదీన జెనీవావద్ద కాలధర్మం చెందారనే వార్త ప్రపంచమంతటా నివసిస్తున్న ఆయన మతస్థులకు తీరని విచారం కలిగించింది.

ఆయన భారత ఉపఖండంలో (కరాచీ) 1877 లో జన్మించారు అందుచేత ఆయన భారతీయుడే కాని ఆయన ఎక్కువ కాలం ఇతరదేశాల్లో, ముఖ్యంగా యూరప్‌లోనే గడిపారు అందుచేత ఆయనకొక దేశమంటూ లేదనే చెప్పాలి. సుమారు 2 కోట్లమంది ఇస్మాయిలీ తెగకు చెందిన మహమ్మదీయ మతస్థులకు ఆయన ఆధ్యాత్మిక నాయకుడు వీరంతా ఆయనను తమ దైవంగా, రాజుగా, తామాయన ప్రజలుగా భావిస్తారు అయితే వీరంతా ఒక దేశానికి చెందిన వారుకారు భారతదేశంలో, ఆగ్నేయాసియా, తూర్పు ఆఫ్రికా, అరేబియా, యూరప్, సోవియట్ దేశాల్లో చెదిరిపోయి ఉన్నారు

## తులాభారం

ఇస్మాయిలీ మతస్థులు ఆగాఖాన్‌కు ఏటేటా కప్పాలు, కానుకలు చెల్లిస్తూ ఉంటారు వీరిలో పెద్దపెద్ద వ్యాపారస్థులు, ధనవంతులు అనేకులున్నారు. వీరు తమ సాలు రాబడిలో పదోవంతు కప్పం చెల్లించాలని నియమం అంతా అలా చెల్లించకపోయినా ఆయనకువచ్చేరాబడి కొస్తాకూస్తా కాదు ఏటా సుమారు 4½ లక్షల పౌనుల ఆదాయం వస్తుంది. ఆయన దగ్గరున్న డబ్బు ఏడెనిమిది వందల కోట్ల రూపాయలకు తక్కువ ఉండదని అంచనా. అదిగాక అప్పుడప్పుడు ఆయన అనుయాయులు ఆయన్ని బంగారంతోనో, ప్లాటినంతోనో, వజ్రాలతోనో తూచి అదంతా ఇచ్చేస్తూ ఉంటారు. ఇలా తూచడం మొగల్ నవాబులనాటి ఆచారం ఆయన 79 ఏళ్లు జీవితమంతా మొగల్ దర్జాలోనే గడిచిపోయింది.

అటు విక్టోరియారాణి కాలంలో పుట్టి, ఇటు రెండవ ఎలిజబెత్ పరిపాలన కాలంలో వరకూ, ఆయన పంధోమ్మిదో శతాబ్దానికీ, ఇరవయ్యో శతాబ్దానికీ, ప్రాచీన విశ్వాసాలకీ, ఆధునిక నాగరికతకూ వంతెనగా నిలబడ్డారు. పదోఏడు రాకముందే 48వ ఇమామ్‌గా ఆయన నియమితులయ్యారు ఈయన పూర్వీకులు గత శతాబ్ద ప్రారంభంలో పర్షియానుంచి కాందిశీకులుగా భారతదేశం వచ్చారు. ఈయనతాత పర్షియన్ రాజు కూతురును పెళ్ళి చేసుకున్నాడు ఆగాఖాన్ అనేబిరుదు తాతనుంచే ఈయనకు సంక్రమించింది ఈయన పూర్తిపేరు ఆగాసుల్తాన్ సర్ మహమ్మద్ షా. ఈయన తన 70 ఏళ్ల పరిపాలనకాలంలో తన మతస్థుల సౌకర్యార్థం ఎన్నో పాఠశాలలు, వైద్యశాలలు స్థాపించారు వారిచేత ఎన్నో వ్యాపారసంస్థలు నెలకొల్పించారు ఇస్మాయిలీ తెగవారు నివసించే ప్రతినగరంలోనూ ఒక జమత్ ఖానా (మసీదు) ఉంటుంది. ఈయన మతస్థులు రోజూ రెండుపూటలా అక్కడ సమావేశమై ప్రార్థనలు చేస్తూ, కానుకలిస్తూ ఉంటారు ఈ మసీదుల ఆస్తిపాస్తులన్నీ ఆగాఖాన్ సొంతమే

అనుయాయులచేత అవతారపురుషుడుగా పరిగణింపబడినా ఆగాఖాన్ నిరాడంబరుడూ సన్యాసీ కానేకారు నిరంతర భోగలాలసుడు తాగుడు కూడదని మతం నిషేధించినా ఆగాఖాన్‌కు నిషేధంలేదు "తాగుడు తప్పు కాదా?' అని ఎవరో ఒకసారి అడిగితే,

"మీకేం తెలుసు? మద్యం నానోటిని తాకగానే అది పవిత్రజలమైపోతుంది" అని ఆయన జవాబు చెప్పారట "మీరింత భోగప్రియులేమి"టని ఒక అనుయాయుడడిగితే "మీకు నామీద ఏమాత్రం భక్తిఉందో పరీ

(48-వ పేజీ చూడండి)



ఈ నెల 11 వ తేదీన జెనీవాలో కాలధర్మం చెందిన ఇస్మాయిలీ మహమ్మదీయనాయకుడు ఆగాఖాన్, ఆయన భార్య

# మనం, మన సైన్యం

న్యూఢిల్లీ ప్రతినిధి

## వాంపైర్ విమానాల కొనుగోలు

ఇంగ్లండునుంచి మనదేశానికి త్వరలో నే కొన్ని వాంపైర్ విమానాలు రాబోతున్నవి. భారతదేశం బ్రిటన్‌వద్ద వీటిని కొనుగోలుచేసింది భారత వైమానిక దళానికి చెందిన వైమానికులే వీటిని స్వయంగా మన దేశానికి తీసుకువస్తారు ఇదివరలో బ్రిటన్ నుంచి తెప్పించుకున్న విమానాలకంటె ఇవి ఉత్తమమైనవని తెలియవస్తున్నది వీటిలో అమర్చిన చిన్న, పెద్ద యంత్రపరికరాలన్నీ బెంగుళూరులోని హిందూస్థాన్ ఏర్ క్రాఫ్ట్ కంపెనీలో తయారయ్యే వాటిలో కంటే చాలా మేలురకానివనీ, అతి అధునాతనమైన వనికూడా ప్రతీతి ఇవి ఇద్దరేసి కూర్చోడానికి వీలైన విమానాలు

ఇంతకూ ఇప్పుడు వస్తున్న ఈ కొత్త విమానాల కొనుగోలులో విశేషమేమిటంటే వీటిని అనుభవజ్ఞులైన భారతీయ వైమానికులు నడుపుకురావడమే

ఖండాంతరాలనుంచి విమానాలను తీసుకురావలసివచ్చినప్పుడు సమర్థులు, అనుభవజ్ఞులు అయిన వైమానికులను మాత్రమే శ్రద్ధగా నియోగించవలసివుంటుంది. ఇతర అధునిక యుద్ధవిమానాలలో ఒక్క చోదకుడు మాత్రమే కూర్చోడానికి వీలుంటుంది ఆ ఒక్క చోదకుడే సిగ్నలర్‌గా, గన్నర్‌గా కూడా పని చేయవలసి వుంటుంది ఇది చాలా ప్రమాదకరమైన, అసౌకర్యమైన విషయం అలాగాకుండా యీ డబుల్ సీటర్ విమానాలలో ఒకరికొకరు సహాయంగా ఇద్దరేసి కూర్చొని పని చేయడానికి వీలుంటుంది ఒకొక్క విమానానికీ, ఒకొక్క పైలటు, ఒకొక్క నావిగేటర్ చొప్పున భారతీయ వైమానికులు జట్లుజట్లుగా కొన్ని నెలలపాటు పనిచేసి ఈ కొత్తరకం వాంపైర్ విమానాలను స్వదేశానికి చేర్చవలసివుంటుంది వీటిలో కొన్నిటిని నౌకల మీద తీసుకురావడానికి వీలున్నది అయితే, భారతీయ విమానదళం త్వరితగతిని బలపడాలంటే వీటిని వైమానికులద్వారా తెప్పించుకోవడమే మంచిపద్ధతి కాని, వైమానికులద్వారా తెప్పించుకోవడమన్నది అత్యంత వ్యయప్రయాసలతో కూడుకున్న విషయం విదేశీ వైమానికులను ఇందుకు నియమించదలిస్తే, వారి లైసెన్సులకనీ, వేతనాలకనీ, ఇన్సూరెన్సుకనీ, మధ్య మజిలీలకనీ, తిరుగు ప్రయాణానికనీ, బోలెడంత ఖర్చు అవుతుంది. ఆ ఖర్చంతా భారతదేశమే భరించవలసివస్తుంది భారతీయ వైమానికదళానికి చెందినవారిచేతే యీ పని చేయించుకుంటే, ఈ భీమాకు, మజిలీలకు,



రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ శాసనాన్ని అనుసరించి కొత్తగా ఏర్పడిన దక్షిణ ప్రాంతీయమండలానికి భారత హోంశాఖమంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ ఈ నెల 11 వ తేదీన మద్రాసులో ప్రారంభోత్సవం చేశారు. మండలి కార్యవర్గసభ్యులకు మద్రాసు కార్పొరేషన్ సన్మానంచేసినసందర్భంలో శ్రీ సంజీవరెడ్డి, పంత్, మేయర్ శ్రీనివాసన్, మద్రాసు గవర్నరు జాన్, భక్తవత్సలం.



వికాసయాత్రా పథకంకింద, దక్షిణభారతదేశం చూడడానికి మద్రాసువచ్చిన, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం విద్యార్థులు.

లైసెన్సులకు అయ్యేఖర్చులు కొన్ని ఎలాగూ తప్పకపోయినప్పటికీ, మిగతా ఖర్చు చాలా భాగం మనకు కలసివచ్చేమాట వాస్తవం. మన వైమానికులే అయితే మామూలుగా విదేశాలకు వెళ్ళే విమానాలలో బయలుదేరి ఇంగ్లండువెళ్ళి అక్కడినుంచి కొత్తవాంపైర్ విమానాలను స్వయంగా నడుపుకుని తిరిగి రావడానికి వీలవుతుంది. అంతవరకైనా ఖర్చు కలసివస్తుంది. ఇంతేగాక, భీమాకు, లైసెన్సులకు, అక్కడక్కడ మజిలీలకు విదేశీ వైమానికులకు అయినంత ఖర్చు మన వైమానికులకు కాదు. దేశంఆర్థికంగా విపరీత క్లిష్ట పరిస్థితులలో వున్న ప్రస్తుత సమయంలో ఏమాత్రం ఖర్చు కలసి వచ్చినా వచ్చినట్లే. మన వైమానికులనే ఇందుకు ఉపయోగించుకున్నందువల్ల మరొక పెద్ద ప్రత్యక్ష ప్రయోజనంకూడా లేకపోలేదు. ఖండాంతరలలోని వివిధ దేశాల శీతోష్ణ పరిస్థితులలో ఈ కొత్త విమానాలను నడపడానికి మన వైమానికులు అలవాటు పడి, కొంత తరిఫీదు పొందినవారుకూడా అవుతారు

భారతీయ వైమానిక వర్గానికి చెందిదవారు ప్రప్రథమంగా 1948 లో కొన్ని టెంపెస్ట్ యుద్ధ విమానాలను ఇంగ్లండునుంచి మన దేశానికి తరలించుకు వచ్చారు. ఈ టెంపెస్ట్ విమానాలు ఇప్పుడు వాడకంలో లేవు. కొన్ని పాతరకం వాంపైర్ విమానాలను కూడా కెప్టెన్‌కన్వార్ జస్వంత్ సింగ్ నాయకత్వాన మన వైమానికులు ఇదివరలో నడుపుకు వచ్చారు. గ్రూప్ కెప్టెన్ హెచ్. మూల్గావ్‌కర్ నాయకత్వాన కొన్ని 'తుఫాన్' విమానాలను కూడా ఫ్రాన్సు నుంచి తీసుకొచ్చారు. "టర్బో-ప్రీప్ వైకౌంట్" తరగతికి చెందిన మరికొన్ని విమానాలను కూడా మన వైమానికులే దేశానికి చేరవేశారు.

మన దేశంలో విమాన పరిశ్రమ అభివృద్ధి చెందినకొద్దీ విదేశాలనుంచి విమానాలను తెప్పించుకోవలసిన అగత్యమే క్రమక్రమంగా తగ్గిపోతుంది. ఈ లోపుగా మనకు కావలసిన విమానాలను మన వైమానికులను ఆయా దేశాలకు పంపించి స్వయంగా వారి ద్వారా తెప్పించుకోవడమే అన్ని విధాలా ఉత్తమమైన చౌకపద్ధతి అనడంలో సందేహం లేదు.

* * *

సైనిక శాఖలో కేప్టెన్, మేజర్ పదవులలోకి ప్రమోషన్‌కోరే సైనికశాఖ ఉద్యోగులందరూ (పదాతి దళాలకు చెందినవారు) ప్రత్యేకంగా ఒక పరీక్షలో ఉత్తీర్ణులు కావాలనే నియమం ఒకటి వున్నది ఈ నియమం ఇప్పటివరకూ సైన్యంలోని విద్యాశాఖకు చెందిన ఆఫీసర్లకు మాత్రం వర్తించేది కాదు. సైన్యంలోని విద్యాశాఖకు చెందిన ఆఫీసర్లుకూడా ప్రమోషన్లకు పరీక్షలో ఉత్తీర్ణులు కావలసి వుంటుందని ఆదేశిస్తూ ఈ నియమాన్ని ఇప్పుడు మార్పుచేశారు.

(48-వ పేజీచూడండి)



ఇటీవలి అమెరికా పర్యటనలో శ్రీ ఎన్. జి. రంగా, శ్రీమతి రూజ్‌వెల్ట్.




గరికిపాటి
సత్యనారాయణరావు

రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని వేంగి దేశాన్ని పరిపాలిస్తున్న రోజులవి. నన్నయ భట్టారకుడు ఆయన ఆస్థానంలో కవీశ్వరుడుగా, పురోహితుడుగా, అమాత్యుడుగా వుంటూ సమస్త రాచకార్యాలు కొనసాగిస్తున్నాడు.

రాజరాజు మహోవైభవాన్ని పొందుతూ అఖండమైన కీర్తిని ఆర్జించాడు రాజదర్శనం కావాలంటే అనన్య సామాన్య లభ్యంగా వుంటూ వచ్చింది.

ఆ కాలంలోనే ద్రాక్షారామకు సమీపంగా అంటే సుమారు నాలుగైదు క్రోసుల దూరంలో వేములవాడనే చిన్న గ్రామంలో భీమకవి అనే ఒక నియోగి బ్రాహ్మణుడుండేవాడు. భీమకవి భీమేశ్వరుని అనుగ్రహంవల్ల పుట్టిన మహాకవి.. నిరుపేద. రాజరాజు పేరు ప్రతిష్ఠలు వింటూవచ్చిన భీమకవికి ఒక చిన్న ఆలోచన తట్టింది తాను అనేక వ్యయప్రయాసలకోర్చి రచించిన రాఘవపాండవీయాన్ని రాజరాజుకు అంకితమిచ్చి సత్కారముల పొందాలని ఉవ్విళ్లూరాడు.

రాఘవ పాండవీయం ద్వ్యర్థికావ్యం. అంతకుముం దెప్పుడూ ద్వ్యర్థికావ్యాన్ని ఏ కవీ రాయలేదు అంటే అంత కష్టతరమైన కావ్యమన్నమాట.

సరే! ఒక సుముహూర్తాన రాజమహేంద్రవరానికి బయలుదేరాడు భీమకవి. గమ్యస్థానం చేరుకొన్నాడన్నమాటే గాని, అతగాడికి రాజదర్శనం అయ్యే అవకాశాలు

ఏకోశానా కానరా లేదు.

ప్రతిరోజూ ప్రాణం విసిగేలా, కాళ్లు అరిగేలా కోట ప్రాకారం చుట్టూ తిరగటం, నిరాశతో నిస్పృహతో వెనుదిరిగిపోవటం జరిగేది. చివరికి ప్రాణం విసిగి ఒక నిర్ణయానికి రాగలిగాడు భీమకవి. అదేమంటే?... రాజరాజు అంతరంగిక మిత్రుడు నన్నయ భట్టారకుడని, ఆయన్ను ఆశ్రయిస్తే తన కోర్కె సఫలీకృతం కాగలదని నిర్ణయించుకొని, నన్నయభట్టారకుని గృహానికి చేరుకొన్నాడు. తాను అనుకొన్నట్లుగానే నన్నయభట్టారకుని దర్శనం సునాయాసంగా చేసుకోగలిగాడు. నన్నయభట్టారకుడు భీమకవిని ఉచితరీతిని సత్కరించి అతిథి మర్యాదలు చేశాడు. ఉభయులు తాంబూలం సేవిస్తూ ఊయలబల్లమీద తిష్ఠ వేసి, ఉల్లాసంగా ఊగుతూ ఆ చిరుగాలికి దేహాన్ని అరబెట్టుకుంటూ వున్నారు. ఉన్నట్టుండి నన్నయభట్టారకుడన్నాడు.

"ఆ!...తమరింతకూ ఈ గ్రామం రావటం దేనికోసం?"

భీమకవి చిరునవ్వు చిందిస్తూ అన్నాడు: "రాజదర్శనం చేసుకోవాలని"

"ఏమిటీ?. .రారాజు దర్శనమా?"

"ఊ" స్పష్టంగా అన్నాడు భీమకవి.

"మీరు కవిపుంగవులా?"

"అవునూ.. ఏం?"

"అహ ఏంలేదూ!.. ఏ గ్రంథాన్ని 'అంకితమిస్తారూ?" ఆత్రంగా అడిగాడు నన్నయ.

"రాఘవపాండవీయం....ద్వ్యర్థి కావ్యం లెండి" నిర్లక్ష్యంగా సమాధానమిచ్చాడు భీమకవి.

"ద్వ్యర్థి కావ్యమా?" అత్యాశ్చర్యంతో క్షణకాలం నిశ్చేష్టుడయ్యాడు నన్నయ.

అతని మస్తిష్కంలో.. ............ ఒక్కుమ్మడిగా ఎన్నో ఆలోచనలు కెరటాల్లా పొంగి పొరలుతున్నాయ్...... ఉన్నట్టుండి అతనిలో ఈర్ష్యకూడా రాజొచ్చింది తాను నిజానికి సరసమైన కవిత్వాన్ని చెప్పగలడు. తలచుకొంటే ద్వ్యర్థికావ్యాన్ని రచించగలడు కూడ. . కానీ అనేక కష్టాలుపడి తానా గ్రంథం వ్రాయటానికి వెనుకంజవేశాడు. ఈరోజున భీమకవికి రాజదర్శనం చేయిస్తే రాజరాజు తన్నుకూడా ద్వ్యర్థికావ్యాన్ని వ్రాయమని హుకుం జారీచేస్తాడు. రాజరాజుని తిరస్కరించడం దుర్లభమవుతుంది. తాను ఆ కావ్యాన్ని వ్రాయటానికి పూనుకొంటే అనేక ప్రయాసలకు గురికావలసి వస్తుంది. ఈ గొడవలన్నీ యెందుకూ భీమకవికి రాజదర్శనం కాకుండా చేయటమే తనకు మంచి పని. అదే తనకు అన్నివిధాలా అనుకూలమైంది. ఎవ్విధమైన మోసం చెయ్యటానికైనా తాను వెనకాడకూడదు......యిలా ఎన్నో ఆలోచనలు ఆలోచిస్తూ భీమకవి పిలుపు వినగానే తాను ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు.

"ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" ఊయల బల్లమీదనుంచి కిందికి దిగ్తూ అన్నాడు భీమకవి.

"అహ!...రాజదర్శనం ఎట్లా వీలవుతుందని నా ఆలోచన" వ్యంగ్యం స్ఫురించేటట్లు అన్నాడు నన్నయ భట్టారకుడు.

"ఏం?. తమబోటివారలకది అసాధ్యమా?"

"కాదు.. కానీ .కానీ. ఇఇఇ" నసిగాడు నన్నయ భట్టారకుడు.

"చెప్పండి!...అనుమానమెందుకు"

"ఇప్పట్లో కాదు" అదోరకం గొంతుతో అన్నాడు నన్నయ.

"ఎప్పట్లో అవుతుంది?"

"చెప్పలేను"

"ఓహో!...అసలంటూ వుంటుందా?"

"ముమ్మాటికీ"

"నిజంగా?"

"ఊ" తల పంకించాడు నన్నయ.

"వస్తా"

"చిత్తం!"

భీమకవి అక్కడినుండి తాను ఇన్నాళ్లుగా వుంటున్న సత్రానికి వెళ్ళిపోయాడు. ప్రతిరోజు భీమకవి నన్నయ భట్టారకుని కలుసుకొని అనేకవిధాల ప్రశ్నలు వేసేవాడు. నన్నయ భట్టారకుడు ఏవో సాకులు చెప్తూ యుక్తియుక్తంగా తప్పించుకొనేవాడు.

రోజులు దొర్లిపోతున్నాయ్! భీమకవికి రాజదర్శనం అయ్యే సూచనలు ఏకోశానా గోచరించటం లేదు. అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఏలాగైనా ఈరోజున నిక్కచ్చిగా, నిర్మొహమాటంగా మాట్లాడి అటో ఇటో తేల్చుకోవాలని తనలో తాను ఘాటుగా నిశ్చయించుకొన్నాడు. సరే! బయలుదేరి నన్నయ భట్టారకుని గృహానికి చేరుకొన్నాడు భీమకవి.

ఆ సమయంలో నన్నయ భట్టారకుడు వ్యాసమహర్షి వ్రాసిన సంస్కృత భారతాన్ని ఆమూలాగ్రంగా వల్లెవేస్తున్నాడు. భీమకవి రాకతో అతని మానపఠనానికి అంతరాయం కలిగింది.

"దయచేయండి"!అంటూ ఆహ్వానించాడు నన్నయ భట్టారకుడు భీమకవిని.

భీమకవి కింద పెదవిని పై పళ్ళతో నొక్కిపట్టి, కనుబొమలు చిట్లించి నాటిగా నన్నయ భట్టారకుని కళ్లల్లోకి చూశాడు. ఆ చూపులతో నన్నయభట్టారకుని ముఖంకూడ పూసరవెల్లిలా రంగులు మారుతోంది.

"సత్కారాలూ, ఆహ్వానాలూ అనవసరం . ఆలోచిస్తే అసహ్యంకూడాను... యింతకీ ఏమి నిర్ణయించావ్? రాజదర్శనం చేయిస్తావా? ఇలానే కాలయాపన చేసి మోసం చేస్తావా?" పిడుగులు కురుస్తున్నట్లు అనేశాడు భీమకవి.

"ఏమయ్యోయ్!. మర్యాదిచ్చిమర్యాద పుచ్చుకో! ... అంతే కానీ తొందరపడి మాటలు మిగలకు . నీ విషయం ప్రభువుల వారికి మనవిచేశాం! నీ కృతిని స్వయంగా ఆమూలాగ్రంగా పరీక్షిస్తే గానీ, రాజదర్శనం కలగదని ప్రభువుల ఆజ్ఞ. అందుకు నీవు సంసిద్ధుడవేనా?..."

"నిస్సందేహంగా!...యిదిగో గ్రంథం. నే వెళ్తొస్తా!. అయిదురోజుల్లో మళ్లా పునర్దర్శనం చేసుకొని వివరాలు తెలుసుకొంటాను ..సెలవ్" అంటూ చరచరా అడుగులు వేసుకొంటూ వెళ్లిపోయాడు భీమకవి

నన్నయభట్టారకుడు, వ్యాసులవారి సంస్కృతభారతాన్ని ప్రక్కకునెట్టి, రాఘవపాండవీయాన్ని చదవ నారంభించాడు. మధ్య మధ్య కొన్ని అంశాలు చదవటంతో భీమకవి యొక్క కవితాధోరణి అతనికి కరతలామలకమయింది. ఆలా శూన్యంలోకి చూస్తూ ఆలోచించటం మొదలెట్టాడు.

రాఘవపాండవీయము రచన అతిప్రతిభావంతంగా సాగింది గూఢార్థములతో, ద్వంద్వార్థములతో మిళితమై మిక్కిలి కొనియాడతగినదిగా వుంది. ఆలోచిస్తే అతని ముందు తాను అన్నివిధాలా దిగదుడుపే!. . రాజరాజు ఈ గ్రంథాన్ని పరిశీలించి, పరీక్షిస్తే తన్ను హీనంగా చూడటం జరుగుతుంది. అది ముమ్మాటికి సత్యం. గతంలో తన కున్న పేరు ప్రతిష్ఠలు త్రుటిలో మాయమవుతవి. ఆ పేరు ప్రతిష్ఠలు భీమకవి అధీనమై అలరారుతవి. అతగాడు తన స్థానాన్ని సునాయాసంగా పొందగలుగుతాడు తాను జీవచ్ఛవంలా వుండటం జరుగు

(56-వ పేజీ చూడండి)

# సరళ ప్రేమించింది

లోకం ఏమైపోయినా లెక్క చేయకుండా ఎప్పుడూ హుషారుగా వుండే సుబ్బారావు అనాదావిధంగా వుంటే నా మనస్సు చెదిరిపోయింది. కళా విహీన దృక్కులు శూన్యంలోకి ప్రసరింపజేస్తూ అలాగే కూర్చున్నాడు. నిశ్శబ్దతను భరించలేక "ఏమిట్రోయ్. అలాగున్నావ్" అన్నాను.

శూన్యంలోంచి చూపు మరల్చనే లేదు వాడు. మనిషిని కదిపి మళ్లీ అడిగాను. వాడు మాట్లాడలేదు. వాడికి నావద్ద దాపరిక మేమీ లేదు. నాతో చెప్పగూడని విషయా లేమీ లేవు. "చెప్పకుంటే నామీద ఒట్టు" అన్నాను. టేబుల్ సొరుగులోంచి ఓ పాత డైరీ తీసి, ఒక పేజీ చూపి "యిక్కడినుంచి చదువు. అర్థమౌతుంది." అన్నాడు.

* * *

14, ఆగస్టు, 53.

"సాయంకాలం కడపటి గంటలో క్లాసు ఎగ్గొట్టి వస్తున్నాను. కొంత దూరం వచ్చేప్పటికి సరళగూడా వెళ్తుండడం చూచాను. ఆమెతో మాట్లాడేందుకిదే సమయమనుకుని నడక వేగం హెచ్చించి ఆమె ప్రక్కకు చేరాను.

ఏమండీ కాలేజినుంచి వచ్చేస్తున్నారే?" అన్నాను.

"ఏం లేదండి తలనొప్పిగా వుంది. అంతే," అంది ఆమె తల వొంచుకునే.

ఆమె బాధ ఉపశమనం చేసేందుకు నావద్ద ఏమీ లేకపోయినందుకు ఎంతో చింతించాల్సొచ్చింది.

నా జీవితంలో నా ప్రేమకు పాత్రురాలైన వ్యక్తి ఆమే. ఒక్క రోజు ఆమెను కాలేజిలో చూడకుండా దినం గడపలేను. కాని ఆమెతో మాట్లాడే అవకాశం ఎన్నాళ్ళకూ రాలేదు. నేనూ, భాస్కరం ప్రక్క ప్రక్కనే కూర్చునేవాళ్ళం క్లాసులో. ఆమె కళ్లు మావైపే ... ముఖ్యంగా నావైపే వుండేవి. అవే మాట్లాడుకునేవి . నవ్వుకునేవి. నా ప్రేమ నామె గ్రహించినందుకు పొంగిపోయాను..."

* * *

"ఎవ్రా ఈ సరళ" అన్నాను సుబ్బారావుతో.

"లక్ష్మీ ప్రెస్ యజమాని శంకరనారాయణగారి ఏకైక పుత్రిక" అన్నాడు సుబ్బారావు.

డైరీ పేజీలు త్రిప్పాను.

20, ఆగస్టు, 53:

తెల్లవారకముందే గది తలుపు బాదిన శబ్దమైంది. నా పేరెట్టి గొంతెత్తి పిలవడం కూడా వినిపించింది. బద్ధకంగా లేచి తలుపు తీశాను. అజానుబాహుడు, అరవింద దళాయితాక్షుడు... ప్రాణస్నేహితుడు... ప్రక్క సీటువాడు... భాస్కరం నిల్చున్నాడు నవ్వుతూ.

"ఏంరా! ఏం కొంప మునిగింది? ఇంత ప్రొద్దున్నే తయారయ్యావ్", అన్నాను విసుగా.

"భాన్సురా. భాన్సు! నేనంటే ఏమనుకున్నావ్... పా లోపలికి" నన్ను నెట్టుకుంటూ లోపలికి దూరాడు.

భాస్కరం ప్రారంభించాడు. "రాత్రి సినిమాకెళ్లాను. సరళ గూడా వచ్చింది. కూడా ఓ చిన్న పిల్లని వెంటేసుకొచ్చింది. ముందు నన్ను చూచి నవ్వింది. తిన్నగా ఆమె వెనకాలే సీటు సంపాదించాను.

ఆర్. ఎస్. జి. కృష్ణమూర్తి

అక్కడ ఆట్టే జనంగూడా లేరు. పిక్చరు ప్రారంభించాక ఆ చిన్నపిల్ల నిద్రపోయింది. ఇక మేమిద్దరం మాటల్లోకిదిగాం. మాటల్లో ఆమె నన్నెంతో ప్రేమిస్తున్నట్టుగా చెప్పింది. అబ్బ! నిజంగా సరళ పలుకులు చిలుకపలుకులు. ఆమె కంఠం కోకిలకంఠం. అసలు ఆమె వికసించిన లక్షు గులాబీ పూలతో నిండివున్న దివ్యక్షేత్రం" అంటూ తన్మయత్వం బొందాడు భాస్కరం.

నామీద పది పిడుగులు ఒక్కసారిగా పడ్డట్టయింది!

వెయ్యి విమానాలు నా చెవిచుట్టూ తిరిగినట్టయింది!!

ఓ వంద ఆటంబాంబులు నామీద కుమ్మరించినట్టయింది!!!

"నీవు మాట్లాడావుట గదుట్రోయ్ సరళతో" అన్నాడు భాస్కరం.

"అని నీకు చెప్పిందా?"

"ఆ. నిన్ను ఆమె చాలా మెచ్చుకుందిరా. ఆ రోజు నీవు చాలా బాగా పాడావుట. బాగా సాధనచేస్తే నీవూ మహమద్ రఫీ బావమరదుల్లా వుంటారుట సంగీతంలో."

వాడి మాటలు నా చెవుల్లో దూరటం లేదు!

12, సెప్టెంబరు 53:

గదితలుపు తియ్యగానే ఓ కవరు కనిపించింది. చించాను. దాన్లోని ఉత్తరంపైన "దీన్ని మీ స్నేహితుడు భాస్కరంగారికివ్వండి...సరళ" అని వ్రాసివుంది. తెరచి చూడాలని వుబలాటపడ్డాను. తెరిచాను. అంతా ప్రేమ గొడవే. ఆవిడ కెనాటికైనా భాస్కరమే శరణ్యమట. కాని నాడు ఆత్మహత్య తథ్యమట. ఈ వ్యవహారమే అంతా... దాన్ని చించి దూరంగా పారెయ్యాలనిపించింది. కాని ప్రాణ స్నేహితుడు భాస్కరం. ఈ విషయం తెలిస్తే బాధ పడతాడు నేను వాళ్ళిద్దరి దృష్టిలో ఓ నీచుడినై పోతాను.

ఆ ఉత్తరం భాస్కరానికివ్వక తప్పింది గాదు.

* * *

ఆ తర్వాత భాస్కరానికి ఎన్నో ఉత్తరాలు నా అడ్రసుకే వచ్చాయి. అన్నిట్లోనూ నన్నూ, నా సంగీతాన్ని ఎంతో మెచ్చుకుంటూ వ్రాసేది.

ఆమెనుంచి నే నాశించింది ప్రేమ కాని నాకు లభించింది మెప్పులు. కడకు వీళ్లిద్దరి మధ్యా 'నేనో' అను సంధాన కర్తగా తయా

రయ్యాను. ఆవిడవద్దనుంచి వచ్చే ఉత్తరాలన్నీ భాస్కరానికి అందజేసేవాడిని. భాస్కరం ఉత్తరాలు రాసే పద్ధతే వేరు. ఓ నలభై పేజీల పుస్తకంకొని దాన్లో నాలుగైదు పేజీలు వుత్తరంరాసి, ఆమె కాలేజీ కెళ్ళేప్పుడు ఆ పుస్తకాన్ని రిక్షాలో పడేసేవాడు. ఇదే వాడి పద్ధతి

ఈ విషయాలన్నీ నాకు తెలుసు. కాని ఏమీ చేయలేనివాణ్ణయ్యాను. ఒక్కో వుత్తరం వచ్చినపుడు నా హృదయం బ్రద్దలయ్యేది. అసూయ ముంచుకొచ్చేది. పిచ్చివాడిలాగ గంతులేసేవాడ్ని. భాస్కరంతో తెగతెంపులు చేసుకోవాలనుకునేవాణ్ణి కాని అలా ఏనాటికి జరిగేది కాదు.

కాలేజిలో ఆవిడ ముఖం చూడ్డం మానేశాను. అంతకుముందుగూడా ఆమె చూచింది భాస్కరంవైపే నావైపేనని భ్రమపడి ఈ స్థితికి వచ్చాను. నన్ను నేనే ఊబిలోకి దించుకున్నాను కడకు మనశ్శాంతి లేని వాణ్ణయ్యాను.

* * *

1, అక్టోబరు, 53 :

నా చిన్ననాటి స్నేహితుడు ప్రభాకరం రోడ్డుమీద కనిపించాడు. పిచ్చాపాటి మాట్లాడి, తర్వాత కలుసుకుంటానని వెనక్కి తిరిగాను. సరళ ఆ రోడ్డమ్మటే వస్తూంది. ఆమె ముఖంలోకి చూచి ఎన్నో రోజులయింది. ఆమెనుంచి చూపులు మరల్చుకోడం అలవాటయిపోయింది. తక్షణం తల దించేసి నెమ్మదిగా నడుస్తున్నాను.

నా స్నేహితుడు ప్రభాకరం సరళను పలకరించాడు. అలా వెళ్ళి కాఫీ తాగుదాం రమ్మన్నాడు సరళని. ఆమె రానని చెప్పడం నాకు వినిపించింది. "అవున్లే. నువ్వెందుకొస్తావ్" అన్నాడు ప్రభాకరం అదోవిధంగా ముఖం పెట్టి. ఆమె చరచరా వెళ్ళిపోయింది.

2, అక్టోబరు, 53 :

ఓ ఉత్తరం సరళవద్దనుంచి భాస్కరానికి వచ్చింది. అందులో రాసివుంది "మీ స్నేహితుడు సుబ్బారావు మంచివాడనుకున్నాను. పయోముఖ విషకుంభం. తేనె పూసిన కత్తి. మన విషయమంతా నిన్న మా బావ ప్రభాకరానికి చెప్పినట్టున్నాడు. మాబావ నాతో ముభావంగా వుంటున్నాడు. నాకేదో భయంగావుంది. మీరు మీ స్నేహితుడ్ని నమ్మకండి. అతను మంచివాడు కాదు"—

నా కాళ్ళక్రింది భూమి గిర్రున తిరిగిపోతోంది. ఏ పాపమూ ఎరుగని నామీద ఈ నిందా! ప్రభాకరం సరళకు బావవుతాడని నాకు తెలీదు. సరళ విషయం ప్రభాకరంతో ప్రస్తావించాల్సిన అవసరం నాకు కలగలేదు. ఈ నిందను నేనెలా భరించగలను! భాస్కరానికి నేనెలా నచ్చచెప్పగలను! నా నిర్దోషిత్వాన్నెలా ఋజువుపరచుకోగలను!

భాస్కరం వుత్తరం చదువుతున్నపుడు వాడి ముఖకవళికలు గమనిస్తూ కూర్చున్నాను. క్రమంగా ముఖం కోపంతో ఎర్రబడిపోయింది ఉత్తరమంతా చదివి పళ్ళు పటపట కొరికాడు. వాడి కళ్ళలోని ఎరుపురేఖల్ని గమనించాను. వణికిపోయాను. వీడూ అదే నమ్మాడా?...నా నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోలేనా? ఈ నిందను నేను మోయాల్సిందేనా?...

భాస్కరం కంఠం ఖంగుమంది.

"నాకు ముందే తెలుసు. ఆడవాళ్ళతో కొంచెం జాగ్రత్తగా వుండాలి. మనిద్దరం స్నేహితులమనీ, మనిద్దరిమధ్య తగాదా పెట్టాలనీ కుట్రబన్నింది. వీడు...యీ భాస్కరం యిలాంటివాటికి తొణికే రకంగాదని తెలీదు గాబోలు. అప్రాచ్య..."

"ఏమిటి భాస్కరం. ఆవిడ రాసిందే అనుకో. పోనీ, దీన్లో మనకేం పోయింది" అన్నాను. వాడికి నాపైనుండే ప్రేమకీ, అచంచల విశ్వాసానికీ నాకే ఆశ్చర్యమేసింది. నాకే నేనైతే ఎలా వుండేదో పరి

# ★ సరళ ప్రేమించింది ★

స్థితి? భాస్కరంలాంటి స్నేహితుడు నాకున్నందుకు ఎంతో గర్వపడ్డాను. మా ఇద్దరి జీవితాల్లోనూ, మా స్నేహానికి ప్రతి బంధకాల్ని ఎవ్వరూ కల్పించలేరని వుప్పొంగిపోయాను.

8, అక్టోబరు, 53

హడావుడిగా వచ్చాడు భాస్కరం.

"ఏడా పెడా తిడుతూ వ్రాసేశాను. దానికి బాగా బుద్ధి చెప్పాను ఇక యిలాంటి విషయాలెత్తితే నీ ముఖం చూడనన్నాను. ఇప్పుడే రిక్షాలో పడేసి వచ్చాను. మంచి నీళ్ళు..." అన్నాడు.

బ్రహ్మానందమైంది. వాడిలాంటి స్నేహితుడు నాకున్నందుకు నే నెంతో పుణ్యం చేసుకున్నాను. నన్ను నేను అభినందించుకున్నాను. కాని పైకి అనలేకపోయాను-అదే నాలో వుండే బలహీనత—

5 నవంబరు 53:

భాస్కరం జేబులోంచి ఓ శుభలేఖ తీసిచ్చాడు.

"ఒరేయ్. నిన్ను పెళ్ళికి పిలవడమేమిటీ, పిచ్చిగాని. ఆ రోజు సర్వం నువ్వే చూడాలిరా. మన ఫ్రెండ్సుకు కావలసిన వన్నిటికీ నువ్వే ఇన్‌ఛార్జి" అన్నాడు

"అయితే ఎవరితోరా పెళ్ళి - సరళతోనే..?"

"ఛా.. దాన్నెవడ్రా చేసుకుంటాడు? నీకూ నాకు వ్యవహారం పెట్టాలని చూచిందే! దాన్ని చేసుకోను నేనంత తెలివిహీనుణ్ణనా నీ అర్థం. కవరు తీసి చూడు తెలుస్తుంది" అన్నాడు భాస్కరం.

2, డిసంబరు, 53

భాస్కరం పెళ్ళివైభవంగా జరిగింది. పెళ్ళికుమార్తె మహాలక్ష్మిలా వుంది. భాస్కరం అదృష్టవంతుడు.

4 డిసంబరు 53.

మళ్ళీ సరళవద్దనుంచి వుత్తరం వచ్చింది. కాని అది నాకే వ్రాయబడి వుంది.

"భాస్కరాన్ని నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. అతనూ నన్నావిధంగానే ప్రేమిస్తున్నాడని నమ్మాను. నన్ను పెళ్ళాడతానని మాటిచ్చాడు. నన్ను స్వర్గంలో విహరించేటు చేస్తానన్నాడు. కాని ఒక్కసారిగా అధోలోకంలోకి తోసేశాడు. నేనే పాపం చేయలేదు. అతన్ని నాదైవంలా పూజించాను. కాని మోసంచేశాడు..." ఇలా సాగింది సరళ వుత్తరం.

కాని నే నేంచేయగలను? ఆమెఖర్మ ఆమె అనుభవించాల్సిందే తప్పదు. భాస్కరం లాంటివాడు అందని మ్రానిపండు. ఆమెది కుచ్ఛితబుద్ధి. పైఅంధమే కాని హృదయం మంచిదిగాదు. భాస్కరం మంచిపనేజేశాడు.

* * *

డైరీలో ఇక దీనికి సంబంధించిన విషయాలేమీ లేవు. సుబ్బారావువైపు చూచాను. అతడల్లాగే శూన్యంలోకి చూస్తూ చిన్నగా నవ్వుకుంటున్నాడు. క్రమంగా నవ్వుపోయి ఈలపాటలోకి దిగింది. నెమ్మదిగా, కుర్చీలోంచి లేచాడు. లోపలికెళ్ళి ఓపాతఫైలు పట్టుకొచ్చాడు. తెగిపోయినతంతులు సరిజేయడం ప్రారంభించాడు.

"ఒరేయ్ సుబ్బారావ్. ఈవిషయానికి సంబంధించినదంతా చదివేను. ఇంతకీ ఇప్పుడేం జరిగిందిరా అలావున్నావ్?" అన్నాను.

"ఓస్. ఆసంగతా? చెబుతానుండరా." మళ్ళీతంతులు కలపడంలో నిమగ్నుడయ్యాడు.

"చెప్పవోయ్," అన్నాను ఫైలు లాక్కుంటూ.

సుబ్బారావు చెప్పాడు—

"రాత్రి సినిమాకెళ్ళాను. అంతా ఆరోజు భాస్కరానికి ఏర్పడ్డ పరిస్థితులే రాత్రీనూ. ఓచిన్నపిల్ల మధ్యలో నిద్రబోవడం, హాల్లో జనం ఆక్టేలేకపోవడం.

"ఏమండీ—మీస్నేహితుడు కులాసా" అంది సరళ నెమ్మదిగా.

"ఆ—"అన్నాను విసురుగా.

"బిడ్డలెందరు?"

"నలుగురు" అన్నాను సీరియస్‌గా. పెళ్ళయి ఇంకా సంవత్సరం తిరగలేదు.

"ఎందుకండీ అంత కోపం?" అంది. ఆకొద్దివెలుగులో ఆమెకళ్ళలో నీళ్ళుతిరగడం గమనించాను. ఆమెను ఏడిపించాలి. కుళ్ళికుమిలిపోయేట్టు చేయాలి.. ఎలా?

సరళ మళ్ళీ ప్రారంభించింది:

"ఏమండీ ఓమాట. మీపాటంటే నాకు చాలాఇష్టం. మిమ్మల్ని చూస్తుంటే, మీమాటలు వింటుంటే నే నేదోలోకంలో విహరిస్తున్నట్టు భావించి ఆనందిస్తూంటాను. విధివిలాసము తారుమారైంది. భాస్కరంతో నాపరిచయం ఓ పీడకల. ఆ విషయంలో మీమనస్సు నొప్పించివుంటాను. గతాన్ని మరచిపోండి. క్షమించండి.

ఆవిడముఖం చూచాను. చెంపమీద కన్నీరు సంతతధారగా ప్రవహిస్తున్నాయి.

"మీరు ప్రేమమూర్తులు. కళారాధకులు. మీమనస్సునవనీతము. నన్ననుగ్రహించండి" అంది.

ఆవిడ మాటలు వింటుంటే నావంటిమీద తేళ్ళూ, జెఱ్ఱులూ ప్రాకినట్టుంది.

"నీవు కుచ్ఛితమైన మనస్సుగలదానివే గాకుండా, చంచలహృదయవని ఇప్పుడు తెలుసుకున్నాను. మొదట భాస్కరాన్ని ప్రేమించావు అతను నీకు అందలేదు. ఇప్పుడు నన్ననుగ్రహించమంటున్నావు ఇంతకీ నీవు చెప్పేదేదో తెలిసేట్టు చెప్పు," అన్నాను

"ఏమీ లేదు. మిమ్మల్ని నేను యినస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. మీ స్నేహితుడు నన్ను మోసంచేశాడు. మీ కిష్టమైతే మనిద్దరం వివాహం చేసుకుందాము," అంది జాలిగా, నాభుజంమీద చేయివేస్తూ.

"నా స్నేహితుడుచేసిన మోసానికి శిక్ష నాకా? నేను అంతటి త్యాగమూర్తిని కాదు. ఆ కోరిక చంపుకో. అని చరచరా లేచివచ్చేశాను" అని ముగించాడు సుబ్బారావు. ★




(జరిగినకథ: రైలు కదిలింది)

"మేఘునో-జీవిత మేఘునో - నా జీవిత మేఘునో-ఈ నా జీవిత మేఘునో-ఇలలో ఈ నా జీవిత మేఘునో-" అనే పాటని ఆరంభించాడు వరహాలరాజు.

రైలు 'టకటక'ల తాళం ఆ పాటకి వాటంగా పడటంలేదు. రాజు కింకోపాట గుర్తుకు రావటంలేదు.

"ఆదిలోనే అదేదో పాదమూ" అనుకున్నాడు; ఈ అపశకునానికి కొంత నొచ్చుకుని. గిట్టనివాళ్ళు చాదస్తాలంటారు గాని, ఇలాటి శకునాలూ గట్రా నిజమని సినిమా ప్రపంచంలో అంతా నమ్ముతారని రాజు నమ్మకం. అతనికీ ఇటువంటి విశ్వాసాలు చిన్నప్పటినుంచీ ఉన్నాయి.

"ఉండకేంచేస్తాయి. ఏ హీరోగానో, డైరెక్టరుగానో, ప్రొడ్యూసర్ గానో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకోవాలని దేముడు రాసిపడేశాడు కాబట్టే మనకీ నమ్మకాల మీద గురిఉంది" అనేవాడు అతని నేస్తం ముత్యం.

"మరే పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది గదా" అనేవాడు రాజు.

"గురో! బ్రిలియంట్ డైలాగ్ పడేశావు. దీన్నే ఏదో అర్థాంతరన్యాసం అనో ఏదో అంటారుట" అని ఎగిరి గంతేసేవాడు ముత్యం.

అంతా బాగానే ఉంది కాని, ఇప్పుడు పాడినపాటకి రైలు నడకతాళం సరిపడకపోవడం, గింజుకున్నా ఇంకోపాట గుర్తుకు రాకపోవడం ఏమిటి చెప్మా అని మధనపడసాగాడు రాజు.

"చిటపట చినుకులు" అనే పాట సరిపోతుంది: అని సూచించినట్టుగా, పక్కాయన దాన్ని లయబద్ధంగా పాడసాగాడు.

రాజు మొహం విప్పారింది.

"మందేవూరండీ?" అన్నాడు అప్యాయంగా పలకరించి.

"మాది బొంబాయి. మీదేవూరో నాకు తెలీదు." అన్నాడాయన. రైలులోకిదూసుకు వచ్చిన పైరు గాలికి చెదరిపోతున్న మీసాలను కొనగోరుతో సరిచేసుకుంటూ.

"ఓ మాది మెడ్రాసులెండి." అన్నాడు రాజు గంభీరంగా చూస్తూ.

"ఏంచేస్తు ఉంటారు"

"హీరో.. మీరో?" అన్నాడు రాజు.

"ఎడిషనల్ డైలాగ్ ... అంటే అదనపు సంభాషణ అని అర్థం" అన్నాడు ఎదటాయన.

ఎస్. పార్థసారధి

"మా ఫిలిం ఫీల్డుకి కొత్తే అనుకుంటాను."

"మీ దేమిటి మా బొంబాయి ఫీల్డుకి కొత్తే. హాలీవుడ్ లోనే మా ఎడిషనల్ డైలాగు రైటర్లు ఉంటారు. ఇండియా బాగా వెనకబడ్డ దేశంగదా ... అంటే బాక్వర్డ్ కంట్రీ అన్నమాట. బొంబాయిలో నేను చాలా మందితో నన్ను పెట్టుకోమని చెప్పిచూశా. విన్నారుకాదు. అన్ని డైలాగులూ రాసినవాడే కావలిస్తే అదనపు డైలాగులూ రాస్తాడులే అన్నారు. పైగా వాళ్లకి హిందీలో రాసిపెట్టాలిట. నేను ఇంగ్లీషుకి ఛస్తే ఒక్క మెట్టు దిగనన్నాను."

"భలేవారండి... నేనూ అంతే. మామూలు వేషాలూ సైడు హీరోలాటివి బోల్డు దొరుకుతాయి మా ఫీల్డులో. ఛస్తే హీరో రోలుకి తక్కువదేం పుచ్చుకోనని శపథం నాకు" అన్నాడు రాజు గంభీరంగా.

"భేషు. మీ రెందులో నటిస్తున్నారండీ 'మిస్సమ్మ'లో ఉన్నారా?"

రాజు వినమ్రతను అభినయించి మందహాసం చేశాడు.

"లేనండి. ఎన్. టి. రామారావు, ఏ. నాగేశ్వరరావు, యస్. వి. రంగారావు, రేలంగి, సావిత్రి, జమున మొదలగువారు నటించిన ఈ చిత్రానికి శ్రీ ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వం నిర్వహించారు. నెక్స్ట్ పేరా. దీనికి రచయిత చక్రపాణి. సంగీత దర్శకత్వం ఎస్. రాజేశ్వరరావు, ఛాయాగ్రహణం బార్లే. స్టుడియో వాహిని. ఇంకో నెక్స్ట్ పేరా. నిర్మాతలు: నాగిరెడ్డి అండ్ చక్రపాణి. అదండి. అందులో నేను లేను."

"ఐ సీ. ఆడేపాయెగాని, పోనీ మీ రెందులో ఉన్నారుట?"

"చెప్పానుగదండి ఇంకా ఎవరితోనూ కాంట్రాక్టు సైన్ చెయ్యలేదు. బుక్ కాలేదు. ఫోటోలూ అవీ పంపించానండి. చాలామందికి ఉత్తరాలురాశాను. ఇప్పుడు వెళ్ళి ఇక మాట్లాడాలి."

"ఓ అదా. మీరు ఇంకవెళ్ళి ప్రయత్నిస్తారన్నమాట, చెప్పారుగాదూ. హీరోగారూ సిగరెట్టు పుచ్చుకోండి. మాట్లాడదాం"

"మీ రో? అన్నట్టు మీ పేరో? చెప్పారుకారు."

"నా పేరు నరసన్నలెండి. బొంబాయిలో ఉన్నపుడు ఇంకో పేరుండేది కాని, ఇపుడు మెడ్రాసులో ఎందుకని వదిలేశాను. చూశారూ! మీరూ డైలాగులూ బాగా రాస్తారూ." అన్నాడు నరసన్న నవ్వుతూ.

"మరేండి ఏదో అలవాటైపోయిందండి. నేను ఎప్పుడు సంభాషణలుచేసినా రాసినా

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

సంతృప్తికరంగానే ఉంటాయండి సౌందు ఫర్వాలేదు."

"వెరిగుడ్ మెడ్రాసులో మీబసఎక్కడ? ఎవర్ని అడుగుతారు?"

"బసకేం తొందరొచ్చె సార్. సరాసరి, స్టారుస్టారింటికే కారు మీదవెళ్ళి ఫేసు చూపించేసి వేషం ఇప్పించి కొత్తవదనార విందాలకు— అదే ... వేషం ఇమ్మంటాను...ఆనక వాళ్ళేబసచూపిస్తారు."

"బస్. బస్, భలేవాడివయ్యా. అలా వెళ్ళి అడిగేస్తే, ఇలా వెళ్ళిపో అనేస్తారు. నీకసలు టెక్నిక్ తెలీదన్నమాట. అన్‌ఫిట్, యూస్లెస్,హోప్‌లెస్,బిగ్ మెస్.సినిమాలో చేరేవాడికి ఎన్నో అర్హతలు అవసరం. వాటిలో ఒకటో నెంబరు కూడా నీకు తెలిసినట్టులేదు ఒక చిన్నకథ చెబుతావిను.

## ప్రథమ సోపానము

శ్రీకరంబును, తారల కాకరంబును, పేదలకు భీకరంబును నగు బొంబాయి నగరం బొండుగలదు..."

"మేష్టారూ చిన్న సంగతి ..మామూలుగా లైట్ తెలుగులో చెప్పలేరాండి." అన్నాడు రాజు ఇంకో సిగరెట్టు ముట్టించి.

"భేషుగ్గా చెప్తా. ఏంలేదు. అనగనగా బొంబాయి అనేఊరు. ఊరేమిటి నాబొంద. మహానగరం. పెద్ద సిటీ.

నేను కొత్తగా ఆఊరు వెళ్ళినపుడు నాకెవరూ తెలీదు. చేత ఆటే డబ్బులేదు. అయితేనేం, దారుణమైన తెలివితేట లున్నాయి. వెధవది అదేమిటో చిన్నప్పట్నించీ అంతేలే. అయితేనే ఎవడో నీవంటివాడే టోకరా ఇచ్చేసి, పెట్టీ బేడా పట్టుకు చెక్కేశాడు. ఆనక నావంటి వాడే నామీద జాలిపడి, ఆదుకుని పాపం వాదగ్గిరే టోకరా తిన్నాడు.

వాడి ధర్మమా అని బొంబాయిలో కూడా నేను చెలామణీ అవుతానన్న ధైర్యం కలిగింది.

వాడే కబుర్లుచెబుతూ, ఇక్కడలేనివిద్య ఎక్కణ్ణించో మనం తెచ్చామని టముకు వేయిస్తే మనదే రాజ్యం అవుతుందన్నాడు. ఎప్పుడూ అంతేననుకో అబ్బాయి. నేను దిలీప్‌కుమార్‌లా నటించి పారేస్తానంటే, వాడున్నాడుగా మళ్లీ నువ్వెందుకంటారు. అదే ఆర్సన్ వెల్స్ పేరుచెబితే, అమాంతం ఎగిరి గంతెయ్యకపోయినా ముందర తూలనాడరు.

నాజట్టు కట్టిన టోకరాసురుడు ఇలాంటి ప్లానేవేసి, ఆగుట్టు నాకుచెప్పాడు.

తక్షణం నేను వాడిదగ్గిరే నాపెన్ను తాకట్టుపెట్టి పదిరూపాయలు అప్పుచ్చుకున్నాను. అందులో రూపాయ బయానా యిచ్చి ఓచోట గ్రీటింగు కార్డులు ప్రింటు కొట్టించి, శాంపులు కాపీలిమ్మని ముందస్తుగా నాలుగుప్పుచ్చుకు చక్కావచ్చాను. గ్రీటింగ్ కార్డ్స్ అంటే తెలుసుగా. మన పేరు, డిగ్రీ గిగ్రీ ప్రింటుచేస్తారులే. ఏం? సుబ్బరమైన లాండ్రీవాడి దగ్గరకెళ్ళి ఓ జత గుడ్డలు అద్దెకి తెచ్చుకుని, అవి జమాయించి, ఓచిన్న పేపరాఫీసు కెళ్ళాను.

అక్కడ నేనూ ఒకాయనా కలిసి కాఫీ తాగేశాక, నేను హాలీవుడ్ రిటర్న్ అన్న అబద్దాన్ని అరణాలకి అమ్మేశాను.

ఆయనదగ్గిర పలుకుబడి ఉందిట. దాని కింద చాలామంది పడిఉంటారట. ఆయన నన్ను చూసి నిజమే కామోసనుకుని, పేపరాయనకి నన్నుగురించి బాహాచెప్పేసి, రెండు ముక్కలు రాయించేశాడు.

మూడోనాటికి ఆ పత్రిక వచ్చేసింది. నేను వెళ్ళదలుచుకున్న డైరెక్టర్ ప్రొడ్యూసరింటికి స్వయంగా ఓకాపీ పంపించాను.

ఆ సాయంత్రం కార్డుపంపించి, నేటి సినిమాఫీల్డులో అడిషనల్ డైలాగు రైటింగు (అనగా అదనపు సంభాషణా రచన) ఎంత అవసరమో దంచికొట్టి ఉపన్యసించేశాను.

నమ్మేడో లేదో తెలీదుగాని, వాళ్ళింటో ఓగది కాళీ చేయించి, అక్కడ ఉండమన్నాడు. నేను హఠాత్తుగా కొన్ని చిక్కుల్లోపడ్డట్టు చెప్పాను. నా సామాను, నాపర్సు ఓడలో వస్తున్నాయనీ, నేను విమానంలో ముందస్తుగావచ్చేశాననీని.. నమ్మక ఛస్తాడా అబద్ధంచెబితే గోడకట్టినట్లు చెప్పమన్నారు. నేను లావుపాటి గోడకట్టినట్టు చెప్పేశానులే.

సరే అయన్తో ఆ స్టుడియోకీ ఈ కంపెనీకీ తిరగడంలో నలుగుర్నీ కలుసుకొన్నాను.

చెప్పొద్దూ, నాకు చిన్నప్పట్నించీ ఎంతె దారుణమయిన తెలివితేట లున్నాయో అంత దారుణమైన చురుకుదనం, చొరవా కూడా ఉన్నాయి. అందుకని ఏ దిలీప్‌కుమారో ఎదురవగానే "క్యా దలీప్ భయ్యా తబీయత్ కేసే," అనేసేవాణ్ని భుజం చరిచి. నేనెవడో తెలీక అతగాడు విస్తుబోయేసరికి, నాకూడా ఉన్నాయన పరిచయం చేసి ఎడిషనల్ డైలాగ్ రైటర్ అనేవాడు.

'ఫ్రమ్ హాలీవుడ్' అని రక్కున చెప్పేసేవాణ్ని నేను. ఎందుకనోగాని ఆయనమటుకు ఎందరికి పరిచయం చేసినా హాలీవుడ్ సంగతి మర్చిపోయేవాడు.

మొత్తానికి ఇలా చాలామందితో నాకు పరిచయం కలిగింది. చూశావా నా నేర్పు. ఛాన్సు అడగడానికి ఇదో మంచిపద్ధతి అన్నమాట. నీకు ఇంత బుర్ర ఉందా?

(రాజు అడ్డంగా తల కొటించి లేదు అన్నాడు.) నరసన్న కథ సాగించాడు:

ఇంక మా యింటాయన కారు డ్రైవరు రుమాల్ సింగ్, దర్వాన్ జమాల్, గుమాస్తా పెరుమాళ్, సెక్రటరీలు పరమానంద్, రామలాల్‌లు మరీ ఫ్రెండ్లయి పోయారనుకో. నేనంటే ఎంతో గౌరవం. షీలాదేవిఅని ఇంకోవంటావిడవుండేది.ఆవిడ ఇంగ్లాండ్ రిటర్న్‌ట. ఇంగ్లీషు వంటలు స్పెషలైజ్ చేసింది.

వాళ్లందరికీ కూడా దారుణమైన ప్రభుభక్తిలే. ఎంతో నేచెప్పలేను.

డ్రైవరు రుమాల్‌సింగ్ ఉన్నాడా. రాత్రి పదైనాసరే పధ్నాలుగైనాసరే. అలా ఉండిపోయేవాడు యజమానికి కారు కావాల్సొంటుందని.

'వెళ్లి ముద్దమింగిరావయ్యా'అని హిందీలో చెప్పేవాడనుకో.

అచ్చుకాని.వేదాంత పుస్తకాలు బొచ్చెడన్ని రాసి కూర్చున్న తత్వశాస్త్రజ్ఞుడులా దిగులు మొహం పెట్టి "నా జీవిత లక్ష్యం మీ కారు తోలుతూ దాని సేవచేయడమే. ఈ రుమాల్‌సింగ్ అంతకన్న కోరే దింకోటి లేదు" అనేవాడు హఠాత్తుగా— ఉంటే ఆకాశం, లేపోతే, ఇంటివాసాలవంక చూస్తూ. అలాగే జమాల్, అలాగే పెరుమాళ్. అహోరాత్రాలు పనిచేసి కళ్లెర్రగా చేసుకునేవారు. ఏమలా ఉన్నావంటే, "జీవితమే విచిత్రమైనది" అనేవారు గంభీరంగా.

ఆషానిరాషల మధ్య అల్లాడుతూ, అనంతంగా అవస్థలు అడుతూ (ఇవన్నీ హిందీలో అనేవారనుకో) అంటూ ఏదో సోదిలాంటిది చాలా చెప్పేవారు.

ఒక్కొక్కసారి మే మందరం 'లాన్' లో కూచుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటాము.

దర్వాన్ భారంగా అడుగులువేస్తూ వచ్చి తలవంచుకుని నిలబడేవాడు.

ఏమిటి సంగతి అంటే ఓ కథ చెప్పేవాడు.

గేటుదగ్గరకి ఏడేళ్లపసివాడూ,పదిహేనేళ్ల బాలకుమార్తె వచ్చి, కన్నీళ్ళతో సినిమా ఛాన్సు అడిగి, లేదనిపించుకుని ఎలా విచారంగా వెళ్లిపోయేవారో, మాతాలూకు హృదయాలు కరిగిపోయేలా చెప్పి మళ్ళీ తలవంచుకుని భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయేవాడు గేటులోకి.

తక్షణం సెక్రటరీ రామలాల్ "బ్యూటిఫుల్ సీక్వెన్సుకదూ" అని ముగ్ధుడైపోయి అలా శూన్యంలోకి చూసేవాడు.

"యస్.. వెరీ..." అంటూ సెక్రటరీ

(55-వ పేజీ చూడండి)

# ప్రత్యక్షంలో పరోక్షం

వసంతశోభతో కలకలలాడే ఉద్యానవనం! మామిడిగున్నపై దోబూచులాడే పికసంతానం! అనురాగాన్ని తీర్చిదిద్దే సంధ్యారాగం! కుసుమసౌరభంతో గుబాళిస్తున్న పిల్ల తెమ్మెరలు! మకరందాస్వాదనలో మైమరచిన మత్తమధుపాలు! మాలతి పందిరిక్రింద పత్రికను చదువుతున్న అరుణం!......ఏది మనకథావస్తువు? దీనిని పరిగ్రహిస్తే మన కథాకథనానికి సదవకాశం కుదురుతుంది?

కథాకథనానికి సృష్టిసౌందర్యం కేవలం అలంకారం మాత్రమే. ఆ అలంకారముల నడుమ అలరారుతున్న అమ్మాయిచరిత్రనే మనం పరిగ్రహిద్దాం!

"జ్యోత్స్న" అను మాసపత్రికను చదువుతోంది అరుణం. సన్నజాజి సౌరభంకంటె ఆపత్రిక ఎన్నోరెట్లు ఆనందాన్నిస్తుంది తనకు. ముఖ్యంగా కరుణంగారి మధుర కథానికను ముదముతో చదువుతోందామె. కరుణంగారి కథలంటే ఆమెకెంతో ప్రీతి. కరుణం ఎక్కువ పత్రికలకు కథలు పంపడు. ఆమెకూడ ఎక్కువపత్రికలుకొని చదువదు. సాహితీరంగములో ధ్రువతారలవలె ప్రకాశిస్తున్న "జ్యోత్స్న" "ఆర్జితం" "మరాళం" అను మూడుపత్రికలకే కరుణం కథలు రాస్తాడు. ప్రతినెల ఆ మూడు పత్రికలనేకొని చదువుతోంది అరుణం. కరుణంగారి కథలు మొదట చదవనిదే ఇతర కథలు చదవదామె. అతనికథలలో అనేక ప్రత్యేకతలను ఆమెకనుగొన్నది. అతనికథలు చదువుతున్నప్పుడెల్ల ఎవరీకరుణం? ఏవూరు? ఏమిచదుకొన్నారు? ఉద్యోగమేమిటి? ఏపాటి వయస్సు? వివాహితుడేనా?...ఇలాంటిప్రశ్నలు ఎన్నో ఆమె మెదడులో కదిలేవి.

ప్రస్తుతము "జ్యోత్స్న" పత్రికలో ఆమె చదువుతున్నది కరుణంగారి "నివాళి" కథ. వాహ్యాళికేగివచ్చిన ఇల్లాలికి నివాళినిచ్చే పెట్టమారిమగణ్ణి కథానాయకునిగా సృష్టించి కథను చక్కగా పోషించాడు కరుణం. తుదకు 'చెడిపకెన్నడైన—చేటు కలుగు' అను నీతినిచూపి కథను విషాదాంతం కావించాడు.

"నీతులపూతలే కరుణంగారి వ్రాతలు" అనుకొంది అరుణం. ఇంకా అతనికథలపై ఆమె ఎన్నో అభిప్రాయాలను సేకరించింది. కథాగమనాని కవిధమైన భంగంవాటిల్లనీకుండా పాఠకులఊహాల కతీతంగా కథను ముగిస్తాడు కరుణం. అలాగని సహజత్వానికి దెబ్బరానీయడు. ఆరంభమును, అంత్యమును ఒకేలాగున చిత్రించుటే అతనికథలలో ఒక గొప్పప్రత్యేకత. అతనికథలుచదివిన ప్రతి పాఠకుడూ సంస్కారభావాలనే వాంఛిస్తాడు. కథలోనిపాత్ర చెడ్డదైతే పశ్చాత్తాపమో, ప్రాయశ్చిత్తమో ఆపాత్రకు కల్పించనిదే అతనికి తృప్తి ఉండదు. ఇట్టి విశాలభావాలవల్లనే అతనికథలు ఆమెను ఆకర్షించినవి. కథాపఠనంలో ఆమె లీనమై విచారఘట్టాలలో వలవల ఏడ్చేస్తుంది. హాస్యసంభాషణలందు కిలకిలనవ్వేస్తుంది. కరుణంగారి కథలంటే ఆమెకు ప్రాణతుల్యాలు.

'నివాళి' కథ ముగించిన కొద్ది క్షణాలలోనే చీకటితెరలు లోకముమీదికి ప్రాకనారంభించాయి. అప్పుడే వదినెగారి పిలుపు

పి. వి. యస్. శాస్త్రి

విన్నది అరుణం. ఆమె ఆ ఉద్యానవనాన్ని విడిచింది గాని "జ్యోత్స్న" పత్రికను విడువలేదు. అంతేకాదు, కరుణంగారినికూడ తన హృదయంనుంచి విడిచిపెట్టలేదు. కరుణం ఎట్టివాడో? ఏపాటి వయస్సో? ఏమీ తెలుసుకోకుండా ఎందుకు కడుతోందో యీ గాలిమేడలు?

## 2

ఆ మరునాడే అరుణం పుట్టినరోజు. ఆ శుభసమయంలో వదినె అనసూయ వాయిల్ చీర కానుకగా ఇచ్చింది. మేనత్త రంగమ్మ బంగారు ఉంగరం పంపింది. మిత్రురాలు సుమిత్ర రత్నం పెన్ సమర్పించింది. ఇలాంటివెన్నో బహుమతులు వచ్చాయి అరుణానికి. అన్నిటికంటె తన అన్నగారు యిచ్చిన కరుణంగారి "కథల కడలి" ఆమెకెంతో ప్రీతిని కూర్చింది. అన్నయ్య తన మనస్సును అర్థంచేసుకొని తగిన బహుమతిని యిచ్చాడని సోదరుణ్ణి ఎంతగానో అభినందించింది. గ్రంథాన్ని తిరగవేస్తూ ప్రకాశకుల "ముందుమాట" నిలా చదివింది అరుణం.

"జగమెఱిగిన కథకుడు కరుణంగార్ని గూర్చిగాని, అతని కథలగురించిగాని మేము ప్రత్యేకంగా చెప్పవలసినవిషయాలేమీ లేవు. ... బోర్డు హైస్కూలులో సహాధ్యాపకునిగా నుద్యోగించుచు ప్రతినెలా కథల రూపేణా సారస్వత లోకానికి చక్కని సందేశముల నంపుచున్నారు కరణంగారు. వారి సందేశములన్నియు పొందుపరచి "కథల కడలి" పేరుతో నీ పాత్రము పఠితల కందజేయుచున్నాము. ఈ చిన్ని పాత్రము పాఠకలోకమునకంతయు నింపుసొంపుల నింపునని మా తలంపు.

ఇట్లు
—ప్రకాశకులు.

అరుణానికి ఒకానొక ముఖ్య విషయానికి మూలకందమయ్యా యీ ముందుమాటలు. కరుణంగారి చిరునామా తనకు లభ్యమగుటయే తడవుగా అతనికిలా జాబు వ్రాసింది అరుణం:

చెంగ్రాలావుపేట,
తే 10-4-'56. ది

ప్రియమైన కరుణంగారికి,

ఆర్యా,

మీ అభిమాన పాఠకురాలు ధన్యవాదములు సమర్పించి వ్రాయు లేఖార్థములు—

మీతో 'కలము చెలిమి' చేయాలనే సుహృద్భావంతో ముఖపరిచితి లేకపోయినా నేను మీకీ లేఖను లిఖిస్తున్నందుకు క్షంతవ్యురాలను. మీ కథలు చదువుతుంటే నేనేదో అవ్యక్తానందాన్ని అనుభవిస్తూవుంటాను. 'కలము-చెలిమి' ని మన ఇద్దరి మధ్య నభివృద్ధిచేస్తారని ఆశించుచున్నాను. విశాలభావాలతో కథలు చిత్రించే తామ ఘనమైన సంస్కారం చూపుటకు వెనుదీయరనుకొంటాను. సుదీర్ఘమైన లేఖ వ్రాసి అమూల్యమైన మీ కాలమును వ్యర్థపుచ్చుట కిష్టపడక మీ సమాధానాన్ని కోరుతూ ఇంతటితో యీ లేఖను ముగించుచున్నాను.

ఇట్లు
మీ చెలిమికోరే
"అరుణం"

అయిదవనాటికే కరుణం నుంచి సమాధానం వచ్చింది. పాఠకులపై అతనికెంతటి అభిమానముందో ఆమె ఊహలద్వారా కొలిచి తెలుసుకోలేకపోయింది. నీలిరంగ కవరు, కుడిప్రక్క గులాబీపూవు, ఆణిముత్యాలవంటి అక్షరాలు. ప్రేమికులు వ్రాసుకొనే తీరులోనున్న కవరును చించి ఇలా చదివింది అరుణం!

# ప్రత్యక్షంలో పరోక్షం

తేదీ 12-4-1956.

అరుణంగారికి—కరుణం ఆశీస్సులతో వ్రాయు లేఖ—

(పద్యం)

కలము చెలిమిని చేపరు—చెలిమి కలిమి!
చెలిమి కలిమిని ప్రాపించు—చెలిమి బలిమి!
చెలిమి బలిమిని సిద్ధించు—కలిమి బలిమి!
కలిమి బలిమిని కనిపించు—వలపుమలుపు!
వలపుమలుపున వినిపించు - వలపుపిలుపు!
వలపుపిలుపుకు తొలగును - తలఁపుతలుపు!
తలఁపు తలుపునకావల — కలికి పలికె
వ్రాయమన్నది వన్నె జ—జాబు జాబు!

ఇట్లు
మీ అభిమాన రచయిత
"కరుణం"

అహో! కరుణంగారికి కవిత్వం కూడా వచ్చన్నమాట! చక్కని సమాసాలతో, ముక్తపదగ్రస్తాలంకారంతో, తేటతెనుగు పదాలతో, భావకవిత్వం పోకడలో ఎన్నో భావాలు పొదిగి ఎంచక్కా వ్రాశారు! తలుపున కావల కలికి ఎవరు చెప్మా? తలుపున కేవలనున్నది గడప. తలుపున కావలనున్నది ఇల్లు. ఇంటిలోని కలికి అంటే ఇల్లాలు కాదు కదా? కాదేమిటి వ్యామోహం! ఆమె చెబితేనే ఆయన నాకీ ఉత్తరం రాశారటకదూ! మరి? భార్య చెబితేనే నాకీ ఉత్తరం రాస్తారన్నమాట! కలము చెలిమికికూడా కలికి సిఫార్సు ఉండాలా? భార్యతో పలుకుతున్న పలుకులరాయుడికి నేనెందుకు ఉత్తరం రాయాలి? ఏమిపోగాలు? నాపిలుపు వలపు పిలుపుగా తనకు వినిపించిందంట! ఏమి అభ్యుదయం? సభ్యతెలుగని అభ్యుదయ వాదుల పోకడ లిట్టివేగాబోలు! అసలింతకీ దూరపుకొండల సోయగానికి గౌరవాన్ని పంపించే నేనే అవివేకిని. కరుణంవంటి నేటి బీరకాయ లెందరున్నారో యీ నవకాల కవిసమాజంలో?

విమల కళాశాల వార్షికోత్సవంలో "కలం ప్రియ" వ్యాసంపైనా అభినందనలు తెలిపి నప్పుడు మధు ఏమన్నాడు? రాతలకూ, చేతలకూ చాలదూరమని చెప్పాడు. కాసు మేటు మధుమాటలలో ఎంతయినా కొంచి వడపోసిన సత్యమున్నది. మధు తన వలపు పిలుపుకోసం ఎన్నో కలలు కన్నాడు. తన ప్రేమకొలుకు దోసిలొగ్గి దాసోహం చేసేవాడు. తుదకు తెగించి ఒకనాడు "ప్రణయ సామ్రాజ్యలక్ష్మికి ప్రేమలేఖ" అంటూ ఏమేమో వ్రాసి పంపాడు. నీ విషయమై నేనెంతటి త్యాగాన్నైనా చేయగలనని వాక్రుచ్చి వక్కాణించాడు. అంతకన్నా సంస్కారి ఇంకెవరుంటారు? నీతులు చెప్పి లోకంలో ఖ్యాతిని గడించే కవులే నిజమైన సంస్కారులని, అట్టివారే తన విషయంలో ఎంతైనా త్యాగం చేయగలరని మొదటినుంచి ఒక మూఢ నమ్మకానికి తానుబలియై పవిత్ర హృదయుడగు మిత్రుడు మధుని తూలనాడింది. గుట్టుగారాసిన అతని లేఖనైనా ఎంతో రట్టుచేసింది. పదిమంది మిత్రులలో మధుని పరాభవించింది. అయినా మధుకేం? మహారాజులా మాలతిని పెళ్లిచేసుకున్నాడు. గృహాన్ని స్వర్గసీమగా మార్చుకొని అనుకూలంగా విహరిస్తున్నా రా దంపతులు. ఇంతకీ తనే చెడింది.

ఇలా పరి పరి విధాల తలపోసింది అరుణం. ఇంతలో తన చిన్నన్న కృష్ణరావు చెప్పిన మాటలు ఆమెకు గుర్తుకు వచ్చినవి.

"భావకవుల భావాలు సుభావాలు. వారి వ్రాతలకర్థం వారికే తెలియాలి. సాధారణ పాఠకలోకానికి వారి భావాలు కరతలామలకాలు కావు"

అన్నగారిమాటలు యథార్థం కావచ్చును. 'విరాగి' 'విహారి' 'ప్రలాపి' 'పిశాచి' 'కిశోరి' ఇలాంటి భావకవులు వ్రాసిన గేయాలెన్నో తాను చదివింది. పసేమిరా అర్థంకాలేదు తనకు. అందలి పరమార్థం ఆ పరమాత్మునికే ఎరుక అనుకొంది. మళ్ళీ ఉత్తరాన్ని చదివింది. సరాసరి భావకవిత్వం పోకడలోనే ఉత్తరం వ్రాయబడిందని నిర్ధరించుకొంది. "తలపు" కుముందుగా "తలుపు" ఉంది. తలుపు కావల కలికికాదు, తలపు తలుపుకావల కలికి అంటే ఎవరో తనకిప్పుడు అర్థం కావాలి. సాధారణ నిఘంటువులలో సమానయార్థమైన ఆ సుదీర్ఘ పదముండదు. ఒకవేళ వున్నా బాహ్యార్థమే ఉంటుందిగాని, అంతరార్థముండదు. ఇలాంటి పదార్థాలు తెలుసుకోటానికి భావకవులవద్ద ప్రత్యేక నిఘంటువు లుంటాయేమో? ఉంటే యీ భావాలు సుమల్లె ఇతరులకు సులభగ్రాహ్యం కాకుండా వుండటానికి బ్రహ్మలిపితో వ్రాయబడినవేమో? అని అనేకరీతుల ఊహాగానం చేసింది. అయినా తన సందేహ నివృత్తికి మరో ఉత్తరం వ్రాయుటయే ఉత్తమమని గుర్తించింది అరుణం. వివిధ రంగాలలో తరంగ, తురంగ, తరంగాల కంటె జోరుగా పరుగుతీసిన ఆమె మనో భావాలు ఇప్పటికొక కొలికిలోకి వచ్చి నిలిచాయి! అందుకు మనంకూడా మెచ్చుకొందాం!

## 3

తే 18-4-56 దీ.

కవి మహోదయులు "కరుణంగారికి—
'అరుణం' ధన్యవాదములు.

ఆర్యా,

మీరు తేటతెనుగుపదజాలంతో, ముద్దులు మూటకట్టే పద్యంతో, భావకవి

త్వం పోకడలో వ్రాసిన లేఖ నిన్ననే నాకు చేరింది. నాకు తెలియని క్రొత్తపదాలంటూ అందులో ఏమీ లేవు. పదాలు తేనె సోనలులా ఉన్నా, భావం జిగిబిగిగా వుంది. అందుచే మీ లేఖను సరిగా అర్థం చేసుకోలేకపోయానని తెల్పుటకు చింతించుచున్నాను. దయవుంచి మీ కలికి పేరేమిటో తెలుప గోరెదను.

ఇక సెలవు!
ఇట్లు
"అరుణం"

* * *

తేదీ 15-4-1956

ప్రియమైన 'అరుణం' గారికి

'కరుణం' ప్రేమతో వ్రాయులేఖ-మీరు నా లేఖలోని భావం గ్రహించలేక పోయినందుకు మీచింతలో నేనుకూడా వంతుగైకొన్నాను. తెరమఱుగు భావాలతో నేను పద్యం వ్రాయలేదు. భావ కవిత్వం కాదని ఖచ్చితంగా చెప్పగలను. మీరు ఏదో ఆవేశంలో నన్ను అపార్థం చేసుకొన్నారు. ప్రతిపదాన్ని చక్కగా గమనిస్తే అర్థం కొఱకు చేసిన ప్రయత్నం వ్యర్థం కాదు. నాకు కలికి అంటూలేదు. ఇంకా నేను బ్రహ్మచారినే. నాపద్యంలో మీ అనుమానానికి తావుకూడా లేదు. అక్కడే మీరు పెద్దపొరపాటు పడ్డారు. నాకు మిత్రులెందఱో వందలకొద్ది వున్నారు. మిత్రురాండ్రుమాత్రం లెక్కకు లేరు. ఏకైక మిత్రురాలు మాత్రం గలదు. ఆమె పరమ పవిత్రురాలు. అంతేకాదు నా అభిమాన పాత్రురాలు కూడా. ఆమె నా హృదయాన్ని కౌంగిలించింది. నా కలికి పేరుకు బదులుగా ఆమెపేరును తెలుపుతున్నాను. త్వరలో నాకు సామ్రాజ్యలక్ష్మి కాబోతున్న అన్నులమిన్న, అందాలతిన్న, లక్ష్మీసంపన్న, శారదా ప్రసన్న యగు నా మిత్రురాలి పవిత్ర నామము "—రాగం" అంటే "సరాగం" కాదు. "పరాగం" కూడా కాదు. "అనురాగం" అంతకన్నా కాదు. "సంగీతరాగం" కానేకాదు. నా ప్రియురాలిపేరు "సంధ్యారాగం". ఆమెతో మీకు పనేమిటి కలిగిందో చెప్పండి. ఇక వుంటాను.

ఇట్లు,
మీ అభిమాన రచయిత
"కరుణం"

* * *

ఏమిటీ లేఖలోని పోకడలు? కలికి లేదట! ప్రియురాలు కలదట! ఆమెతో నాకేమిటి పనట! పైగా నన్ను "ప్రియమైన" అంటూ సంబోధించటానికైనా సిగ్గులేకపోయింది! మాటలకు ప్రాసలుతొడిగి తన ప్రియురాలి నెంతచక్కగా వర్ణించాడు! అట్టివాడు నా మనోలక్ష్యాన్ని ఎలా గుర్తిస్తాడు? గుర్తించినా నన్ను చేపట్టుటకు ఎంతటి సంస్కారి కావాలి! చేతనున్న విరజాజిని విడిచిపెట్టి, దూరానవున్న కొండమల్లెను కోరుతాడా ఎంతటి వెఱ్ఱివాడైనా? సంధ్యారాగం త్వరలో తనకు సామ్రాజ్యలక్ష్మి కాబోతుందని వ్రాశాడు. నాకెందుకింకా యీ వెఱ్ఱితలపులు...పిచ్చిభ్రమలూను.

అంతటితో అరుణం ఊహాగానం ఆగిపోయింది. ఆమెహృదయ వీణలోని ప్రేమ తంత్రులు తెగిపోయినవి. మెట్లులేని గాలిమేడలు కూలిపోయాయి. పగటికలలు భగ్నమయాయి. అంతే! కరుణం గారికొక గుడ్ బై! అతనికథలకో గుడ్ బై! ఆగిందామె ప్రణయకలం! పెట్టింది పత్రికలకో సలాం!

అందినతీపి!
అందకపులుపు!
ఎవరిపై యీ అలుక?
ఎందుకో యీ వాత?
దేనికో యీ కలత?
ఏమౌతుంది నెలత?
పూర్తికాలేదు కథ!

## 4

కాలప్రవాహంలో ఆరుమాసాలు ఆరు తరంగాలలా దొరలిపోయాయి. ఇప్పుడు పత్రికా చింతనమే లేదు అరుణానికి. వాచక పుస్తకాలపై ఎక్కువశ్రద్ధ చూపింది. తత్ఫలితంగా పరీక్షలో బెస్ట్ మార్కులు సంపాదించింది. పరీక్షల అనంతరం మేనత్త గారింటికి గజపతినగరం వెళ్ళుటకు వాల్తేరు స్టేషనులో బండి ఎక్కింది. మరో పావుగంటలోనే బండికదిలింది. కిటికీలోంచి ప్రకృతి లావణ్యాన్ని తిలకిస్తూ కూర్చుంది అరుణం. దూరాన కొండలు ఎంతోనున్నగా కన్పిస్తున్నవి. వాటిని చూడగానే కరుణం స్ఫురణలో మెదిలాడు. మళ్లీ ఆమెమనస్సు కలుక్కుమంది. అంతలోనే ఏదో ఊహ తళుక్కుమంది.

ఆరుమాసాలై కరుణంగారి కథలు చదవలేదు. ఇప్పుడెలా ఉన్నాయో అతని భావాలు? అనుకొంది. మళ్లీ అభిమానం దెబ్బతింది. సింహాచలం స్టేషనులో బండి నిలిచింది. కొందఱు ప్రయాణీకులు దిగారు. వారిస్థానాలను మఱికొందఱు క్రొత్తవారు ఆక్రమించారు. తనకెదుటిసీట్లో బొద్దుమీసాల వీరభద్రావతారం దిగిపోయాడు. అతనిసీట్లో ఒక నవయువకుడువచ్చి కూర్చొన్నాడు. అతడు తొడిగిన సిల్కులాల్చీ గాలికి రెపరెప లాడుతోంది. తుమ్మెదలలా శిరోజాలు లలాటంపై లాస్యంచేస్తున్నాయి. బంగారు సులోచనాలగుండా లోచనాలు తళతళ మెఱుస్తున్నవి. స్ఫురద్రూపి, నవ్వుముఖం, తెల్లని ఛాయ, నూనూగుమీసం...అంతే! నఖశిఖ పర్యంతం ఒకేసారి అతనిరూపాన్ని చూసింది అరుణం. అతనిచేతిలో ఏదోపత్రిక ఉన్నది. ఔను! అది 'జ్యోత్స్న' పత్రికే. అబద్ధం కాదు. అడుగుదామనుకొంది. కరుణంగారి ప్రియురాలు సంధ్యారాగం మళ్లీ జ్ఞప్తికొచ్చింది. ఆమె తన్నుచూసి వికటాట్టహాసం చేస్తూ వెక్కిరించినట్లు లీలగా ఊహించింది. మళ్లీ ఆమె అభిమానం దెబ్బతిన్నది. అడగలేకపోయింది. అతడు పత్రికా పఠనంలో నిమగ్నుడయాడు. బండి పెందుర్తి, కొత్తవలస స్టేషన్లు దాటిపోయింది.

అరుణం మళ్ళీ ప్రశ్నించుకొంది:

కరుణంగారి కథ లెందుకు చదవకూడదు? ఆయన చేసిన తప్పేమిటి? అతడూ మానవ

# ★ ప్రత్యక్షంలో పరోక్షం ★

మాత్రమే! అందరికీ మల్లే అతనికీ ఓ ప్రియురాలు ఉంటుంది. ఆమెపై నాకెందుకని? అతని రెండవ ఉత్తరానికి నేను జవాబు ఇవ్వనందు కేమనుకొన్నాడో?... అని ఆమె ఆలోచిస్తుండగా ఎదుటి సీట్లోని యువకుడు పత్రికను తన స్థానంలో ఉంచుతూ తాను తలుపువద్దకుపోయి నిలుచున్నాడు.

అరుణం ధైర్యంతో అతని పత్రిక తీసింది. తలుపువద్ద నిల్చొన్న ఆ యువకుడు ఆమె చర్యను తిలకిస్తూనే ఉన్నాడు. కుదురైనమోము, వదులుగానున్న జడ, తెల్లరంగు అంచాపై నల్లని సిల్కువల్వెట్, లేతగులాబి కలర్ జాకెట్, మెడలో తళతళ మెరిసే తెల్లపూసల నెక్లెస్, చిరునవ్వుతో తొణికిసలాడే పెదాలు, పూర్ణమైన కపోలాలు, జ్యోత్స్న కాంతులు వెదజల్లే నేత్రాలు... ఆమెయొక్క అన్ని హంగులూ ఒకే ఒక్క చూపుతో గ్రహించాడు యువకుడు. వెంటనే తన సీట్లోకి వచ్చి కూర్చొన్నాడు.

ఆమె హరిణములా బెదరుచూపులు ప్రదర్శిస్తూ "క్షమించండి. మీ పర్మిషన్ లేకుండా పుస్తకం తీశాను" అంటూ ఇచ్చివేయబోయింది.

"ఫరవాలేదు చదవండి. పత్రికలపై మీ కుంటే అభిమానంకొద్దీ అలా తీశారు." అన్నాడు యువకుడు.

"నవనీత హృదయుడు" అనుకొంది అరుణం.

"కరుణంగారి కథలపై మీ అభిప్రాయమేమిటి?" యువకుణ్ణి సూటిగా ప్రశ్నించిందామె.

"ఆ పత్రికలో చదవండి మీకే తెలుస్తుంది. పతితల వలపోతే రచయితలకు వరహాలంటూ వివిధ పాఠకులు తన కిచ్చిన అభిప్రాయములను సంపుటీకరించి "కృతజ్ఞత" అనే కథానికగా చిత్రించారు కరుణంగారు. అతని కథలపై ప్రత్యేకంగా నేనిచ్చే అభిప్రాయమేమీ లేదు. విశ్వాన్ని వేయి కండ్లతో విమర్శించి కరుణంగారు కథలు రాస్తారు. సమాజంలోని వ్యక్తులయొక్క వివిధ సమస్యల ప్రతిరూపాలే అతనికథలు. అతన్ని పొగిడి చెప్పడం నా కిష్టంలేదు. తెలుసుకోవాలని కుతూహల ముంటే పత్రిక చదవండి," అన్నాడు యువకుడు. "కృతజ్ఞత" కథలోని పతితల పేర్లలో తనపేరు కూడా ఉంటుందేమోనని కళ్లు పెద్దవిచేసి చూసింది అరుణం!

"... .........పత్రికా వ్యాసంగంలో నాకు పరిచయమైన మిత్రుల సంఖ్య వేల కతీతంగా వుంది. ఇటీవల ఒక్కగానొక్క మిత్రురాలు మాత్రం నాకు తారసపడింది. నా హృదయసామ్రాజ్యానికి అధినాయిక కావాలని కాంక్షతో ఆమె నాకు లేఖ లిఖించిందని గ్రహించడానికి నా కంతో సేపు పట్టలేదు. లేటతెనుగు పదాలతో, ఆమె కర్ణమధురరీతిగా, ఆమెను సంతృప్తి పరచాలని పద్యరూపేణా సమాధానమిచ్చాను నేను. కాని నా ప్రయత్నం విఫలమయింది. ఆమె నా పద్యాన్ని అంతర్థంతో తర్కించకుండా అపార్థం చేసుకొంది. అది వైపరీత్యానికి దారి తీసింది. రెండవ లేఖలో మీ కలికి పేరేమిటి? అంటూ నన్ను ప్రశ్నించింది. బ్రహ్మచారిగా నున్న నేను నా కలికి పేరు ఏమని చెప్పేది? ఆలోచించాను. నా ప్రియురాలి పేరు "సంధ్యారాగం" అంటూ వ్రాశాను. పాపం! సంధ్యారాగమను పేరు తన పేరుకు పర్యాయపదమని గ్రహించలేక నాకు అంతటితో లేఖలు వ్రాయటం మానుకొంది అరుణం...... ..."

"ఆఁ! ఇందులో నా గురించి కూడా వ్రాశారు." ఆనందోద్రేకంతో అనేసింది అరుణం. తర్వాత మళ్లీ సిగ్గుపడిపోయింది.

"ఏమిటీ? మీరు అరుణంగారా?" అంటూ ఆశ్చర్యంతో ప్రశ్నించాడు యువకుడు.

"నా పేరు మీకెలా తెలిసింది?" అంటూ అతివే కిలా ప్రశ్నించింది అరుణం.

"సంతోషంతో ప్రపంచాన్ని మరచిపోతున్నట్లున్నారు. ఆ కథలో పది మంది స్త్రీలున్నారు గనుక నా మీ పేరు తెల్సుకో లేకపోడానికి? ఆ కథలో మీ గురించి వ్రాశారని మీరే చెప్పారు. అందులో ఉన్న ఒక్క స్త్రీ అరుణం మాత్రమే. కనుక మీరు అరుణంగారని గ్రహించాను."

అతని జవాబుతో తన తప్పు తెలుసుకొని తలదించుకొంది అరుణం! అతడే మళ్లీ ప్రశ్నించాడు——

"ఇంతకీ కరుణంగారికి కలికి ఉంటుందనే అనుమానం మీ కెందుకు కలగాలి?"

సమాధానంగా కరుణం వ్రాసిన పత్ర లేఖనంతా వినిపించి తన అనుమానాన్ని వ్యక్తపరచింది అరుణం. ఆ యువకుడొక్క

కూడా చిన్నగా సన్నగా నవ్వు తున్నాడు.

"ఎందుకు నవ్వారు?" ప్రశ్నించింది.

"మీ అమాయకతకు" జవాబిచ్చాడు.

"అందులో నేను పొరబడినదే ముంది?" మళ్ళీ ప్రశ్న.

"చాలా వుంది" అతని సమాధానం.

"ఏమిటది?" మళ్ళీ ప్రశ్నించింది.

"తలుపు కావల కలికి అంటే మీరు అనుకొన్నట్లు "ఇల్లాలు" అను అర్థం వస్తున్నది. కాని, తలపు తలుపు కావలకలికి అంటే ఆ అర్థంరాదు." అన్నాడు.

"మరి?" ఆత్రుతతో ప్రశ్నించింది.

"తొందరెందుకూ? చెబుతానువుండండి. తలపులు అంటే కోరికలు. కోరికలనే తలుపుల కావలనున్న కలికి ఎవరో తెలుసుకొనుటకై మెదడుకు మేతవెయ్యండి. ఇంకా తెప్పుకో లేరా? ఆ కలికి అతని "మనస్సు" అని తెలుసుకోండి. తన మనస్సు చెబితేనే మీకా ఉత్తరం వ్రాశారు కరుణంగారు. మీకు సులభంగా 'తలపు' అర్థమయ్యేందుకు తలపు అనుచోట లాతర్వాత అరసున్నా కూడా ఆయన రాసి వుండవచ్చును..."

"ఔను. రాశారు. నాకు జ్ఞాపకముంది"

"అరసున్నా ఒకప్పుడు నిండు సున్నావలె అర్థమిస్తుందని మీకు తెలుసు ననుకొంటాను. 'తలఁపు' 'తలంపు' అవుతుంది. 'తలంపు' అనగా 'కోరిక' అని సులభంగా మీరు గ్రహిస్తారని కరుణంగారు అరసున్నా పెట్టి వుంటారు."

అతని సమాధానానికి సంతృప్తి చెందింది అరుణం. ఒక్క నిట్టూర్పు విడిచింది. "నేనెంత తెలివితక్కువపని చేశాను" అంది.

"అయినా ఫరవాలేదు. విచారించకండి" అన్నాడు యువకుడు.

"ఏం?" అరుణం ప్రశ్నించింది.

"అతని కింకా పెళ్లి కాలేదు." ఆసక్తితో సమాధాన మిచ్చాడు.

"అయితే?"

"అయితే, గియితే ఏమీ లేదు. మిమ్మల్ని తప్ప మరెవ్వరినీ ఆయన పెళ్లి చేసుకోడు."

"నా పూర్తి కథ తెలుసుకొన్నాక కళ్లు మిటకరిస్తారేమో ఆ పెళ్లికొడుకు?"

"కారణం?"

"తగిన సంస్కారం చూపలేక."

"ఆతని విషయంలో మీరు చాలా పొరబడుతున్నారు. జాతి, మత, శాఖా విభేదాలాయనకు లేవు."

"లేక పోవచ్చు."

"విధవా వివాహం చేసుకోడానికైనా ఆయన వెనుదీయడు."

"హాస్యమాడుతున్నారా? లేక వెక్కిరిస్తున్నారా? ఆయన విషయాలన్నీ మీకెలా తెలిశాయి?" అనుమానంతో ప్రశ్నించింది అరుణం.

"ఆయన నా సహాధ్యాయుడు. మీకు తెలుగుపదాలు సరిగా అర్థంకాకపోతే 'క్లాస్ మేట్' అని తెలుసుకోండి."

అతని జవాబులో తనపై కొద్దిపాటి వ్యంగ్యం వున్నా పరిస్థితులవల్ల లొంగి ఏమీ అనలేకపోయింది అరుణం.

"మీది ఆయన ఊరేనా?" అంటూ మళ్ళీ ప్రశ్నించింది.

"అనుమాన నివృత్తికోసం చొప్పదంటు ప్రశ్నలు వేస్తున్నారు. మీపై ఉంటే అభిమానం కొద్దీ నాకు తెలిసినవిషయం చెప్పినందుకు నాగానే పరాభవించి నన్ను క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తున్నారు." నటనా పటిమలో కూడిన చిరుకోపం అతని నేత్రాలలో ద్యోతకమయింది.

"క్షమించండి. ఏదో తెలీక అనేశాను. తమపట్ల నేను అపార్థం చేసుకొన్నందుకు నన్ను క్షమించమని కరుణంగారితో చెప్పండి. అతని చరణదాసిని కావటమే నా జీవితాశయమని చెప్పండి. నా ప్రేమపూర్వకమైన ధన్యవాదాలను తెలియజెయ్యండి. త్వరలోనే జాబు వ్రాస్తున్నానని చెప్పండి."

"మీకెందుకే తొందరండీ? ఇంతకీ నాకు మీ కానుకేమిటో చెప్పండి." నవ్వుతూ యువకుడు ప్రశ్నించాడు.

"నా పెళ్లికి తప్పకుండా రండి. అప్పుడు మీకు మంచి కానుక ఇస్తానులెండి."

"నేను లేకుండా మీ పెళ్లి జరుగదులెండి. బండి విజయనగరం వచ్చిందండి. నాకిక్కడ చాలా పనులున్నాయండి. వస్తానండి." అంటూ యువకుడు బండి దిగిపోయాడు. రెండుమూడుసార్లు వెనుతిరిగి చూశాడు. అరుణం తన వేపే చూస్తోంది. ఆ చూపులలో "నేను చెప్పినవిషయాలు మరచిపోకండి" అను భావం పొంచివున్నదని గ్రహించాడు. కొద్దిక్షణాలలోనే అతడామె దృష్టిపథానికి దూరమయ్యాడు.

## 5

అరుణం గజపతినగరం నుంచి విశాఖపట్టణం వచ్చేక అన్నయ్య కృష్ణరావు మునిమాపు పసిడినవ్వుల వొలికిస్తూ ఒక ఉత్తరాన్ని ఇచ్చాడు. ఆ ఉత్తరము చదివిన అరుణానికి సిగ్గు, భయము, సంతోషము, ఆశ్చర్యం అన్నీ ఒక్కక్షణంలోనే యేర్పడినవి.

తేదీ 5-11-56

ప్రియమిత్రుడు కృష్ణారావుకు,

ద్రోణంరాజు దయాకరరావు వ్రాయు లేఖ.

చాలకాలమయింది మన ఇద్దరి నడుమ ఉత్తరాల ప్రయాణం లేదు. మళ్ళీ నీ చిన్న చెల్లెలు అరుణం దయవల్ల నీకీ లేఖ వ్రాయ వలసి వచ్చింది.

చూడు!

గోగడ నీ ముద్దు చెల్లెలు నేదన్నను నాకిచ్చి పెళ్ళి చేయమన్నాను. నీ దయాగుణం కొద్దీ శాఖాంతరవివాహం చేయడానికి మా అన్నయ్య రామారావు అంగీకరించడన్నావు. మీ అన్నయ్య ఏలూరుకు బదిలీఅయి వెళ్ళిన తర్వాత నీవు స్వతంత్రుడవయావు. అందుకు నిదర్శనం నీ విధవ చెల్లెలు అరుణం నవ్యాలంకారశోభిత కావటమే. నీ సంస్కారగుణానికి నేనెంతో అభినందిస్తున్నాను. మీ చెల్లెలు అరుణం నన్ను మనసారా ప్రేమించింది. నా పేరు కరుణం అని నీవు గ్రహించి వుంటే, ఆమె నన్నలా ప్రేమిస్తుందో లేదో! వద్ద వున్న పత్రికలే నీకు నిదర్శనాలు. మొన్న రైలుప్రయాణంలో పెండ్లి కాక పూర్వం సుభద్రార్జునులు మాట్లాడుకొన్నట్లుగా మేముకూడా మాట్లాడుకొన్నాము. అయితే నేను అర్జునుడనని మీ సుభద్రకు తెలీదు పాపం. శుభస్యశీఘ్రం అనిపించాలి. త్వరలోనే నీవు కృష్ణపాత్ర ధరించాలి. మీ అన్న రామారావు (బలరాముడి)కి యీ వార్త తెలుపకుండా సింహాచలం దేవస్థానంలో పెళ్లిసన్నాహాలు రహస్యంగా జరిపి నాకు తంతివార్త పంపించు. నీ చెల్లెలి భావి భాగ్యోదయానికి యీ విధంగానైనా సహకరించు. జవాబు జరుగుకు.

ఇట్లు
నీ మిత్రుడు-దయాకర్

★

# పిచ్చితల్లి

ఆ వీధిలో కొందరి పెదవులమీద ఒక వంకర నవ్వు చిందులు త్రొక్కుతోంది. వాళ్ళ కసితీరినట్లు వాళ్ళముఖాలు విప్పారి చెబుతున్నాయి.

నిజానికి ఆవీధంతా చిన్నబోయింది. లలిత వాళ్ల ఇల్లు చీకటిగూడులా ఉంది. లలిత తండ్రి కంగువాను ముసుగుగా కప్పుకొని కూర్చున్నాడు గదిలో. కత్తివేటు వేసినా నెత్తురుచుక్క లేకుండా అయిపోయింది ఆయన ముఖం.

ఒక్క క్షణంలో శరీరంలోని ప్రాణశక్తి నంతనూ గుంజే భయంకరవ్యాధి ఏదో ఆదంపతులిద్దరికీ సోకి తనపనిని పూర్తిచేసుకొన్నట్లుంది

ఆ దంపతులు నిస్సబ్దంగా కన్నీరు కారుస్తూ దుఃఖాన్ని అదుపులో ఉంచుకోడానికి బ్రహ్మప్రయత్నం చేస్తున్నారు. కాని అప్పుడప్పుడూ పెద్దగా ఏడ్వకుండా ఉండలేక పోతోంది లలిత తల్లి.

వాళ్ళకళ్ళు ఎర్రగాఅయి, వాళ్ళగొంతులు బొంగురుపోయి చివరకు వాళ్ళు శోషపోయినట్లు ఆరోజల్లా అలాగే పడిఉన్నారు.

మర్రోజు ఉదయమే లలితతల్లి తూలుతూ లేచి.

"తల్లీ ఎంతపని, చేశావమ్మా, అయ్యో, పిచ్చితల్లీ!" అని మెల్లిగా అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ సోలుతూ కుంపటి రాజేసి ఇంత కాఫీ కాచి భర్తదగ్గరకు తీసికెళ్లి బ్రతిమాలాడటం మొదలుపెట్టింది గద్గదస్వరంతో.

"లేచి కొంచెం ఈకాఫీ తీసుకోండి" అంటూ.

లలిత తండ్రి నిన్నటికీఇవాళటికీ చిత్రంగా మారిపోయాడు. ఆయనను నిన్నంతా పీడించిన శోకాదుఃఖమూ పూర్తిగా మార్చివేశాయి. ఇప్పుడు ఆయన కళ్లలో కన్నీరు లేదు; గొంతులో గాద్గద్యంలేదు; హృదయంలో ఆర్ద్రత లేదు.

"లలిత నాకడుపున పుట్టనేలేదనుకున్నా—పుట్టినా ఏనాడో చచ్చిపోయిందనుకున్నా—ఇక దాని ప్రసక్తి లేవద్దు" అన్నాడు.

కాఠిన్యాన్నీ, విరక్తినీ ధ్వనింప చెయ్యటానికి సర్వశక్తినీ ప్రయోగిస్తున్నట్లు కనపడ్డాడు. కాని, సఫలుడు కాలేకపోయాడు.

లలితతల్లి ఆ మాటలు వినలేకపోయింది. ఆమె దుఃఖం కట్టలు తెంచుకుంది. భోరున ఏడుస్తూ అంది:

"అలాంటి మాటలు అనకండి, నేను వినలేను. రత్నంవంటిపిల్ల, ఎంత తెలివితక్కువ పని చేసింది!"

"పరువూ ప్రతిష్టా మంట కలిసిపోయాక ఈ బ్రతుకు ఇక ఎందుకూ?" కోపంతో శరీరం వణికిపోతుండగా గాలితో అరిచినట్లు అన్నాడు.

"అయ్యో, తల్లీ!" పెద్ద నిశ్వాసంతో లలిత తల్లి కంపించిపోయింది.

"నాకు బ్రతకాలని లేదు—ఎవరికోసం బ్రతకడం, లలిత మనబిడ్డ కాకపోయాక? ఏ ముఖం పెట్టుకొని నలుగురిలో తల ఎత్తుకొని తిరగగలను?" స్త్రీలా భోరున ఏడ్చాడు.

"దూరం ఆలోచించ గలిగితే ఇలా చెయ్యనే చెయ్యదు. మన లలిత మనకు తెలియనిదా చెప్పండి?" అతిదీనంగా రాళ్లు కరిగేలా జాలికొల్పే కంఠంతో అనునయిస్తూ అంది.

## చక్రవర్తి రంగస్వామి

ఎక్కడోవున్న లలిత తండ్రికళ్ళకు కట్టినట్లు కనిపించింది, సుపరిచితమైన సద్గుణాలతో, వినయం, భక్తి, ప్రేమ, సహజసౌకుమార్యమూ మూర్తీభవించి ఉన్నాయి. విషాదమూ, నిరాశా ఆవరించి ఉన్నాయి

తల్లిదండ్రులమీదిభక్తి, భయమూ, సానుభూతీ ఆ పెద్ద కళ్లల్లో కన్పిస్తూ ఉన్నాయి.

ఆయన హృదయం తరుక్కుపోయింది. "అమ్మా లలితా, అమ్మా, అమ్మా" అని పెద్దగా పిలిచాడు కన్నీరుతో—పసిపిల్లవాడిలా, అతి వృద్ధుడిలా, గుండె పగిలి పోయేలా.

"ఈ కాలపు పిల్లలలో కనిపించే ఏ చిన్నలోపమూ నా తల్లిలో లేదే! ఈ దుర్ఘటన మనకర్మం అనుకోవాలి" అనుకుంటూ కళ్లుతుడుచుకుంటున్నాడు. కన్నీరు తరగటంలేదు.

తల్లి మనస్సు లలితమీద—అసలు—కఠినం కానేలేదు. అసలు తనబిడ్డ తప్పుచేసి ఉండదనే ఆమె నమ్మకం. తనబిడ్డ ఎక్కడున్నా నీతిగా నిజాయితీగా బ్రతకగలదనే ఆ తల్లి ధీమా. లలిత వివాహసమస్య పరిష్కరింపరానిది కావటంతో సంఘనియమాలంటే ప్రత్యేక ద్వేషభావమేమీ లేని ఆమెకు సంఘంమీద అసహ్యం ప్రారంభమైంది. ఇప్పుడా అసహ్యం అవధులుదాటి లలిత మీద పొంగిపొర్లిన మాతృప్రేమతో బాటు లలిత తప్పుపనిచేసివున్నా క్షమించగలిగినంత దయతో ఆమె హృదయం తొణికిసలాడుతోంది. భర్తహృదయం ఒకసారి సంఘంవేపూ, ఒకసారి బిడ్డవేపూ దుర్బలంగా ఊయ్యాల ఊగుతున్నా, ఆమె—కట్నాల దురాచారానికి బలైపోయిన తన బిడ్డవేపే అచంచలంగా నిలబడిఉంది. కాని, తనబిడ్డ ఏది?

## 2

లలిత పెళ్లిసమస్య తలఎత్తి తల్లిదండ్రులను పీడించటం ప్రారంభించింది. తల్లిదండ్రులిద్దరూ ఒకచోట కూర్చున్నప్పుడు ఆలోచించేది తన పెళ్లినిగురించే అని లలితకు తెలుసు. తన పెళ్లిసమస్యను చక్కగా పరిష్కరించడానికి కావలసిన ఆర్థికస్తోమతు వాళ్లకులేదు. సరైన సంపాదనా, వయోరూపగుణాలూ కొరతపడ్డ ఏ వరునికీ ఎరిగి యెరిగి తనను ఇవ్వడానికి తల్లిదండ్రులు వొప్పుకోరు. తక్కువకట్నంతో దొరికే వరుడు తన కుటుంబాన్ని పోషించుకోలేనివాడుగా ఉంటాడనీ, అలాంటివాడిచేతిలో తమబిడ్డను పెట్టడం గొంతు నులమటమే అవుతుందనీ తన తల్లిదండ్రుల అభిప్రాయమని ఆమెకు తెలిసిపోయింది.

తన పెళ్లి వాళ్ల ప్రాణాలను కృంగతీసే ఇంత గడ్డు సమస్యగా పరిణమించడం లలితకు చాలాభయాన్ని కలిగించింది.

చిన్నతనం నుంచి కల కల లాడుతూ, చిలకలా పాడుతూ, హంసలా కులుకుతూ వుండే లలితకు దిగులుపట్టుకుంది. రోజులు సుఖంగా గడవటంలేదు మనస్సుకు ఉత్సాహం లేదు. చెయ్యవలసిన పనిలేదు ఎక్కడికీ వెళ్ళటం, రావటం లేదు. స్నేహాలు లేవు.

ఎటుచూచినా ప్రపంచం తనను ఎందుకో పరీక్షిస్తున్నట్లు, వంక పెట్టడానికి సమయం కోసం చూస్తున్నట్లు కనపడేది తనను బురదలోకి లాగటానికి ప్రయత్నిస్తున్నట్లు కనపడేది.

తను అలంకరించుకోకపోయినా స్త్రీత్వం ప్రసాదిస్తున్న అందచందాలు రూపురేఖలను తీర్చి దిద్దుతున్నట్లు అనిపించేది. కాలం గడుస్తున్నకొద్దీ తనలో ఏదో క్రొత్తదనం,

వికాసం, పరిమళం ఏర్పడుతున్నట్లు తోచి తనవేపు తాను చిత్రంగా చూచుకొనేది.

ఏపనీలేని లలితకు ఎన్నో చిత్రమైన ఆలోచనలు, కోరికలు, ఆశలు మొలక లెత్తేవి. ఒక్కసారిగా మళ్ళీ నిరాశా, విచారమూ, తల్లిదండ్రులమీది జాలీ నల్లని మేఘాలుగా ఆమె మెదడును ముసురు కొనేవి.

ఒకసారి యౌవనం తెస్తున్న ఆశలూ, కోరికలూ నిండిన తిన్నని వెన్నెలబాటా, ఒకసారి దారిద్ర్య భీతీ, నిరాశా తెచ్చే చీకటులు అలముకొంటున్న అంతులేని వంకరల బాటా ఆమెకళ్ళకు లీలగా కనిపిస్తూ ఉండటం అలవాటైపోయింది.

## 3

లలిత తండ్రి దుర్బలంగా క్రుంగిపోతు న్నాడు. "పేరు ప్రతిష్ఠలు" అంటాడు. "మానాభిమానాలు" అంటాడు. "బ్రతుకు నవ్వులపాలై పోయిం"దంటాడు. తాను బ్రతకటం ఎందుకని ప్రశ్నించుకొంటాడు. సంఘం తనను చచ్చిపోనివ్వనట్లు విసుక్కుంటాడు—తాను బ్రతకటం చచ్చిపోవటం సంఘం చేతిలో ఉన్నట్లు! తన చేతిలో లేనట్లు!!

ఆయన ఆత్మీయమైన అమూల్య పదార్థాన్ని పోగొట్టుకొన్నట్లు, ఐహిక సర్వస్వాన్ని పోగొట్టుకొన్నట్లు పిచ్చివాడై పోయాడు. ప్రాణాధారమైన ముఖ్య రక్తనాళమేదో బ్రద్దలైపోయి విలవిల బాధపడి పోతున్న ప్రాణిలా ఉన్నాడు.

కాలచక్రం మామూలుగా తిరుగుతూనే వుంది. లలిత తల్లి దండ్రులు అటు చూడటం లేదు.

ఒకరోజు పోస్టు బంట్రోతు వచ్చాడు. అతని చేతిలోవున్న కవరుమీద ముత్యాల లాంటి లలిత దస్తూరి మెరసిపోతోంది.

లలిత తల్లి తీసుకుంది. కవరు చించి జాబును తీసి చదవటం మొదలుపెట్టి ఒక్క క్షణంలో పూర్తిచేసి సంతోషంతో విప్పారిన ముఖంతో, ఆనందం నిండిన కంఠంలో అంది జాబును భర్తకు అందిస్తూ.

"లలితా, వాళ్ళ దామూ వివాహం చేసుకున్నారుట, చూడండి."

చేతులు వెనక్కుపెట్టి పచారుచేస్తూఉన్న ఆయన విషాదమౌనాన్ని భంగపరచలేదు.

"మీ దంతా వట్టి పిచ్చి! ముందు ఈ జాబును చదవండి-తరువాత ఆలోచిద్దురు గాని" అంది చిరునవ్వులో.

"ఏమిటేంటి?" అన్నాడు మెత్తపడుతూ.

"చెప్పటం కాదుగానీ, జాబు చదవనా?" అంటూ చదివింది-మాతృప్రేమ, పత్నీస్నేహం, మహదానందం మూడూ కలిసినప్పటి మాధుర్యం కంఠధ్వనిని నొక్కుతూ ఉండగా.

"......లలిత నమస్కరించి వ్రాయు విన్నపములు.

నన్ను అల్లారు ముద్దుగా పెంచిన మీకు నావల్ల సుఖమూ శాంతీ లేకుండాపోయే ప్రమాదం వచ్చి పడిందన్న భయం నన్ను ఆవరించింది. నా బాధనుండి మిమ్మల్ని విముక్తులను చేద్దామని-ఏ ఆంధ్ర మహిళా సభనో ఆశ్రయిద్దామని లేనిధైర్యం తెచ్చుకొని బయలుదేరాను. ఎలాగో రైలులో కూల బడ్డాను.....

కన్నీళ్ళతో దూరంగా వెళ్లిపోయే బిడ్డనే కాకుండా, బిడ్డను పోగొట్టుకొన్న దుఃఖంలో మునిగివుండే తల్లిదండ్రులను కూడా సమాజం కౄరంగా వేలుపెట్టి వెక్కిరిస్తుందని నాకు తెలియకపోలేదు! ఈ ప్రపంచం ఏదైనా చెడ్డమాట-,మీ బిడ్డను అంటే-అందులో ఏమీ న్యాయంలేదనీ, మీబిడ్డ మీకు కళంకం తెచ్చేవిధంగా ప్రవర్తించలేదనీ ప్రమాణంచేసి చెపుతున్నాను.

కట్నం ఒకపక్షానికి స్వార్థ సంబంధమైనదీ రెండవపక్షానికి ప్రాణావసరమైనదీ అయింది. ఈ దురాచారం పోవాలంటే ముఖ్యంగా వధూవరులలోనూ, వాళ్ల పెద్దలలోనూ పరివర్తనం రావాలి...

అదృష్టవశాత్తు రైలులో మామయ్యగారి 'దామూ' కనపడ్డారు. నన్ను అనేక ప్రశ్నలువేసి నాపరిస్థితిని తెలుసుకున్నారు. నాయందు సానుభూతికలిగి నన్ను వివాహమాడతానని చెప్పి, పెద్దలవల్ల ఏ ఆటంకమూ కలగకుండా ఉండటానికై-వెంటనే నన్ను వివాహమాడారు సాహసించి.

మీ ఆశీస్సులూ, దయా మాకు శ్రీ రామరక్షగా నిలుస్తాయని మాకు తెలుసు.

నేనూ, మీ అల్లుడుగారూ రేపు రాత్రి బండిలో వస్తున్నాము.

మీ చిట్టి తల్లి,
లలిత.

ఈ జాబును వింటూండగా ఆయన ముఖంలోకి జీవకళా, శరీరంలోకి ప్రాణశక్తీ ప్రవేశించాయి.

నవ్వుముఖంతో "పిచ్చి తల్లి ఎంతపని చేసింది!" అని ఆశ్చర్యంతో సగం నోరు తెరచి భార్య కళ్లలోకి చూస్తూ ఉండి పోయాడు.

* * *

మర్నాడు లలితా వాళ్ల ఇల్లు కలకల లాడుతూ ఆవీధికంతకూ ఎంతో శోభను తెచ్చింది కారణం, లలితా, దామూ రాత్రి బండిలో వచ్చారు. ఆ నూతన దంపతులు ఆయింటికి వింత శోభను వెంటపెట్టుకొని తెచ్చారు. లలిత తల్లిదండ్రులు ఆనందాతిశయంతో ఏపని చెయ్యటానికీ తోచక కూతురివేపూ, అల్లుడివేపూ విచిత్రంగా చూస్తూ ఉండిపోయారు.

ఆవీధిలోని కుత్సితుల ముఖాలమీద నల్లని నీడ వ్రేలాడింది. 

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము

ముంగిలి తరహా తెలియక సలహా
వెంగలినై వినినావు!
ప్రాజ్ఞులు రాజ్యప్రాప్తిని గోరరు,..
అజ్ఞుల మాటల కేమి!

ఎన్ని హస్తములు
ఎన్ని మస్తకము
ఉన్నవి మగడా
నీకు?

తలకాయొకటే,
చేతులు రెండూ
కలవే దయతో
నాకు!

శిరములు రెండూ
కరములు నాలుగు
వరముల నడుగుము
పొమ్ము

అన్ని దేనికే! మోత
బరువుగా?
ఉన్నవి చాలును
తెమ్ము

చాలా బాగుందనుకుని చాలా
సొత్తైపోయిన సాలె
అడవికి మళ్ళీ రయమున వెళ్ళి
అడిగెను యక్షిని వరము

వెనుకాత మగ్గం, ముందాత మగ్గం
దినముకు బట్టలు రెండు
నేతనేసి చేనేతకు నీవే
నేతవు కాగలవోయి!

...గేయరచన... నండూరి. రామమోహనరావు ✿ బొమ్మలు... బాపు















# అనసూయ అసూయ

"నేనోకమాట చెప్తానుగాని, అమ్మతో చెప్తావా వదినా?" అంది అనసూయ ప్రాధేయపూర్వకంగా.

"ఏవిటామాట? ఇప్పుడు నువ్వు శారదా వాళ్ళ యింటిదగ్గర్నుంచేనా రావటం? ఎలా వున్నాడు పెళ్ళికొడుకు?"

"చాలా బావున్నాడు. అబ్బా! ఎంతందంగా..."

"ఆహా! అంత బావున్నాడా?"

"ఆ-నువు నమ్మవ్ గాని, ఎందుకూ, నువు కూడా చూట్టానికి రావాల్సింది."

"మీ ఆయనకంటే బావున్నాడా?" అంది వదిన నవ్వుతూ.

అనసూయ మొహం చిట్లించి, "హుం— ఆయన! అవకుండానే ఆయననేస్తున్నావే? ఆయనెక్కడా? ఈయనెక్కడా?" అంది. వదిన కొంచెం ఆశ్చర్యపోయింది. అల్లుకొంటున్న జడ అలా పట్టుకొని "అదేవిటే అనసూయా, అలా గంటావ్? రేపో మాపో వాళ్లు పసుపు కుంకుమా ఇచ్చుకోటానికొస్తూంటే, ఇంకా ఖాయమైయ్యేదేముంది?" అంది అనసూయని చూస్తూ.

అనసూయ మొహం ఇంకోవేపు తిప్పుకొని, "నాకా సంబంధం ఇష్టంలేదొదినా. ఈ సంగతే అమ్మకి చెప్పు" అంది.

"ఏమిటీ? నీకా సంబంధం ఇష్టంలేదూ? నిజంగానా? మరయితే పెళ్ళిచూపులనాడు అడిగినప్పుడు నచ్చిందన్నావుగా. మళ్లా ఇప్పుడు నచ్చలేదంటున్నావా? ఏవిటిలా మారిపోయావ్?"

"అప్పుడన్నాననుకో. ఐతే మాత్రం ఇప్పుడు నాకిష్టంలేదు. ఇష్టంలేని పెళ్ళి చేసుకోమంటావా?"

"అలా ఎవరంటారు? నీ అభిప్రాయం ఎందుకో మారిపోయింది."

"అవును. అందమైనవాళ్లని వదిలిపెట్టి, అందంలేనివాళ్లని చేసుకోమంటే..."

"ఎవరా అందమైనవాళ్లు?"

"శారదను చూట్టానికొచ్చిన అబ్బాయి ఎంతందంగా వున్నాడో!"

"ఉంటే? అతను శారదని చూట్టానికొచ్చాడుగాని నీకోసం కాదు."

"వాళ్లిప్పుడే ఖాయపర్చేసుకొన్నారా? మనంకూడా అడగొచ్చుగా."

"అదా సంగతి? అందంగా ఉన్నంతమాత్రాన రాజాలాంటి సంబంధం వదులుకుంటానంటావేం? ఐనా పాలెం అబ్బాయికి అందం తక్కువని నువ్వే అనాలి. సుక్షేత్రంలాంటి పొలం, పాడీ పంటా, గొడ్డూగోదా వుండేసంబంధం యిదయ్యే. ఆ రాజమండ్రివాళ్లకేముంది? వినకొలా సేమీ లేదుగదా, ఆ గుమాస్తా వుద్యోగం తప్పితే. గతిలేనివాడా రాఘవయ్య చేస్తున్నాడుగాని, మనలాంటి వాళ్లకేం కర్మ, ఆస్తిలేని సంబంధం చేసుకోటానికి? ఒక్క అందంకోసం మంచీ చెడ్డా ఆలోచించటంలేదు నువ్వు" అంది మందలింపుగా వదిన. అనసూయ వదిన మొహంలోకి చూచి "నాకు పదెకరాలు కట్నం ఇస్తున్నారుగా. వాళ్లకి ఆస్తి లేకపోతే నేం?" అంది నెమ్మదిగా.

"ఉన్నవాణ్ణే చేసుకొంటే, నువ్వు తీసుకెళ్ళేది కలిసి యింకా ఎక్కువౌతుంది? వాళ్లింటికెళ్లి, ఆఅబ్బాయిని చూసొచ్చి, ఇక అతనే కావాలంటావేమిటి అర్థంలేకుండా? ఇతనికంటే అందగాడింకొకడు కనపడితే మళ్లా వాడే కావాలంటావా? ఐనా పాపమూ రాఘవయ్య చచ్చీ, చెడీ ఆఖరికీసంబంధం తీసుకొచ్చుకుంటే, దానికి మనం పోటీగా వెళ్తే ఏంబావుంటుంది? బాగా ఆలోచించు. నిజానికి శారద, నీకన్నా బావున్నా, మన మిచ్చేకట్నం వాళ్ళివ్వలేరు కాబట్టి, మన సంబంధమే వప్పుకుంటారనుకో. కాని దీనివల్ల పాలెంవాళ్ల సంబంధం చక్కటిది పోతుంది. రాఘవయ్యగారిమీద పోటీకెళ్ళి నట్టూ ఔతాము. ఏమంటావ్?"

"ఏవంటానికేముంది? నువ్వెన్ని చెప్పినా, నా అభిప్రాయం మారదు. మనం పోటీకెళ్లకపోతేమట్టుకు, పట్టుమని పదివేలైనా కట్నం యివ్వకపోతే, అంత అందమైనవాడు, ఎంతందంగావుంటేమాత్రం శారదని చేసుకొంటాడా? ఐనా ఎదటివాళ్ళకోసం మనం పోగొట్టుకొంటామేమిటి? కట్నం యిచ్చుకోలేనివాడికంతందమైన, అల్లుడెలావస్తాడు?— సరేగాని ఈవిషయం అమ్మతో చెప్తావదినా" అంది ప్రతిమాలుతున్నట్లుగా అనసూయ.

"సరేలే. అలాగే చెప్తా. మధ్యలో నాకెందుకు?" అంటూ వెళ్ళిపోయింది వదిన. అనసూయ మనసా నవ్వుకొంది.

* * *

"పాలెంవాళ్లు వుత్తరం పంపారు. వాళ్ళ పాలేరు తీసుకొచ్చి యిచ్చాడు. నేను పొలంలో వుండగా" అన్నాడు భద్రయ్య భోజనానికి కూర్చుంటూ.

"ఏమని రాశారేవిటి?" అని అడిగింది భార్య అన్నపూర్ణమ్మ.

"ఎల్లుండి మంచిదట. పసుపూ కుంకం పుచ్చుకోటానికి వస్తామనీ, మనకేమైనా ఆటంకాలుంటే తెలియజెయ్యమనీ వ్రాశారు. నిన్నడిగి చెప్పొచ్చని పొలంలో ఏమాటా చెప్పలేదు. సాయంత్రం వుత్తరం రాసి వీరిగాడితో పంపాలి. రోజులుకూడా మీద కొచ్చేస్తున్నాయి. ఇక రెండుమూడు లగ్గాలకంటే ఎక్కువుండవు. కుదిరింతర్వాత ఆలస్యం దేనికి" అన్న పూర్ణమ్మ మాట్లాడలేదు.

"ఏం? మాట్లాడవ్?" అన్నాడు భద్రయ్య ప్రశ్నార్థకంగా చూస్తూ. కొన్నేపు తటపటాయించి "ఏమోనండి మరి" అంది— "ఏమో ఏమిటి నీమొహం? ఏసంగతీ చెప్పమంటే అలా నసుగుతావు" అన్నాడు చిరుకోపంతో.

"మధ్యలో నాకొచ్చిపడింది గొడవ. మీదగ్గర నోరు తెరుద్దామంటే భయం. చెప్పకపోతే దాన్తోగొడవ. కోపం తెచ్చుకోకుండా కాస్త నెమ్మదిగా వినండి."

"సరేలే. అసలు సంగతేమిటో చెప్పు."

"అనసూయ పాలెం సంబంధం చేసుకోదట"

"ఏవిటీ? పాలెం సంబంధం చేసుకోదూ? ఏం?"

"దాని కాబ్బాయి నచ్చలేదట. రాఘవయ్యగారి శారదని చూట్టానికి రాజమండ్రీ నుంచి వచ్చాడూ— ఆ అబ్బాయిని చేసుకొంటుందట. ఇక మీ యిష్టం"

"ఆహా! ఇదొకటా? వాణ్ణిచేసుకొంటుందీ? వీణ్ణి చేసుకోదూ? ఏం? వాడికేమైనా కొమ్ములున్నాయా? పెళ్ళి చూపుల్నాడు నచ్చిందందిగా! మళ్లా ఏమైంది?"

"ఏమో! ఏమైందో. మేమూ చెప్పాం. కాని అది వినటం లేదు. పోనీ దాని కిష్టంలేని పెళ్ళిచేసి మనం మాత్రం ఏం బావుకోవాలి? శారదని చూసుకోటానికివ్వాళే వచ్చారు రాజమండ్రీ నుంచి. వెళ్ళిపోయారనుకుంటా. చాటుగా వాళ్ళ ఎడ్రసూ అదీ

కనుక్కొని ఓసారి రాజమండ్రీ వెళ్ళొచ్చండి. ఏమాతుందో చూద్దాం.''

"మరి పాలెం వాళ్ళకేం సమాధానం చెప్పాలి?''

"సమాధానానికేముంది? అందాకా ఏదో వంక పెట్టి రాజమండ్రీ సంబంధం కుదిరితే నిజం చెప్పొచ్చు."

"ఆ రాజమండ్రీ వాళ్ళకి ఆస్తీ అదీ లేదని విన్నానే. దానికోసం, చక్కని సంబంధం వదులుకోటం దేనికి? దాని మంచీ చెడ్డా మనకి తెలీదూ? ఇక దానిష్టమే? విసమెత్తు ఆస్తి లేనివాణ్ణెందుకు చేసుకోవాలను కొంటూందంట? నాకు చస్తే యిష్టంలేదు. అలో లక్ష్మణా అని ఏడుస్తుంది తర్వాత. ఆఁ బాగా ఆలోచించు.'' అన్నాడు భద్రయ్య కూతురికి మంచి చెయ్యాలనే తలంపుకొద్దీ. అన్నపూర్ణమ్మ కొన్నెపు పూగుకొని—

"అవుననుకోండి. ఇక దాని కిష్టం లేనప్పు డేంచేస్తాం? ఎవరికెంత రాసిపెట్టి వుంటే అంత'' అంది.

"అంతేనంటావా? సరేలే. రోజులు గొత్తి కొచ్చేస్తున్నాయి. ఏ సంగతీ తొందరగా తేల్చుకోటం మంచిది'' అంటూ గబగబా భోంచేసి చెయ్యి కడుక్కొని చావిట్లో కెళ్ళిపోయాడు భద్రయ్య.

తర్వాత అన్నపూర్ణమ్మ, అనసూయ, వదిన, భోజనాలకి కూర్చున్నారు. కొన్సేపటికి భద్రయ్య లోపలికొచ్చి భార్య చేతిలో వుత్తరం పెడుతూ "నేను రాజమండ్రీ వెళ్ళొస్తానుగాని, యీ వుత్తరం వీరిగాడితో పాలెం పంపు "అని వుత్తరం యిచ్చి బయట కెళ్ళిపోయాడు. అన్నపూర్ణమ్మ ఆ వుత్తరాన్ని కోడలి చేతిలో పెడుతూ, "ఏం రాశారో చూద్దాం. చదవమ్మా'' అంది. కోడలు శాంత వుత్తరాన్ని ఎడంచేత్తో పట్టుకొని చదివింది. అనసూయ తలవంచుకొని అన్నం తింటూ వింటోంది.

"శ్రీయుత నారాయణయ్య బావగారికి,

మీ క్షేమములు తెలిసినవి. ఇక్కడంతా క్షేమము. చిరంజీవుల వివాహ విషయమై ఖాయపర్చుకోటానికి, ఎల్లుండి గాబో తున్నామని వ్రాశారు. సంతోషం. కాని అనుకోని ఆటంకాలు సంభవించుటవల్ల ఎల్లుండి వీలుపడదని తెలియజేయవలసి వచ్చినది. త్వరలో సమయము చూచుకొని కబురు పంపెదము. చిరంజీవి రామారావు నడిగినట్లు చెప్పగలరు.

ఇంతే సంగతులు.

భద్రయ్య.

అని చదివి వినిపించింది శాంత. "బాగానే వుంది. ఎప్పటికేం జరుగుతుందో చెప్పలేం సుమా! అయిపోవలసిన సంబంధం తప్పటం నాకూ బాధగానే వుంది." అంది అన్న

# ★ అనసూయ అసూయ ★

పూర్ణమ్మ బాధపడుతూ. "ఆఖరికి అనసూయమాటే నెగ్గింది. ఏం ? అనసూయా ! మీ ఆయన అంతందంగా వుంటాడా ?" అంటూ వేళాకోళమాడింది కాంత అనసూయని. అనసూయ తలొంచుకొని భోంచేస్తూ ముసిముసిగా నవ్వుకొంది.

* * *

ఆనాడు రాజమండ్రీనుంచి పెళ్లిచూపులకు వస్తారని భద్రయ్యగారిల్లంతా హడావిడిగావుంది. రాబోయేవారిని సత్కరించటానికి భద్రయ్య ఏర్పాట్లన్నీ పెద్దపెట్టున చేయించాడు. అనుకొన్న సమయానికి పెళ్లికొడుకు చంద్రం, అతని తండ్రి పద్మనాభయ్య, వారితరఫు చుట్టాలింకా యిద్దరు వచ్చారు. భద్రయ్య వారిని తోడుకొచ్చి చావిట్లో కూర్చోపెట్టాడు. టిఫిన్లూ, కాఫీలూ అయ్యాక అనసూయని చావిట్లో పరిచిన తివాచీమీద కూర్చోపెట్టారు. అనసూయ ముసిముసిగా నవ్వుకొంటూ, వారవారగా చూస్తూ కూర్చుంది. పెళ్లికొడుకు తరఫువాళ్లు ఏదో రివాజుప్రకారం, అమ్మాయిని అడగవలసినవి అడిగారు. తర్వాత అనసూయ లేచి వయ్యారంగా లోపలికెళ్లిపోయింది. కాస్సేపాగి భద్రయ్యగారి తరఫు మనిషి ఒకాయన "అమ్మాయిని చూచుకోటం ఐపోయింది కట్నం విషయం కూడా ఏమీ ఆలోచించ నక్కర్లేదు. అమ్మాయికి పదికరాల సుక్షేత్రం వప్పజెపుతారు. ఆపైన మిగిలిన, లాంఛనాలన్నీ యధావిధిగా జరుపుతారు. మీ అంగీకారం తెల్పండి మరి" అన్నాడు పెళ్ళిపెద్దల్ని చూస్తూ. "పదికరాలే !" అని లోలోపల ఆశ్చర్యపోతూ, "సరేనండి. ఇంటికెళ్లాక వ్రాస్తాం. ఇక వస్తాం మరి" అంటూ లేచాడు పెళ్లికొడుకు తండ్రి పద్మనాభయ్య. మంచిది ఏసంగతీ తొందరగా తెల్పండి. రోజులు మీద కొచ్చేస్తున్నాయి" అంటూ భద్రయ్యగారు, ఆయనతరఫు మనుషులూ పెళ్లివారిని పక్కవూరి స్టేషన్‌వరకూ సాగనంపి వచ్చారు.

ఈవార్త ఆపల్లెటూర్లో పొగలా వ్యాపించిపోయింది. "రాఘవయ్యకీ, భద్రయ్యకీ పోటీపడిందని" ఆశ్చర్యపోయారంతా. "రాఘవయ్య సంబంధం యిష్టంలేకపోబట్టే, యింకో సంబంధం చూచుకోటాని కొచ్చారుగాని, లేకపోతే వస్తారా ? ఇక రాఘవయ్య వాళ్లమీద ఆశ వదులుకోవచ్చు" అన్నారు కొంతమంది.

"పదికరాలిచ్చేభద్రయ్య సంబంధం వదిలిపెట్టుకొని, ఏదో ముష్టికట్నం వప్పజెప్పే రాఘవయ్య సంబంధం చేసుకొంటారా ? అబ్బే, రాఘవయ్యెక్కడ పోటీపడగలడు భద్రయ్యతో" అనుకొన్నారు కొంతమంది. "ఇదంతా అనసూయ పట్టుదలేనట. కలిగిన వాళ్లు కాబట్టి ఏం కోరినా తీరుతుంది. పాపం. ఆ శారదకి కావలసిన సంబంధం కాదూ యిది ?" అనుకొన్నారు కొందరమ్మలక్కలు. మొత్తానికి వూరు వూరంతా యీ గొడవకి, అట్టుడికినట్టుడికి పోయింది. రాజమండ్రీవాళ్ల దగ్గర్నుంచీ ఎప్పుడేవార్త వస్తుందోనని ఎదురుతెన్నులు చూస్తున్నారంతా. ఆ వూరి పోస్టుమాస్టరు కూడా టపా రాగానే, రాజమండ్రి నుంచి వచ్చిన వుత్తరాలకోసం వెతికేవాడు.

శారదేనాడో ఆశ నిరాశ చేసుకుంది. రాఘవయ్య ఇతర సంబంధాలు చూడసాగాడు. అనసూయ, ఎప్పుడూ చంద్రం అందాన్నే తల్చుకొని మురిసిపోతూ వుండేది. ఒక్కోసారి మనస్సు కెంకంచి "నాకంటే అందంగా వుండే శారదని మానేసి, నన్నెందుకు చేసుకొంటారు ?" అని లోపలనుకోబోయి పైకనేస్తే, వదిన పక్కనుంచే చిన్నగా నవ్వి"పదికరా లిస్తున్నాంగదూ ?" అనేది.

శారద ఏమనుకొంటోందో తెలుసుకోవాలని వుండేది అనసూయకి. ఓసారి మాటల సందర్భంలో వంటరిగా వున్నప్పుడు చిన్నినడిగింది. అనసూయ "శారదేం చేస్తోంది" అని.

"నీ మీదకి పోటీకిమాత్రం రాదులే. వాళ్ల బాబు గడించలేదుగా మీ బాబులా" అంది నవ్వుతూ చిన్ని.

"స్నేహితురాల్ని వెనకేసు కొస్తున్నావ్ గాని, గడింపులో ఏముంది ? అదృష్టంలో వుందిగాని, పుణ్యంకొద్దీ పురుషుడు" అంది అనసూయ గర్వంగా. చిన్ని కాస్త ఆశ్చర్యపోయి "నీ అదృష్టం మాత్రం యింకా తేలీలేదుగా. ఏం జవాబొస్తుందో !" అన్నది.

అనసూయ ఓసారి చిన్నగా నవ్వి "నీకింకా అనుమానమేనా ? పోనీలే ఆ కబురూ తెలుస్తుందిగా రేపో, మాపో. నాకు బాగా నమ్మకముంది. పెళ్లి చూపుల్నాడు అతను నా వేపెన్నిసార్లు చూశాడో నీకేం తెల్సు ? ఇంకా ఎందుకుగాని అతన్ని శారద మర్చిపోవటం మంచిది అంది సగర్వంగా. చిన్ని మాట్లాడకుండా వెళ్లిపోయింది.

* * *

అందరూ ఎదురుచూసే రోజు రానే వచ్చింది. రెండు కవర్లు పట్టుకొని పరుగెత్తుకొచ్చాడు పోస్టుమాన్ భద్రయ్యగారింటికి. అప్పుడే భోంచేసి చావిట్లో పడుకొన్న భద్రయ్యగారు పోస్టుమాన్‌ని అల్లంత దూరంలో చూచి, ఎదురొచ్చి, చేతిలో వుత్తరం తీసుకొని "అప్పుడే వచ్చిందటోయ్ పోస్టు" అన్నారు వుత్తరాన్ని పరిశీలిస్తూ. "పోస్టు పెందరాడే వచ్చేస్తుంది కదండీ. అన్ని పన్లూ చూచుకొని మధ్యాన్నానికల్లా యిస్తాం.

ఈ ఉత్తరాలు రాజమండ్రీనుంచి వచ్చాయని వెంటనే యిచ్చిరమ్మన్నార్లు మేష్టారుగారు. పెళ్ళివారు రాశారనుకుంటానండి. ఏం రాశారో విందాం. చదవండీ. "అంటూ తొందరచేశాడు పోస్టుమాన్ భద్రయ్యగారిని. ఆయన చావిట్లోకొచ్చి, మడతకుర్చీలో చతికిలబడి," ఏయ్-నిన్నే నే, రాజమండ్రీనుంచి వుత్తరం వచ్చింది తొందరగారా. వినపడిందా. తొందరగా "అని పిలిచాడు లోపలికి చూస్తూ. "వస్తున్నానండీ" అనుకొంటూ అన్నపూర్ణమ్మ బైటకొచ్చింది. అనసూయ తల్లికొంగుపుచ్చుకొని నిలబడింది. "కోడలేదే ? అందరూ రండి. విందురుగాని."

కొంచెం పనిమీద రాఘవయ్యగారింటికెళ్లింది.వచ్చాక చెబుదాం చదవండివిందాం"

### జ్ఞాపకశక్తి

"సరే, నా దగ్గిర మందు పుచ్చుకుంటున్నప్పటి నుంచి, మీ జ్ఞాపకశక్తి ఎక్కువవుతోందంటారు. అంతేనా?" అని డాక్టరు రోగి నడిగాడు.

"అంత బాగాలేదుగానండీ, కొంచెం ఫరవాలేదండీ. ఏదో మరిచిపోయానని మాత్రం జ్ఞాపకం వస్తూ ఉంటుందండి."

అంది అన్నపూర్ణమ్మ కంగారుగా భద్రయ్య కవరుచించి కాయితం చేతులో పట్టుకొని చదవసాగాడు.

శ్రీ భద్రయ్య గారికి ..

ఏ సంగతీ తెలియజెయ్యమన్నారు గాబట్టి వుత్తరం వ్రాస్తున్నాం. మీ అమ్మాయిని చేసుకోటానికి మా అబ్బాయి యిష్టపడటంలేదు."

అంతవరకూ చదివిన భద్రయ్యగారు తెల్లబోతూ చూశారు ఎదటివాళ్లవంక. అనసూయ గతుక్కుమంది. "మిగిలింది కూడా చదవండి బాబూ విందాం" అన్నాడు పోస్టుమేన్. భద్రయ్యగారు తిరిగీ చదవటం సాగించారు-పెళ్ళిచూపులకు రావటానికే పేచీ పెట్టాడు. ఇంతకుముందే రాఘవయ్యగారింటికి రావటంవల్ల, ఇక వారమ్మాయినే గాని ఎవర్నీ చేసుకోనంటున్నాడు. "వాడు మనిషంత మనిషయ్యాక, నాయిష్టం ఏముంది? ఎంత కట్నంయిస్తే మట్టుకు వాడికిష్టంలేని పెళ్ళిచేసి ఏంబావుకోవాలి? అందుకని వాడిష్టప్రకారమే సాగనిస్తున్నాను. మీరు అన్యథా భావించక, అమ్మాయికి వేరే సంబంధం చూసుకోవలసిందిగా కోరుతున్నాను. ఇంతే సంగతులు. ఇట్లు

పద్మనాభయ్య."

ఏడిశావ్ లే. బోడివెధవ. బోడికోరటం. అంటూ భద్రయ్య ఆ వుత్తరాన్ని ముక్కలుగా చింపేశాడు కసిగా. "ఈ వుత్తరం రాఘవయ్య గారికిస్తాను తొందరగా." అంటూ పరుగెత్తాడు రెండో కవరు పట్టుకొని పోస్ట్ మాన్ చావిట్లోంచి వీధిలోకి. అనసూయ దుసగుసలాడ్తూ లోపలికెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ చావిట్లో చతికిలబడింది.

"పదకొండో శాలిస్తామంటే కూడా నిలుగుతున్నాడే!"

ఐనా మనదే తప్పండీ. కానీ ఆ స్తితిలేని వాడిని పట్టుకొని పదకొండలిస్తామంటే యిమ్ముద్దనుకోవద్దూ? ఎర్రగా బుర్రగా వున్నానని విర్రవీగుతున్నాడు కావల్సు. ఐనా తప్పిపోయిందల్లా మనకే మంచిది, బస్తీవాళ్ళని నమ్మటం చెరుపే. వాళ్ళ జూలాయి తిరుగుళ్ళకే సరిపోతుంది మనమిచ్చేదంతా. ఏదో చిన్నతనం. తెలీక పట్టుబట్టింది గాని, మళ్లా ఆ పాలెం వాళ్ళకి కబురు పంపండి. నిక్షేపంలాంటి సంబంధం. త్వరగా కానిచ్చుకోవచ్చు."

"నిజమే. సాయంత్రం వుత్తరం రాసి పంపుతాను. పసుపుకుంకము లిచ్చుకోటానికి రమ్మని వ్రాస్తాను. మళ్లా అమ్మాయితో ఏమయినా గొడవ వస్తుందేమో?"

"ఫర్వాలేదులెండి. ఈమధ్య దాని బుద్ధి పెడదార్లు పట్టిందిగాని, అసలు మొదట్లో వప్పుకోలా? తొందరగా వ్రాయండి ఉత్తరం."

ఇంతలో కాంత తొందర తొందరగా వచ్చింది.

"అత్తయ్యా! రాఘవయ్యగారికి రాజమండ్రీ వాళ్లు వుత్తరం రాశారు. మనకి రాయలా?"

"రాశార్లే వాళ్లకేం రాశారేమిటే?"

"శారదని చేసుకొంటారట. పసుపు కుంకమిచ్చుకోడానికి మంచిరోజు చూచి కబురు పంపమని వ్రాశారు. మరి అనసూయని చేసుకోమన్నారా?"

"ఆఁ వాళ్లంటే లెక్కా! వాడు గాకపోతే వాడి తాతలాంటివాడింకొకడు," అంటూ చావిట్లోనుంచి వెళ్లిపోయింది అన్నపూర్ణమ్మ.

* * *

"ఒరేయ్! రామం! మీమావగారుత్తరం పంపారురా—ఏమేవ్ వియ్యంకుడుత్తరం పంపాడు—" అన్నాడు నారాయణయ్య పొలంనుంచి వచ్చి చావిట్లో చెప్పులు విడిచి వంటింటివేపొస్తూ

"ఎప్పుడు రమ్మని రాశారేమిటండీ" అనడిగింది భార్య యివతలికొస్తూ.

"సోమవారంనాడు మంచిదట రమ్మని వ్రాశారు. వస్తామని రేపుత్తరం రాసి పంపుతాను. ఏమంటావ్?"

"అలాగే తొందరగా కోడలొస్తే నాకూ మంచిదేగా."

గదిలోంచి యిదంతా వింటున్న రామారావు గుమ్మందగ్గర నిలబడి "మీ సంబంధం మా కక్కర్లేదని వ్రాసి పంపు నాన్నా" అన్నాడు గంభీరంగా. నారాయణయ్య తెల్లబోయి "ఏమిట్రా నువ్వనేది? సంబంధం అక్కర్లేకపోవటం ఏమిటి?" అన్నాడు అర్థంగాక. రామారావు తండ్రికేసి చూస్తూ "అవున్నాన్నా. తెలిసిం తర్వాత కూడా వాళ్లతో సంబంధమెందుకు మనకి? మనతో మాట్లాడుకొని, మళ్లా ఎవడికో ఇవ్వాలని చూట్టమా? తీరా వాళ్ళొప్పుకోలేదని మళ్లా మనకే అంటగట్టడమా? అంత చచ్చు దద్దమ్మలెవరూ లేరిక్కడ. మాకక్కర్లేదని వ్రాసెయ్" అన్నాడు కోపంగా.

"ఆ సంగతి నీకెలా తెలిసింది? అలా ఎందుకు చేస్తార్రా వాళ్లు?"

"మహా యింతోటి దూరానికి ఎక్కడేం జరిగేదీ తెలీనే తెలీదూ? పాలాన ఎప్పటికప్పుడు వాళ్లపాలేరే నాకు చెప్తూ వుంటాడు. రాజమండ్రి నుంచి ఎవరో, ఎవర్నో చూచుకోటానికొస్తే, ఆ అబ్బాయినే చేసుకొంటానని కూతురు పట్టుబడితే భద్రయ్యగారు రాజమండ్రి వెళ్లి, వాళ్లని తీసుకొచ్చాడట. అందుకే మనం కబురంపినప్పుడు ఏవో ఆటంకాలున్నాయని కబురంపారు. తీరా ఆ రాజమండ్రి అబ్బాయి ముందు చూసిన పిల్లనే చేసుకొంటానన్నాడట. ఇక మనమేం కనపడ్డాం మళ్లా. మనకి కబురంపారన్నమాట. ఇంత గ్రంథం జరిగాక యిక ఆ అమ్మాయి కేమిష్టముంటుంది నామీద? అందుకే ముందే మేలుకోవటం మంచిది. మా కక్కర్లేదని వ్రాసెయ్యండి. నేనలా వెళ్ళొస్తా" అంటూ వెళ్లిపోయాడు రామారావు. తల్లి దండ్రు లిద్దరూ తెల్లబోయి చూస్తూ వుండిపోయారు.

* * *

తత్ఫలితంగా ఆ ఏడాది అనసూయకి పెళ్లి కాలేదు. రోజులు మీదకొచ్చేయటం వల్ల మరో సంబంధం చూసుకోడానికి కూడ సమయం లేకపోయింది. చంద్రం అత్తవారింటి కొచ్చినప్పుడల్లా భద్రయ్యగారింటి ముందునుంచే తిరుగుతూ వుంటాడు. వీధిలో పోయే చంద్రాన్ని చాటుగా చూస్తూ వుంటుంది అనసూయ అనాయగా. ★

# శశి కోపం

ఉదయం ఏడుగంటలైనది సూర్యుని పసిడి కిరణాలు మంచంమీద పడుతున్నవి. పనిమనిషి ముంగిల్లు ఊడుస్తున్నది. చల్లటి పిల్లగాలులు వీస్తున్నవి. అలాగే పండుకొని యేదో ఆలోచిస్తున్నాను ఇంతలో పనిమనిషి వచ్చి, "ఏం బాబూ ఇక్కడ పండుకొన్నారు. తెల్లవార్లు మంచు పడుతూనే ఉన్నది. రోజూ ఇంట్లో మంచాలువేసుకొనే వారు ఇక్కడెందుకు వేసుకొన్నారు బాబూ" అన్నది.

నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఆశ్చర్యముతో నే కళ్లు విప్పి ప్రక్కన చూచాను శ్రీమతిగాని ఆమెమంచముగాని లేదు. రోజూ పదిగంటలవరకు చల్లగాలికోసం బయటవేసుకొనటం ఆ తరువాత మంచుపడుతున్నదని మా ఆవిడ లేపటం, మంచాలు ఇంట్లో వేసుకొనటం అలవాటు. ఈ రోజు ఇలా జరిగిందేమా అనుకొంటూ లేచి ఇంట్లోకి వెళ్ళాను

మా ఆవిడింకా నిదుర లేవలేదు. ముసుగు తీస్తూ "శశీ ఏమిటీ మొద్దునిద్దుర. ఏడున్నర అయింది ఇంకా నిదుర లేవకపోతే యెలా? ఈ రోజు శనివారం కదూ త్వరగా ఆఫీసు కెళ్లాలి త్వరగాలే ఊ...ఊ.. త్వరగా లే" అని లేపాను

శశి లేస్తూ నా వైపు వింతగా చూసింది. తరువాత తరువాత కోపంతో ముఖం అంతా యెఱ్ఱగా మారింది. "ఊ! మొద్దునిద్దుర... మొద్దులం! పశులవుసుగా కూడా కనబడుతాము మీ కంటికి" అంటూ విసురుగా లేచి పెరటిలోకి వెళ్ళింది.

నేను నిర్ఘాంతపోయాను ఇంతకోపం యెందుకు వచ్చిందా అని. "మొద్దు నిద్దుర" అన్నందుకే కోపంవచ్చిందా. అదైనా లాలనగానే అన్నానే. ఇంతకుముందు యెన్నిసార్లు హేళనచేయలేదు! వాటికి కొద్దిగానన్నా కోపగించుకోకుండా నవ్వి ఊరుకొనేది. ఎంతో ఆలోచించాను. ఆలోచించి, ఆలోచించి బుఱ్ఱ వేడెక్కి ముఖం కడుగుకొనటానికి వెళ్లాను.

పత్రిక చదువుతూ పడకకుర్చీలో పడుకొన్నాను. శశి కాఫీ తీసుకొచ్చి ప్రక్క టేబిలుమీద పెట్టి వెళ్ళింది. అప్పుడుకొని తెలియలా శ్రీమతికోపం తారస్థాయినందుకొన్నదని. ఎందుకంటే రోజూ కాఫీ తీసుకొచ్చి చేతికందిచ్చి తను ప్రక్కనున్న టేబిలుకు వయ్యారముగా ఆనుకొని పేపరు విషయాలు అడుగుతూ మధ్య మధ్య తన స్కూలు ఫైనలు మిడిమిడి జ్ఞానముతో నన్ను వేధించి తను చిరాకుపడిగాని మరీ వదిలేదు కాదు.

మళ్లీ ఆలోచనలు మెదడులో విహరిస్తున్నవి. ఇంత కోపము రావటానికి కారణ మేమిటో తెలియలేదు. గడియారం పది గంటలు కొట్టింది. ఆఫీసుకైమయిందని చల్లారిన కాఫీ త్రాగి ఆఫీసుకెళ్లాను.

ఆఫీసులో నా టేబిలుముందు కూర్చున్నాను వర్కుచేద్దామని ఒక ఫైలు తీశాను. మనస్సంతా చీకాకుగా ఉన్నందున వర్కు యేమాత్రము చేద్దామన్నా మనస్సొప్పటం లేదు ఇక్స్పెక్షను దగ్గరకు వస్తున్నది. టేబిలు డెస్కుల్లోనుంచి సరిచూడవలసిన ఫైల్సు అన్నీ తొంగిచూస్తున్నవి. అవన్నీ నా చేతగాని తనాన్ని చూచి వెక్కిరిస్తున్నవా అని అనిపించింది తలనొప్పి నెమ్మదిగా మొదలు పెట్టింది తల చేత్తోపట్టుకొని మోచేతులు టేబిలుమీద పెటి ఆలోచించడం మొదలుపెటాను.

## కౌశిక లక్ష్మీనారాయణ

ఇంతలో మూర్తి వచ్చి "ఏరా అలా ఉన్నావు. ఒంట్లో బాగుండలేదా" అని పరామర్శించాడు.

"ఏం లేదండి," అని ముభావంగా సమాధాన మిచ్చాను.

ప్యూనువచ్చి ఆఫీసరు రమ్మంటున్నా డంటే వెళ్ళాను.

ఆఫీసరు "రామారావ్! ఆ స్టేటుమెంటు పూర్తిఅయిందా" అన్నాడు.

"కాలేదండి" అన్నాను.

"ఆ స్టేటుమెంటు చాలా అర్జంటు. త్వరగా కావాలి" అంటూ "అదేమిటోయ్ అలా నీరసంగా ఉన్నావు. ఒంట్లో బాగుండకపోతే ఆ స్టేటుమెంటు పూర్తిచేసి ఇంటి కెళ్ళు" అన్నాడు.

ఆ స్టేటుమెంటు పూర్తిచేసి ఇంటికి బయలుదేరాను. శశికి ఇంత కోపము రావటానికి కారణమేమిటా అని యెంత ఆలోచించినా, సమస్య సమస్యగానే ఉండిపోయింది. కోపానికి కారణము దానినే అడిగితే తెలిసిపోతుందని ఇంట్లో అడుగు పెట్టాను. శశి వంటఇంట్లో ఉన్నది. కాళ్ళు కడుక్కోటానికి పెరట్లోకెళ్ళి మరల ఇంట్లోకొచ్చేటప్పటికి పీటవాల్చి స్థలం భోజనం, కావలిసినవన్నీ ఆ చుట్టూ పెట్టివున్నవి. సరే ఇంకా కోపం తగ్గలేదని భోజనంచేసి హాలులోకి వచ్చాను

శశి కుర్చీలో ముఖంవాల్చుకొని కూర్చున్నది. కళ్ళు ఎఱ్ఱగాఉన్నవి. మరలా ఆఫీసు కెళ్ళటానికి షర్టువేసుకొంటూ దగ్గరకెళ్లాను. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నవి. ముక్కు చీదేస్తున్నది.

మా నాలుగేళ్ల సంసార జీవితంలో శశి యేడుస్తున్నప్పుడు నేనెప్పుడూ చూడలేదు. నాకు యేమీ తోచలేదు. దానిముఖం నావైపు త్రిప్పుకొని "ఏమిటిదంతా? ఎందుకింత కోపం? నేనేమన్నానని, యేమి చేశానని. అబ్బే ఏడవటంకూడా యెందుకు" అంటూ దగ్గరకు తీసుకోబోయాను.

ఈ మాటలతో కోపం మరీ యెక్కువైంది "ఏంచేశా నంటున్నారు, యేమీ తెలియనట్టు. యేమయితే నాకెందుకు, నేను ఈ సాయంత్రం మాయింటి కెళ్లుతున్నాను" అన్నది.

"వారంరోజులేగా అయింది మాయింటి కెళ్ళొచ్చి. మాయింటి కెళ్ళవలసిన అవసరం ఇప్పుడేమొచ్చింది?" అన్నాను.

"పనిమనిషిమీద ఉన్న ప్రేమైనా నామీద లేనప్పుడిక్కడ యెందుకుండాలి" అన్నది.

ఈ మాటలు విని మొదట నిర్ఘాంత పోయాను. తరువాత ఈ నిందకు అవమానము, అసహ్యముయేసి బయటికొచ్చాను

గోడుదాటి అలా మలుపుతిరిగే టప్పటికి మూర్తి యెదురయినాడు. "ఏరా ఆఫీసుకేనా పోయేది" అన్నాడు.

"లేదు. ఒంట్లో యేమీ బాగుండలేదు. అలా హాస్పిటలుకు వెళ్లుతున్నాను. ఈ పూటకు సెలవు పెడతాను ఆఫీసరుకు ఇస్తావా" అన్నాను.

"అలాగే" అన్నాడు.

సెలవు చీటీవ్రాసి మూర్తికిచ్చి అలా బయలుదేరాను. ఆ గొందిగుండా ఆలోచిస్తూ నడుస్తున్నాను. ఊరి చివరకు వచ్చేశాను. ఇంకా నడిచి కొన్ని పొలాలుదాటి ఒక కుంట కట్టమీద చెట్టుక్రింద కూర్చొని ఆలోచన మొదలుపెట్టాను, శశి అట్లా అనుమాన పడటానికి కారణమేమిటా అని.

పనిమనిషి వయసుదేకాని దుష్ప్రవర్తన

డలదికాదు. పోనీ నేనేమన్నా, యెప్పు డన్నా కొంటెతనముగా ప్రవర్తించానా అంటే అదీలేదు. ఎంతగా నన్ను నేను విమర్శించుకున్నా శశి నన్ను అనుమానించటానికి కారణాలేమీ కనబడలేదు. కారణాలేమీ కనబడకపోయేటప్పటికి శశిమీద కోప మొచ్చింది. ఇన్నాళ్ళబట్టి నన్ను, నా ప్రవర్తనను అర్థముచేసుకోలేక పోయిందేమా అని. శశికికూడా నేనంటే వల్లమాలిన అభిమానము. తాను నావంటిభర్తను పొందటం పూర్వజన్మ సుకృతమని చెప్పటం యెన్నిసార్లు విన్నాను! ఇలా, అనుమానపడటానికి నిగూఢమైన కారణమేదో ఉండి ఉండాలి. ప్రతి-చిన్న విషయానికి ఆడవాళ్ళు అనుమానపడటం పరిపాటి. ఇలా శశిమీద కోపంపోయి మొత్తం ఆడజాతిమీదే కోపంవచ్చింది. ఇలా ఆలోచిస్తూ, కోపగించుకుంటూ, అసహ్యించుకుంటూ, చీకటి పడిందాకా అక్కడే ఉన్నాను.

నెమ్మదిగా బయలుదేరి ఇంటికొచ్చాను. దీపాలు వెలగించలేదు. ఇల్లంతా చీకటిగా ఉన్నది. శశి వంట ఇంట్లో ఉన్నట్లున్నది. సరే ఆ చీకట్లోనే ఛైర్లో కూర్చున్నాను.

ఇంతలో మూర్తి భార్య "ఏమే పిల్లా" అంటూ నన్ను చూడకుండా నే వంట ఇంట్లో కెళ్లింది.

"ఏమే శశీ! తమ్ముడెక్కడికి కెళ్ళాడు!" అంది.

"ఏమో యెక్కడికి కెళ్ళారో" అని మా ఆవిడన్నది.

సరే వీళ్ల సంభాషణ చప్పుడుకాకుండా విందామని అలాగే కూర్చున్నాను.

"అలా ఉన్నావేమే శశీ!"

మా ఆవిడ యేమీ మాట్లాడలేదు.

"అదేమిటే మాట్లాడవేం" అన్నది.

మా ఆవిడ రుద్ధకంఠంతో "ఏం లేదు వదినా" అన్నది

సమాధానం చెప్పకుండా కుమిలి కుమిలి యేడుస్తున్నది.

ఆమె లాలనగా "నాతో చెప్పు యేమి జరిగింది? నాతో చెప్పకపోతే యెవరితో చెప్పతావు! ఊ...చెప్పు" అని బ్రతిమిలాడింది.

"రాత్రి వారు నన్ను కొట్టారు వదినా. ఇవాళల్లా అదోమాదిరిగా ఉన్నారు." అని అంటూ దుఃఖం కట్టలుతెగి భోరున యేడ్చింది.

నా ఆశ్చర్యానికి అంతులేదు. నేను దానిని కొట్టానా! యెన్ని అబద్ధాలాడుతున్నదని అనుకున్నాను.

"కొట్టాడా! దేనికి కొట్టాడు" అని ఆమె ఆశ్చర్యముతో అడిగింది.

"ఏం లేదండి. రాత్రి బయట మంచాలు వేసుకున్నాము. అర్ధరాత్రప్పుడు మంచు బాగా పడుతున్నది. మంచాలు ఇంట్లో వేద్దామని వారిని లేపాను. లేపాననికోపంతో ఆ చెంపా ఈ చెంపా వాయించారు."అన్నది.

"ఈచిన్న విషయానికే కొట్టాడా? ఈమగవాళ్ల మనస్సులు అర్థంచేసుకోవటమేకష్టం! జ్వరంగా ఉన్నదని సాయంత్రం లీవు పెట్టాడట ఎక్కడికి కెళ్ళాడు?" అన్నది.

మా ఆవిడ ఆశ్చర్యముతో "జ్వరము తగిలిందని శెలవుపెట్టారా?" అన్నది.

ఆమె "ఊ.. సరే నేను వెడతా" అంటూ లేచింది.

"దీపం చూపిస్తా నుండు వదినా" అంటూ శశి, ఆమే హాల్లో కొచ్చారు.

నన్ను చూచి శశి నాదగ్గర కొస్తున్నది.

ఆమె నన్ను చూచి "ఏరా, రామూ, ఈమధ్య మంచి ప్రయోజకత్వం సంపాదించావని వింటున్నాము," అంటూ నా భార్యతో "వెళ్ళొస్తానే" అంటూ వెళ్లింది.

అవమానంతో శరీరమంతా కుంచుకుపోయింది. తలదాసంతట అదే వంగిపోయింది.

శశి నా వస్లితాకి "జ్వరము తగిలి యెక్కడికెళ్లారు" అన్నది.

కొద్దిసేపు ఉండి "రాత్రి నిన్ను కొట్టానా?" అన్నాను.

"దేనికిప్పుడా విషయం?" అన్నది.

"అదికాదు. నిజంగా నిన్ను కొట్టానా?" అన్నాను.

శశి నాముఖం వైపు అదోలా చూచి అవునన్నట్టు తలకాయ ఊపింది.

ఆశ్చర్యముతో యేమీ తోచక అలాగే దాని ముఖం వైపు మాస్తూ ఉండిపోయాను. తళుక్కున ఐడియా తట్టింది.

"శశీ నీవు సైన్సులో మెడల్లాను గురించి చదివే ఉంటావు. అది చేసేపను లేమిటి?" అంటూ సాఫీగా నవ్వుతూ అడిగాను.

నా యీవింత ప్రశ్నకు శశి మొదట బిత్తరపోయి తరవాత "అసంకల్పిత ప్రతీకార చర్యలు" చేస్తుందన్నది.

"సరే అలాగైతే నేను చెప్పేది సాఫీగా విను. రాత్రికలలో ఎందుకో ఒక కుఱ్ఱవాడిని కోపంతో చెంపలు వాయించాను. బహుశా నీవు ఆసమయంలోనే నన్ను లేపి ఉంటావు" అన్నాను.

"నన్ను యెందుకు పిచ్చిదాన్ని చేసి చెప్పతారు. నన్ను మభ్యపెట్టటానికి ఇదో కథ అల్లారు" అన్నది.

"అది కాదు శశీ ఈనాలుగు సంవత్సరాలలో యెప్పుడన్నా నీమీద చెయ్యి చేసుకున్నానా? అదికాక ఇటువంటి చిన్నవిషయానికి కొట్టేటంతమూర్ఖుడునా—నీవునన్ను బహుశా గాభరాగా లేపి ఉంటావు..." అన్నాను.

"అవును గాభరాగానే లేపాను. నాకు మెలకువ అకస్మాత్తుగా వచ్చింది. మంచు బాగా పడుతోంది. మీరు మఫ్లరు కూడా కట్టుకోలేదు. అయితే ఇదంతా ఆమెడల్లా ప్రభావమే నన్నమాట" అన్నది.

అవునన్నాను శశిని దగ్గరకు తీసుకొంటూ. చెంపలు తడుముకుంటూ "ఎలాగైతే నేమి చెంపలువాచేట్టు కొట్టారు" అన్నది బుంగమూతి పెట్టి.

"ఎన్ని దెబ్బలు కొట్టాను" అన్నాను నవ్వుతూ.

"నాలుగో ఐదో" అన్నది.

"అయితే వాటికి నష్టపరిహారంగా వాటికి డబలు ముద్దులు ఆచెంపలమీదే పెట్టనా" అన్నాను.

"వాటికి కొదవేమిటి. మీ వళ్ళంతా కాగిపోతోంది. మంచాలు ఇంట్లోనే వేస్తాను. కాఫీ త్రాగి పడుకోండి," అన్నది.

"ఇంక మనము మంచాలు బయట వేసుకోవద్దు ఎప్పుడూ ఇంట్లోనే వేసుకుందా" మన్నాను నవ్వుతూ.

శశి మందహాసంజేసి "సరే లెండి మరీ" అంటూ కాఫీ తీసుకురావటానికి ఇంట్లో కెళ్ళింది.

ఆ మందహాసంతో ఆ రోజల్లా అదోలా ఉన్న మా యింటిలో ఆనందం వెల్లివిరిసింది:

ఎలా అయితేనేం అన్యోన్య జీవులం అవాంతరంనుండి బయట పడ్డాము. ★



# మానవుని అం

# కృత్రి[illegible]గో

సామాన్యుల దృష్టితో చూస్తే చంద్రబింబం అందమైనది; పగలల్లా పనిచేసి అలసిన మానవులకు హాయి, ఉల్లాసం చేకూర్చేది; పిల్లలకి అందరాని అందమైన ఆటవస్తువు. మన కావ్యాలదృష్ట్యా ప్రేమికులకు విరహం కల్పగొట్టేది. పురాణాల దృష్ట్యా శివునిజటాజూటంపైన ఉండేది. పాశ్చాత్యుల పురాణాల దృష్ట్యా అందమైన స్త్రీదేవత; మృగయాధి దేవత; ఇంకా ఎన్నో!

కాని ఆధునిక విజ్ఞానశాస్త్ర దృష్ట్యా చంద్రబింబం ఇదేమీ కాదు. భూమి చుట్టూ



రాత్రిపూట ఆకాశంలో ఆవరించుకునిఉండే అస్పష్టకాంతిని పరిశీలించడానికి ఉపయోగించే ఫొటో ఎలక్ట్రిక్-ఫొటో మీటర్‌ను క్లైమాక్స్ పీక్ (కొలరాడో) అగ్రాన అమరుస్తున్న అమెరికన్ శాస్త్రజ్ఞుడు. భూభౌతిక పరిశోధనలకు గాను, ఇటువంటి పరికరాలను వివిధదేశాల శాస్త్రజ్ఞులకు అమెరికా సప్లయిచేస్తుంది.

తిరిగే ఉపగ్రహం. నిర్జీవమైనశీతలమండలం. చంద్రుడిలోని మచ్చ జింక కాదు. చంద్రమండలంలోని కొండలు, మైదానాలు!

మనిషి ఎప్పటికైనా చంద్రగోళాన్ని చేరుకోగలడా? అనే ప్రశ్నకి శాస్త్రజ్ఞులు "చేరుకోగల" డనే చెబుతున్నారు. అంచెలంచెలుగా అతి వేగంగా ప్రయాణం చేసే రాకెట్లను తయారుచేసి చంద్రుణ్ణి చేరుకోవచ్చునని అంటున్నారు. చేరుకోవడమే కాదు; మానవులు అక్కడ వలసలు ఏర్పరుచుకొని స్థిరంగా ఉండిపోవచ్చునని, ఇతర గ్రహాలమధ్య కూడా రాకపోకలు సాధ్యమేననీ అంటున్నారు.

ఇదంతా సంభవం కావడానికి ముందు, అసలు భూమి తత్వాన్ని గురించే మనం క్షుణ్ణంగా తెలుసుకోవలసి ఉంది. భూగర్భానికి, ఉపరితలానికి అంతరిక్షానికి సంబంధించిన అనేక రహస్యాలు ఇంకా తెలుసుకోవలసి ఉంది. భూమిఒక పెద్ద అయస్కాంతం లాంటిది. దీనికి కారణం శాస్త్రజ్ఞులు ఇంతవరకూ కనుక్కోలేకపోయారు. ఈరహస్యాలన్నిటినీ ఛేదించడానికే 62 దేశాల్లో, పదివేలమంది శాస్త్రజ్ఞులు, 50 కోట్ల డాలర్ల ఖర్చుతో "అంతర్జాతీయ భూభౌతిక పరిశోధనలు" ఈ ఏడాది ప్రారంభించారు.

ఈ పరిశోధనల కార్యక్రమంలో ఒక ముఖ్యాంశం, "కృత్రిమ చంద్రగ్రహం". భూమిలోంచి చంద్రుడు విడివడినట్టుగానే, మానవుడి మేధాశక్తిలోంచి మరో చంద్రగోళం విడివడి భూమిచుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. అయితే ఇది చాలా చిన్నగోళం. అంతా కలిపి ముప్ఫయ్ పౌన్ల బరువుంటుందేమో. దీన్నిండా, రకరకాల విషయాలను కనిపెట్టి మళ్ళీ భూమి మీదికి ఆ విషయాల్ని ప్రసారం చెయ్యడానికి పనికొచ్చే అనేక వైజ్ఞానిక పరికరాలుంటాయి.

ఇలాంటి కృత్రిమ చంద్రగోళాల్ని అమెరికా ఒకటీ, రష్యా ఒకటీ ఆకాశంలోకి 'షూట్' చేయబోతున్నాయి. ఇలాగ పంపించబడిన ఉపగ్రహం చంద్రుడిలాగానే భూమ్యాకర్షణ శక్తి ప్రభావంచేత భూమి చుట్టూ కొన్నాళ్ళపాటు తిరుగుతూ ఉంటుంది. అందులో అమర్చిన పరికరాల మూలంగా భూమిమీద వివిధ కేంద్రాల్లో ఉన్న శాస్త్రజ్ఞులు అనేక ముఖ్య విషయాలను కనిపెడతారు. ఏమిటా ముఖ్య విషయాలు?

భూమి సూర్యునిచుట్టూ తిరుగుతోంది.



అసలు చంద్రుడిలాగానే కృత్రిమచంద్రగోళంకూడా స్వయంప్ర[illegible] చంద్రుడిలాగానే కంటికి కనిపిస్తూ ఉంటుంది. అయితే చీక[illegible] రాత్రిపూటే దాన్ని చూడగలం. ఎక్కడ కనిపిస్తుందీ, ఎప్పుడు మార్గంమీద ఆధారప

# తరిక్ష యాత్ర



## ళాల ప్రయోగం

భూమి ఉపరితలంమీద కొంత దూరం దాకా గాలి ఉంది. ఈ గాలిని భూమి తన ఆకర్షణ శక్తిచేత తనచుట్టూ బంధించి తనతో పాటే తన చుట్టూ తిప్పుకుంటోంది. ఈ గాలిని దాటి ఇంకా పైకి పోతే శూన్యం ఉన్నది. ఈ శూన్యమార్గంలో భూమీ, గాలీ కలిసి సూర్యుడిచుటూ సూర్యుడికి దూరంగా తిరుగుతున్నాయి. ఇదీ అసలు సంగతి. అయితే దీనివల్ల శాస్త్రజ్ఞులకు బోలెడు విడరాని చిక్కులు కలుగుతున్నాయి.

ఒకటేమిటంటే, ఎందుకో తెలియదుగాని భూమి ఒక పెద్ద అయస్కాంతమైనట్లు ప్రవర్తిస్తోంది. దిక్సూచి యంత్రంలోని ముల్లు ఎప్పుడూ ఉత్తర దక్షిణాలను చూపించడానికి ఇదే కారణం. భూమికి ఈ అయస్కాంత గుణం ఆదినుంచీ ఉన్నది. అంతం దాకా ఉంటుంది కూడాను. అయితే అప్పుడప్పుడు దాని అయస్కాంత శక్తిలో మార్పులు కలుగుతూ ఉంటాయి. ఎందువల్లనో అనేది శాస్త్రజ్ఞులకింకా తెలియలేదు. గాలిలోకి బాగా ఎత్తుగా చొచ్చుకుపోయినప్పుడు అక్కడ భూమి అయస్కాంత శక్తి ఏ మాత్రం ఉంటుందో, ఆ శక్తిలో మార్పులు ఎంతవరకూ, ఎందువల్ల



రోజుకి 16 సార్లు భూమిచుట్టూ తిరిగిరాగల కృత్రిమ చంద్ర గోళాన్ని అమెరికన్ శాస్త్రజ్ఞులు అంతరిక్షంలోకి పంపించనున్నారు. ఆ గోళానికి నమూనా.

సంభవిస్తున్నాయో ఈ సంవత్సరం తెలుసుకోవలసిన వాటిల్లో ముఖ్యమైనవి.

శాస్త్రజ్ఞులు ఇదివరకే బెలూన్లు పంపించీ రాకెట్లు పంపించీకొన్ని పరిశోధనలు చేశారు. అయితే ఇవన్నీ భూమికి దగ్గర్లో కొద్ది మైళ్ళలో ఉండే వాతావరణంలోనే జరిగాయి. ఇంకా పైకి, కొన్ని వందల మైళ్ళుపోతేవాతావరణ సాంద్రత ఎలాఉంటుందీ, శీతోష్ణస్థితి ఎలాఉంటుందీ అనేవి కనుక్కోవాలంటే ఉపగ్రహ యంత్రాన్ని పైకి పంపించి కనుక్కోవాల్సిందే.

భూమి వాతావరణానికీ, సూర్యుడికీ మధ్య గాలీ వగైరా లేకపోయినప్పటికీ కేవలం శూన్యం ఉందని అనుకోవడం తప్పు. సూర్యుడి వేడి, వెలుతురుమాత్రమే రావడం లేదు. సూర్యుడిలోంచి లోపల ప్రతిక్షణమూ అణువులు విచ్ఛిన్నమవుతున్నాయి. విచ్ఛిన్నమైన అణువులతాలూకుఎలక్ట్రాన్లు, న్యూక్లియన్‌లు (అణుకేంద్రాలు), బహుశా ఇతర అణుభాగాలు నిరంతరం ప్రవాహంగా చుట్టూఉన్న ఆకాశంలోకి చొచ్చుకుపోతూటాయి. ఇలా చొచ్చుకుపోతున్న అణుభాగాలు భూమివాతావరణంలోకి ప్రవేశిస్తూ ఉంటాయి. మన భూమిమీద గాలిపాటులోకూడా మార్పులు తీసుకు రాగలిగినంత శక్తివంతమైనవి ఈ అణుభాగాలు. అందుచేత భూమి వాతావరణానికి సూర్యుడికీ మధ్య శూన్యంలా కనబడే స్థలంలో ఈ అణుభాగాలు నిండి ఉంటాయని మనం ఊహించవచ్చును.

ఇదే మాదిరిగా సూర్యగోళం, దానితాలూకు గ్రహాలు, మొత్తం, ఈ సూర్యకుటుంబం యావత్తూ భ్రమణం చేస్తున్న స్థలంకూడా శూన్యంలాగా కనిపించినా, నిజంగా శూన్యం కాదు. అక్కడకూడా నిరంతరం ఏవేవో అణు భాగాలు అతివేగంగా సంభ్రమిస్తూనే ఉన్నాయి. ఇవి భూమి మీదున్న వాతావరణపు తెరల్ని కూడా ఛేదించుకుని భూమిని తాకుతూ



కాశమానమైంది కాదుగాని, సూర్యకాంతి పడడంచేత నక్షత్రంలాగా మినుకుమినుకు మంటూ ఉంటుంది. కనిపిస్తుందీ, ఎన్నిసార్లు కనిపిస్తుందనేది ఆగోళం తిరిగే డి ఉంటుంది.



కృత్రిమ చంద్రగోళం పోయేమార్గాన్ని కనిపెట్టే కెమెరా స్టేషను ఎలా ఉంటేదీ పై బొమ్మ చూపిస్తుంది. ముందరిభాగంలో మధ్యగా ఉన్నది కెమెరా. దీన్ని బేకర్ – నూన్ కెమెరా అంటారు. వెనకభాగాన ఉన్నది ఆఫీసు, విద్యుత్ సరఫరాకేంద్రం. కుడివైపున పైన ఉన్నది రేడియో ఏరియల్. ఇటువంటి కెమెరాస్టేషన్లను పన్నెండింటిని ప్రపంచంలో వివిధస్థలాల్లో ఏర్పరచాలని స్మిత్ సోనియన్ ఆస్ట్రోఫిజికల్ పరిశోధనాలయం నిశ్చయించింది.

# కృత్రిమ చంద్రగోళాల ప్రయోగం

ఉంటాయి. ఇవి చాలా శక్తివంతమైనవి. వాతావరణంలో పైకి పోతున్న కొద్దీ ఇవి దట్టంగా, శక్తివంతంగా కనిపిస్తున్నాయి. అందుచేత ఇవి ఎక్కడో బయటినుంచే బయలుదేరివస్తున్నట్లూ స్పష్టమైంది. అయితే నక్షత్రాలనుంచి, సూర్యుడినుంచీ కాదనీ, ఇంకా బయటినుంచేనని తేలింది. అందుచేతనే వీటిని "విశ్వకిరణాలు" అనేపేరుతో పిలుస్తున్నారు. వీటిలో ప్రోటాన్లనుంచీ, బరువైన అణువుల న్యూక్లియస్‌ల దాకా అన్నిరకాలఅణుభాగాలూ ఉంటాయి. బాగా శక్తివంతమైనవైతే భూ వాతావరణాన్ని ఛేదించుకునివస్తాయి. కొంచెంబలహీనమైనవి అక్కడే ఆగిపోతాయి. మామూలు కాంతి కిరణాలు లోహాలగుండా ప్రసరించలేవు. ఎక్స్ కిరణాలు కొద్ది మిల్లిమీటర్ల దళసరి సీసంగుండా ప్రసరించగలవు. కాని ఈ విశ్వకిరణాలు అతి శక్తివంతమైనవి కావడంచేత కొన్ని గజాల మందం ఉన్న సీసంగుండా దూసుకుపోగలవు. అందుచేతనే ఈ కిరణాలకు నాశనం లేదని అంటారు. ఈ కిరణాలు నేల మట్టాన్ని తాకినప్పుడు ఒక ఘనపుటంగుళం గాలిలో ప్రతి సెకండుకీ కనీసం పది అణువులైనా ఛేదిస్తాయట. ఈ లెక్కప్రకారం ఇవి మన శరీరాల్ని తాకినప్పుడు ప్రతి సెకండుకీ లక్షలాది అణువుల్ని బద్దలు చేస్తూనే ఉండిఉండాలి. ఇలాగ మన శరీరాణువుల్ని బద్దలు చేయడంవలన మన శరీరతత్వాల్లో ఏమేమి మార్పులు కలుగుతున్నాయో చెప్పలేం.

ఈ విశ్వకిరణాల్ని, వాటి శక్తిని కొలిచి కనుక్కోవాలంటే భూమికి బాగా పైకి పోయి కనుక్కోవాల్సి ఉంటుంది. అక్కడ పరిశోధనలు చేస్తేగాని, అసలివి ఎక్కణ్ణించి బయలుదేరి వస్తున్నారో, వాటి గుణం ఎలాంటిదో, ముందు ముందు చంద్రగోళ ప్రయాణీకులకు వీటివల్ల ఏమి అపాయాలున్నాయో తెలియదు.

సూర్యుడిలోంచి వేడి, వెలుతురే కాకుండా, ఇంకా ఎన్నో ఇతర రకాల కిరణాలు ప్రసరిస్తూ ఉంటాయి. ఎక్స్ కిరణాలు, అల్ట్రా వయొలెట్ కిరణాల దగ్గర్నించీ ఎక్కువ వేవ్ లెంగ్తు కలిగిన కిరణాల దాకా అనేకం ఉంటాయి. తక్కువ వేవ్ లెంగ్తు కలిగిన కిరణాలన్నీ మన చుట్టూ వ్యాపించి ఉన్న వాతావరణాన్ని ఛేదించుకు రావడానికి ప్రయత్నించడంలో, వాతావరణంలో కలిసిపోతాయి. అల్ట్రా వయొలెట్ కిరణాలు భూమి వాతావరణంలో కలిసి పోయినప్పుడూ, విద్యుదణు భాగాలు భూమ్యయస్కాంత మండలంలో పరిభ్రమించేటప్పుడు కొన్ని కొన్ని విచిత్రమైన మార్పులు సంభవిస్తూ ఉంటాయి. అల్ట్రా వయొలెట్ కిరణాలు గాలికణాలను (మాలెక్యూల్స్) ఎలక్ట్రాన్లుగానూ, ధన విద్యుత్తు కలిగిన "అయోన్లు" గానూ ఛేదించివేస్తాయి.

భూమికి దాదాపాక ముప్ఫయ్ మైళ్ళ నుంచి బాగా వాతావరణం పైదాకా ఉన్న స్థలంనిండా ఇలా ఛేదించబడిన ఎలక్ట్రానులు, అయోన్లు ఉంటాయి. అందుచేత ఈ స్థలాన్ని "అయొనోస్ఫియర్" అంటారు. గుండ్రంగా ఉన్న భూమి ఉపరితలంచుట్టూ రేడియో తరంగాలను ప్రసారం చెయ్యడంలో ఈ అయొనోస్ఫియర్ చాలా ప్రముఖపాత్ర వహిస్తుంది. నిజానికి ఈ అయొనోస్ఫియర్ అనేది లేకపోతే బాగా దూరాలకు రేడియో తరంగాలను పంపించడం అసంభవమయ్యేది. అయస్కాంతపు తుఫానులవల్ల రేడియో ప్రసారాలకు వచ్చే ఆటంకాలకు, ధ్రువాలవద్ద కనబడే వింతరంగులకాంతులకు ఈ అయొనోస్ఫియర్ కు ఏదో దగ్గిర సంబంధమే ఉందని శాస్త్రజ్ఞులూహిస్తున్నారు. అందుచేత ఆ అయొనోస్ఫియర్ ప్రాంతంలో తీవ్రంగా పరిశోధనలు చేయడం మనకి చాలా అవసరం.

కృత్రిమ చంద్రగోళంతో ఇవేకాదు, ఇంకా ఎన్నో సమస్యలను ఛేదించవలసి ఉంటుంది. భూమి చుట్టూ ఉన్న స్థలంలోకి వెడితే చాలు ఎన్నో సమస్యలు! భూభౌతిక శాస్త్రజ్ఞులకు, భౌతిక, ఖగోళ, వాతావరణ శాస్త్రజ్ఞులకు, రాకెట్ ఇంజనీర్లకు చేతినిండా, మెదడునిండా పని. ఒక్క కృత్రిమ గోళంలో ఇన్ని పరిశోధనలకు అవసరమైన పరికరాలను అమర్చడం కష్టం. అలాంటి గోళాలెన్నో అవసరమవుతాయి.

ఇక ఈ కృత్రిమ చంద్రగోళాలను ఆకాశంలోకి ఎలా పంపించడమనేది పెద్ద ప్రశ్న.

లోగడనే అమెరికన్ శాస్త్రజ్ఞులు కొన్ని రాకెట్లను దాదాపు 180 మైళ్ళ ఎత్తువరకూ 'షూట్' చేయడం జరిగింది. ఈ రాకెట్ల ద్వారా అనేక అమూల్యశాస్త్ర రహస్యాలు బయట పడ్డాయి. రాకెట్లలోంచి తీసిన ఫోటోల మూలంగా భూమి గోళాకృతి మొదటిసారిగా కళ్లారా చూసినట్లయింది. భూమి బల్లపరుపుగా ఉందనే వారికిదొక గట్టి చరుపు! మరొక రకం రాకెట్ 240 మైళ్ళ ఎత్తుకు గంటకు 5 వేల మైళ్ళ వేగంతో ఎగిరింది. ఇలాంటి రాకెట్లే లేకపోతే కృత్రిమ చంద్రగోళాల్ని ఆకాశంలోకి పంపించే ఆలోచనే అసంభవమై ఉండేది. 200 మైళ్ళ పైకి, 800 మైళ్ళ లోపుకివెళ్లి గంటకు దాదాపు 18000 మైళ్ళ వేగంతో భూమిచుట్టూ తిరగగల కృత్రిమ గోళాన్ని షూట్ చేయడానికి ఈ రాకెట్లే శరణ్యం. ఎందుకంటే భూమ్యాకర్షణ శక్తిని తట్టుకోగలిగినంత వేగంగా కృత్రిమ గోళం పైకిపోవాలి. పైకి పోయిన తర్వాత గాలితాకిడివల్ల దాని వేగం తగ్గి



చంద్రలోకానికి ప్రయాణం ముందుముందు సాధ్యంకావచ్చునని శాస్త్రజ్ఞుల ఊహ. రాకెట్ లో ప్రయాణంచేసే మనిషి ఇలా పడుకుని ఉండాలి. అతనితల ప్రయాణదిశగానే ఉండాలి. రాకెట్ నడిపే మీటలు వగైరా అతని వేళ్లవద్దనే ఉంటాయి. అతని పరిశోధన పరికరాలన్నీ పైన ఉంటాయి.

పోకుండా చూడాలి. ఏమంటే కృత్రిమ గోళం కొంతకాలంపాటు ఒకే వేగంతో పరిభ్రమణం చేయగలిగిఉండాలి. ప్రతి చదరపు అడుగుకూ రెండు పౌనుల బరువు కలిగిన కృత్రిమగోళం నూరు మైళ్ళు మాత్రమే పైకి పోతే భూమి చుట్టూ ఒకసారి కూడా తిరగడం అసంభవమవుతుందని శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. 200 మైళ్ళు పైకి పోతే పదిహేను రోజులపాటు తిరగగలుగుతుంది. 300 మైళ్ళు పైకిపోతే గాలి తాకిడి బాగా స్వల్పంగా ఉంటుంది కనుక ఒక ఏడాదిపాటు భూమి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ ఉండగలదు. అందుచేత కృత్రిమ గోళాన్ని రెండు మూడు వందల మైళ్ళ పైకి షూట్ చెయ్యాలిగాని అంతకు తక్కువకి మాత్రం కాదు.

ఆ గోళం అంత పైకిపోయాక భూమి చుటూ వలయమార్గంలో తిరగాలిగదా? ఎంత వేగంతో కదులుతూ ఉంటే వలయాకారమార్గంలోనే తిరగగలదు? అని మరో ప్రశ్న. సెకండుకు 7 మైళ్ళు లేక గంటకు 25,200 మైళ్ళ వేగంతో గోళాన్ని పైకి పంపిస్తే, అది భూమ్యాకర్షణ శక్తిని దాటి శూన్యంలోకి వెళ్లిపోతుంది. సెకండుకు నాలుగు లేక గంటకు 14,400 మైళ్ళ వేగంతో ఎగిరితే ఒక చుట్టులో సగమైనా కాకుండానే నేల మీద పడిపోతుంది. అందుచేత పూర్తివలయ మార్గంలో చాలాసార్లు తిరిగేట్లు చేయాలంటే గోళాన్ని సెకండుకు 5 మైళ్లు, లేక గంటకు 18,000 మైళ్ల వేగంతోనే షూట్ చెయ్యాలి. అప్పుడేమవుతుందంటే గోళమేమో శూన్యంలోకి పారిపోదామని చూస్తూ ఉంటే, భూమేమో తనకేసి లాక్కోవాలని చూస్తూ ఉంటుంది. ఈ రెండు శక్తులు సమానమై గోళం భూమి చుట్టూగా గిరగిరా తిరుగుతూ ఉంటుంది. అసలు చంద్రుడూ ఇలాగేగదా ఆకాశంలో ఉండగలుగుతున్నాడు!

అమెరికావారు వదిలిపెట్టే కృత్రిమ చంద్రగోళం 95 నిమిషాలలో భూమిని ఒక చుట్టుచుట్టి వస్తుంది. ఆ గోళంనిండా శాస్త్ర పరికరాలు ఉండి, విశ్వకిరణాలు, అల్ట్రావయొలెట్, ఇన్ఫ్రారెడ్ కిరణాలు, మైక్రోమీటియార్లు మొదలైన ఎన్నిటిని గూర్చో సమాచారాన్ని భూమి మీదకి రేడియో ప్రసారం చేసి తెలియజేస్తూ ఉంటాయి.

ఇప్పటి ఆలోచనల ప్రకారం, ఈ కృత్రిమ చంద్రగోళంవల్ల తెలిసే రహస్యాలు భూమిమీద మానవజీవితానికే సహాయం చేస్తాయి. అయితే ఇంకా అమూల్యమైన విశ్వరహస్యాలేవైనా బయటపడి చంద్రగోళానికీ, ఇతరగ్రహాలకీ కూడా ప్రయాణం చేయడానికి అనువైన విషయాలు తెలుస్తాయేమో ఎవరు చెప్పగలరు? అదే జరిగితే గాలి ఆడని చంద్రగోళంలో ఉన్నది కవులు వర్ణించిన లేడిఅయిందీ, పర్వతాలే అయిందీ కళ్లారా చూడవచ్చు. అంగారక గ్రహంలో నిజంగా ప్రాణం ఉన్నదీ లేనిదీ స్వయంగా చూడవచ్చు. శుక్రగ్రహంలో శుక్రుడున్నాడో, లేక కేవలం వాయువులున్నాయో చూడవచ్చు. అలా అనంత విశ్వాంతరాళంలోంచి చూసే మానవుడికి మన భూమి చిన్న నలకలాగ కనిపిస్తుంది.

(56-వ పేజీ చూడండి)

# కలయో! వైష్ణవ మాయయో!

రైలు వేగంగా పోతున్నది. థర్డుక్లాసు కంపార్టుమెంటులో జనం నిండుగా వున్నారు. కేశవరావు సిగరెట్ వెలిగించి, కిటికీలోనుంచి, దాటిపోతున్న టెలిగ్రాఫ్ స్తంభాలవంక చూస్తున్నాడు. దూరంగా చెట్లు పరుగెత్తుతున్నట్లున్నాయ్! తెల్లవారింది కాని, యింకా సూర్యోదయం కాలేదు. పరధ్యానంగా వున్న కేశవరావు "ఏమండోయ్!" అన్న పిలుపుతో వులిక్కిపడ్డాడు.

"ఏమండోయ్! మిమ్మల్నే!" అని పిలిచింది వోక స్త్రీ కంఠం.

కేశవరావు ఖంగారుపడుతూ అటువైపు చూశాడు. ఆవిడ మళ్ళీ అందుకుని "ఏమిటండీ! అలా చూస్తారు. కాజీపేట వస్తున్నట్లుంది! కాస్త కాఫీ, టిఫన్ తెచ్చి పెట్టండి."

కేశవరావుకు ఏమి చెప్పటానికీ తోచక "అలాగే!" అన్నాడు. మొగవాళ్ళు ఆమె వెంట రావడంలేదల్లేవుంది! కాస్త కాఫీ, టిఫిన్ తెచ్చిపెట్టమంది! ఇందులో వింతేముంది! ఆమాత్రం తను సాయం చేస్తే తప్పా!...అయినా, ఆవిడకు అంత స్వతంత్రం యేమిటి! ఆశ్చర్యంగా వుంగే! కాఫీ తెచ్చిపెట్టడానికి తనే దొరికాడా! ఇంకెవరూ లేరూ! అయినా మనకెందుకులే! ఆవిడ నోరు తెరచి అడిగినప్పుడు తెచ్చిపెట్టకపోతే బాగుంటుందా! ఇలా ఆలోచిస్తూ వుండగానే కాజీపేట స్టేషను వచ్చేసింది.

కేశవరావు రైలు దిగాడు ఆవిడ మరచెంబు అందిస్తూ "ఇందులో కాఫీ పోయించుకు రండి" అంది.

డబ్బులిస్తుందేమో ననుకున్నాడు కానీ, ఆవిడ ఏమీ మాట్లాడకపోతే వూరుకున్నాడు. చిల్లరడబ్బులు ఆవిడదగ్గర లేవేమోననుకుని ముందుకు నడిచాడు సరాసరి హోటలుకు వెళ్ళి గబగబా ముఖం కడుక్కుని, కాఫీ, టిఫిన్ కానిచ్చాడు. మరచెంబులో కాఫీ పోయించుకుని, రెండు పూరీలు పొట్లం కట్టించుకుని, మళ్ళీ కంపార్టుమెంటుకు తిరిగి వచ్చాడు.

ఆవిడచేతికిచ్చి సీటులో కూర్చున్నాడు. "మీరు కాఫీ త్రాగారా!" అంది ఆవిడ.

"త్రాగాను" అన్నాడు ముక్తసరిగా.

"మీకళ్ళు చూడండి! చింత నిప్పులలాగా వున్నాయ్! రాత్రి సరిగా నిద్రపట్టలేదల్లే వుంది."

"అవును! పట్టలేదు."

"ఏమిటో! ఈ రైలు ప్రయాణాలు సుఖం లేదండీ! నిద్రకూడా సరిగా పట్టదు. మొన్నరాత్రి కూడా మీకు నిద్రలేదు. నామాట విని, నిద్రవస్తే, కాసేపు ఆ పక్కమీద వెళ్ళి పడుకోండి. నేను వున్నానుగా!" అంది పై బెర్తు చూపిస్తూ.

కేశవరావు ఉక్కిరి బిక్కిరి అయాడు. ఇదేమిటి! ఈ ధోరణి! తనను ఎరుగున్న దానిలాగా మాట్లాడేస్తున్నది!

"అదేమిటండీ! నన్ను నిద్రపొమ్మంటారేమిటి?" అన్నాడు.

"మీకెవ్వరూ చెప్పేది! రాత్రి మీకేమన్నా నిద్రపోయారా! నాకు తెలియదూ! నిద్రపటక నానా అవస్థలూ పడ్డారు. నేను చూస్తూనే ఉన్నాను.

## బి. విద్యాసాగర్

"ఏమిటి, మీ ధోరణి నాకేమీ అర్థంకావటంలేదండి!" అన్నాడు కేశవరావు అయోమయంగా.

"అండీ అంటారేమిటి! రైలులో ఎవరన్నా వింటే నవ్వుతారు. మీ సరసాలకు అంతూపొంతూ లేకుండా పోతున్నది."

"ఇందులో సరసమేమున్నది?"

"సరసం కాకపోతే యేమిటి! భార్యను పట్టుకుని నలుగురిలో "ఏమండీ" అంటే ఎవరన్నా నవ్వరూ!"

"ఇది మరీ బాగుంది! మీరు నాకు భార్య ఏమిటండీ?" అన్నాడు కేశవరావు తికమకపడుతూ.

"నేను కాకపోతే ఎవరు! ఆ సుశీలను తెచ్చుకుని కాపురం చేద్దామనుకుంటున్నారేమో! అది నా గొంతులో ప్రాణంవుండగా జరుగనీయను"

"ఏమిటండీ ఈగోల" గట్టిగా అరిచాడు.

"గోలట! ... నేనేమి గోలచేశానండీ. మిమ్మల్ని కాసేపు విశ్రాంతి తీసుకోమన్నాను. అలా అనడం తప్పా!"

"ఏమిటి! ఈ అర్థం పర్థంలేని వాగుడు!"

"వాగుడుగానే వుంటుంది! నేను మీకు ఏమిచెప్పినా వినరు!.. ఏమి! భార్యమాట వింటే తప్పా?"

"భార్య అంటావేమిటి! ఇదెక్కడి గొడవ" విసుగు ఎక్కువవుతున్నది అతనికి.

"ఏమండోయ్! ఊరికే నోరు పారేసుకోకండి! మీరు 'ఛా!' అన్నంతలో నేను మీ భార్యను కాకపోను! మీకు చెప్పుకోటానికి సిగ్గేమో! నాకు అదేమీ లేదు"

కేశవరావుకు ఏమీ అర్థంకావడంలేదు. అంతా మాయగావుందే! ఈవిడేమిటి తనకు భార్య యేమిటి! ఎంత పోకుగా కథ అల్లేసింది. ఊరుకున్నకొద్దీ మాటలు ఎక్కువచేస్తున్నదే! ఇక వూరుకుంటే లాభంలేదు! గట్టిగా బుద్ధి చెప్పాలని.

"ఏమండోయ్! మీరు నన్ను అనవసరంగా అల్లరిపెడితే! నేను వూరుకోను. ఇందాకటినుంచీ చూస్తున్నాను, ఊరుకున్న కొద్దీ అలుసు ఎక్కువవుతున్నదే! మీరు నాకు భార్య ఏమిటండి! ఎవరన్నా వింటే నవ్విపోతారు," అన్నాడు.

"నవ్వటమెందుకు! చూసి సంతోషిస్తారు. ఈ దంపతు లెవరో చాలా అన్యోన్యంగా వున్నారనుకుంటారు"

"అబ్బబ్బ! ఏమిటీ వాగుడు!" రొప్పుతూ అన్నాడు కేశవరావు.

"అనండి! ఎన్నిమాటలయినా అనండి! నేను ఎప్పుడు మాట్లాడినా మీకు వాగుడుగానే వుంటుంది"

"ఏమండోయ్! మర్యాదగా చెబితే మీకు కాదూ! నన్ను భర్తఅంటే వూరుకోను"

"ఊరుకోక యేమిచేస్తారే! నన్ను వదిలేస్తారా!.. వదిలేయండి చూద్దాం! మీమీద మనోవర్తిదావా వేస్తాను." అంది ఆవిడ ధీమాగా.

"చూడండి సార్! ఈవిడ రాత్రి నాతోపాటు రైలుఎక్కింది. తెల్లవారేటప్పటికి నన్ను 'భర్త' అని చెప్పి నలుగురిముందూ అల్లరిపెడ్తున్నది. ఇదేమయినా సబబుగా వుందేమో మీరు చెప్పండి." అన్నాడు కేశవరావు జనంవంకకు తిరిగి, ప్రాధేయపడుతున్నట్లు.

"వాళ్ళనడుగుతా రేమిటండీ! భార్యాభర్తలము తెల్లవారిలేస్తే ఎన్నో అనుకుంటాము. ఇవన్నీ పరాయివాళ్ళకు చెబితే ఎలా!"

కేశవరావుపరిస్థితి అంతకంతకు అయోమయంలో పడుతున్నది. తను ఏమిచెప్పినా

ఈ జనం నమ్మేటట్లు లేరు. అయినా ఎలా గయినా ఈ "వల"లో నుంచి బయటపడా లని.

"చూడండి! ఆవిడ ధోరణి! ఇందాకటి నుంచీ చూస్తున్నాను. నన్ను భర్త అని చెప్పి, మీ అందరిముందరా పట్టుకు నన్ను ఆడిస్తున్నది. మీరు చూస్తూ వూరుకుంటా రేమిటండీ—ఆవిడకు బుద్ధి చెప్పక! ఏదో ప్రొద్దున కాఫీ తెచ్చిపెట్టమంటే, దయ తలచి తెచ్చిపెడితే నిముషంలో ఎంత కథ అల్లేసింది." అన్నాడు కొస్త బిగరగానే.

"నాకేమీ కథలు అల్లటం చేతకాదు! మీరే నన్ను పట్టుకు ఆడిస్తున్నారు. ఈ రైలులో అందరిముందరా పట్టుకుని, నన్ను నానామాటలూ అంటే ఎవరు సహిస్తారండీ" అంది ఆవిడ కంట తడిపెడుతూ.

"ఊరుకో అమ్మా! ఆయన మాటలకేమి! కాసేపు నిన్ను ఆడిస్తాడు. తర్వాత నవ్వుతూ మళ్ళీ మామూలుగానే వుంటాడు" అన్నాడొక ముసలాయన.

కేశవరావు వుక్కిరిబిక్కిరి అయాడు. పరిస్థితి మరీ విషమిస్తున్నది. ఇక వూరుకుంటే ఈ జనం అంతా తను ఆమె భర్తని నమ్మేస్తారు. అందుకని,

"ఏమిటండీ! ఆవిడకు మీరు కూడా తాళం వేస్తారు. మేము భార్యాభర్తలము కాదండీ స్వామీ! ఆవిడెవరో నేను ఎరుగను"

"ఎరగనంటా వేమిటయ్యా! ఆవిడ నీ భార్య కాదు!"

"మీకు ఏమన్నా మతిపోతున్నదా యేమిటి" కొస్త కోపంగానే అన్నాడు కేశవరావు.

"మతి ఎవరికీ పోలేదు కాని, మీరు వూరుకోండి. మీరు కాదన్నంతలో నేను మీకు భార్య కాకపోలేదు! మీరు నా భర్త కాకపోలేదు" అంది ఆవిడ సిగ్గువిడిచి.

"అసలు ఈ గోలంతా ఏమిటమ్మా!" అంది వొకయిల్లాలు.

"ఏమీ లేదండీ! ఆయన ఈమధ్య సరిగా వుండటం లేదు. ఎందుకనో, ఎప్పుడూ నా మీద చిరాకుపడుతూ వుంటారు. ఏదైనా సినిమాకి తీసుకు వెళ్ళమంటె తీసుకు వెళ్ళరు. ఆయనకు నన్ను వెంట తీసుకు వెళ్ళటం నామోషీ కాబోలు! నేను కొస్త చాదస్తురాలుగా ఆయనకళ్ళకు కనపడతానో యేమిటో! అయినా తెలియక అడుగుతాను పిన్నిగారూ! భార్యాభర్తలు సినిమాకి కలిసి వెళ్తే తప్పా!"

"తప్పేముందమ్మా యిందులో!"

"అలాంటప్పుడు ఆయనకు నామీద కోపమెందుకు? ఏమి! నేనుమాత్రం సినిమాలు చూడకూడదా!...అదేమంటే ఆయనకు నిముషాలమీద కోపంవస్తుంది."

# "కలయో వైష్ణవ మాయయో!"

"చూడండి! నన్ను పట్టుకుని ఎలాంటి మాటలు అంటున్నదో! నేను ఆమెకు భర్తనంటుంది! ఇదెక్కడి ఖర్మ! నాకు అసలు పెళ్ళే కాలేదండీ స్వామీ" అసహనంతో హైరానపడుతూ అన్నాడు కేశవరావు.

"చూడండి, పిన్నిగారూ! ఆయనకు పెళ్ళేకాలేదంటున్నారు. ఇంతకన్నా వింత మరొకటి వుంటుందా!"

"అసలు ఎందుకొచ్చిందమ్మా ఈగొడవ" అన్నాడు ముసలాయన కుతూహలంతో.

"నేనంటే ఆయనకు మొదటినుంచీ యిష్టంలేదండీ! ఏదో కట్నం ఆశచూసి నన్ను చేసుకున్నారుకాని.."

"ఇంతకంటే మరో అన్యాయం వుంటుందా! నాకు అసలు పెళ్ళే కాలేదండీ!" కోపం ఎక్కువవుతున్న దతనికి.

"ఊరుకోవయ్యా! ఎవరన్నా వింటే నమ్మేటట్లు వుండాలి. ఆవిడను ఈ రైలులో వదిలిపెట్టి పోదామనుకున్నావా! ఎంత కోపం వస్తేమటుకు నువ్వు నా భార్యవు కాదంటే ఆవిడ మనస్సు నొచ్చుకోదూ! సరసానికయినా వొక అంతూ పొంతూ వుండాలి."

"ఇది మరీ బాగున్నది. మీకుకూడా పట్టిందేమిటి ఈ పిచ్చి! ఈ విడను నేను అసలు ఎరగనండీ! ఇద్దరమూ బెజవాడలో ఎక్కాము. అంతే! ఆవిడెవరో, నేనెవరో!"

"చూడండి! నన్ను ఎంతెంత మాటలంటున్నారో! నన్ను ఎరగరట! ఇన్నాళ్లు నాతో సంసారం చేసిందెవరో! ఆయన కింత గడ్డిపెట్టండి బుద్ధివస్తుందేమో!" అంది ఆవిడ రొప్పుతూ.

"ఊరుకో అమ్మా! ఆయ నెక్కడికి పోతాడు" అని ముసలాయన కేశవరావు వంకకుతిరిగి "అబ్బాయ్! నీ ధోరణి నాకేమీ బాగోలేదు...అమ్మాయిని విడిచి ఎక్కడికి పోదామనుకున్నావయ్యా!"

కేశవరావు పరిస్థితి, మరీ అయోమయంలో పడింది. ఇప్పుడు ఏమి చెప్పినా ఈ జనం నమ్మరు. అందుకని తొందరగా యింకో పెట్టెలోకి మారుదామని పరుపుచుట్ట చుట్టేశాడు. అతని హడావుడి చూసి.

"చూడండి! ఆయన నన్ను వదిలిపెట్టి పారిపోదామనుకుంటున్నారు! పట్టుకోండి స్వామీ! మీకు పుణ్యం వుంటుంది"

"ఆయ నెక్కడికి పోతాడమ్మా! నీకేమీ భయంలేదు" అంటూ కేశవరావు చెయ్యి పుచ్చుకుని వొక యువకుడు, సీటులో కూచోపెట్టాడు.

"ఏమయ్యా! భార్యను వదిలేసి పారిపోదామనుకున్నావా!" అన్నాడొకాయన హేళనగా.

"భార్య అంటా రేమిటండీ! మీరుకూడా ఆవిడ మాటలు నమ్మితే ఎలా! ..నా మాటలు నమ్మండి, నమ్మకపోండి! ఆవిడెవరో నాకు తెలియదండీ! ప్రమాణంచేసి చెపుతున్నాను" అని కేశవరావు చెయ్యి తలమీద పెట్టుకున్నాడు.

"ఈ ప్రమాణాల కేమి వచ్చెకానీ, మాట్లాడకుండా కూర్చోవయ్యా!" అన్నాడు ముసలాయన.

కేశవరావు కోపంతో క్రుంగిపోతున్నాడు తను ఎంత మొత్తుకున్నా ఈ జనం నమ్మేటట్లు లేరు "భగవంతుడా! ఏమిటీపరీక్ష!" అని మనస్సులోనే విసుక్కున్నాడు. 'కలయో, వైష్ణవమాయయో' అన్నట్లు ఈ విడదంతా మాయగా వుంది మాయ యేమిటి? ఇంద్రజాల మహేంద్రజాలంగా వుంటే— ఈవిడెవరోకానీ చాలా తెలివికలదిలాగా వున్నది. మంచి 'ప్లానే' వేసింది. ఇలా అనుకుంటూ వుండగానే, ఆవిడ కొత్త సముదాయించే ధోరణిలో

"ఏమండోయ్! నాంపల్లి వస్తున్నట్లుంది. మీరు మీ అన్నయ్యగారింటికి పోతారేమో! నేను సికింద్రాబాదులో దిగుతాను. మా చెల్లెలు వాళ్ళింటికి వెళ్ళి సాయంత్రానికి అక్కడికి వస్తాను. మళ్ళీ వీలు పడుతుందో, లేదో!.. ఖర్చులకు కొద్దిగా డబ్బు కావాలి. పర్సు తీసి యివ్వరూ" అంది ప్రేమంతా వొలకపోస్తూ.

"ఏమమ్మాయ్! ఊరుకున్నకొద్దీ నీకు అలుసు ఎక్కువవుతున్నదే! నలుగురిలోనూ, నన్ను అల్లరిపాలు చేసిందికాక, యింకా పైగా నీకు డబ్బులు కూడా కావాలీ!" అన్నాడు కేశవరావు ఘాటుగా.

"అబ్బ! వూరుకోండి! మీ కింకా నాపై కోపం పోలేదా యేమిటి! నా మాట వినండి! ...సాయంత్రానికల్లా వచ్చేస్తానుగా! ఊహూ! యివ్వండి" అంది చంటిపిల్ల ధోరణిలో.

కేశవరావుకు ఏమిచేయటానికీ తోచలేదు, ఎలాగయినా ఈ గోల వదిలించుకోవాలని,

"మహాతల్లీ! ఈ రూపాయి తీసుకుని నన్ను కటాక్షించు! ఇకనన్నా నన్ను వదిలిపెడితే, నీకు పుణ్యం వుంటుంది" అన్నాడు పర్సు తెరుస్తూ.

ఇంతలోనే టికెట్ కలెక్టరు ఆపెట్టెలోకి ఎక్కాడు. ఆయనను చూడగానే ఆమెమనిషి ముఖం నిలపడ్డది

"ఏమమ్మా తల్లీ! మళ్ళీ యిక్కడ ప్రత్యక్షమయావు!.. టికెట్ వుందా!" అన్నాడు టికెట్ కలెక్టరు.

లేదన్నట్లు అడ్డంగా తల త్రిప్పింది ఆవిడ ముఖంలో నెత్తురుచుక్క లేదు. "సరిగ్గా సమయానికి వచ్చాడు! వెధవ చచ్చినాడు" అని మనస్సులోనే విసుక్కుంది.

"నాకు తెలుసు! నీ దగర టికట్ ఎందుకు వుంటుంది!. ఊ! మళ్ళీ ఏమాత్రం కొట్టేశావేమిటి" అన్నాడు చిరునవ్వుతో.

"ఏమిటండీ! ఈ మనిషి మీకు తెలుసునా యేమిటి" అన్నాడు కేశవరావు ఆశ్చర్యంగా.

"తెలియకపోవడ మేమిటి! ఈవిడకు యిదేవృత్తి. మొన్న సెకండ్ క్లాసు కంపార్టుమెంటులో ఎవరినో బెదిరించి డబ్బు కాజేసింది. ఆయన వొకటే గోల."

"ఏమిటండీ! అంతా మాయగా వుందే!"

"ఇందులో మాయ ఏమున్నది ఆవిడ ఈ మధ్య యిలాంటిది ఒకటి రెండుసార్లు చేసింది. ఆడదని వూరుకుంటుంటే అలుసు ఎక్కువవుతున్నది. ఇంతకీ, మీకు ఏమాత్రం వదిలిందేమిటి" నవ్వుతూ అన్నాడు టికెట్ కలెక్టరు.

"ఏమీ వదలలేదు కాని, ప్రొద్దుటినుంచీ, నన్ను గడగడలాడించేసింది."

"పైగా అతను, తన భర్త అని చెప్పిందండీ!" అన్నాడు ముసలాయన.

"ఎందుకు చెప్పదు! ఆవిడకు యిలాంటివి మామూలే!" అన్నాడు.

ఇంతలో రైలు సికింద్రాబాదు స్టేషనులో ఆగింది. పోలీసులను పిలిచి, టికెట్ కలెక్టరు, ఆవిడను దింపేశాడు.

"హమ్మయ్య" అని కేశవరావు గాలి పీల్చాడు! గంటసేపు దాకా "ఆవిడ" విషయమే మాట్లాడుతున్నారు ప్రయాణీకులు.

★

# వనితా లోకం

మన స్త్రీలలో సాధారణంగా ఉండే పెద్దలోపం అతి మిక్కిలిగా మాట్లాడటం...అనవసర విషయాలను గురించి చర్చించడం. ఆ చర్చవల్ల తమకు ఏమాత్రం లాభం లేకపోయినా సరే! అందులో ఏదో అవ్యక్తమయిన సంతృప్తి ఉంటుం దనుకొంటాను. ఒకొక్కప్పుడు అట్టి అనవసర ప్రసంగాలవల్ల పైవాళ్లకు, కొన్ని సమయాలలో తమకే ఎంత హాని కలుగుతుందో కొంచెమైనా ఆలోచిస్తే ఈ దురలవాటును దిద్దుకోడానికి అవకాశం కలుగుతుంది. కాని ఆ విధముగా ఆలోచించుకోవాలన్న ఆలోచనే కలిగి అంతపనీ చేస్తే ఇంక అప్రస్తుతపు ప్రసంగంలో పాల్గొనరనే చెప్పాలి. పై నుదహరించిన లోపానికి కారణం ముఖ్యంగా తగిన విద్య, సరియైన పెంపకం, (సదసద్వివేచక్షణ) లేక పోవడమే.

సర్వ సాధారణంగా నలుగురు ఆడవాళ్లు కలుస్తే "మీ యింట్లో యివాళ ఏమిటి వంట కాలు" అన్న ప్రశ్న మొదట వెలువడుతుంది. ఈ ప్రశ్న వేసిన యిల్లాలు కొంచెమయినా ఆలోచించదు తన ప్రశ్నకు సమాధానం యివ్వడానికి పొరుగింటి ఆమె ఎంత కించపడ్డదీ.. సాధారణంగా ఇటువంటి ప్రశ్నకు అబద్ధపు జవాబు చెప్పడం కష్టం. నిజం చెబితే చిన్నతనం. ఎందుకంటే కూర లేదనికాని పప్పు లేదనికాని చెప్పకోవడం తమ ఆర్థికదుస్థితిని తెలియజేయటం. .ఉన్నమాటైనా చెప్పడానికి కొందరు మనస్సులో బాధ పడతారు. నిజంగా మనస్త్రీలలో తమ భర్తలకుమల్లే కృత్రిమ గౌరవము ఇంకా అలవాటు కాలేదు. చటుక్కున అనేస్తారు. "ఏముందీ...ఏదో చారూ.. పచ్చడీ" అని. మరొకామె అడక్కుండానే తన సిరిసంపదలను తెలియజేస్తూ పదివంటకాలను పేర్కొంటుంది.

ఎవరింట్లో ఏమి వండుకున్నదీ తమకు తెలియకపోతే వచ్చే నష్టం ఏమిటి అన్న ఆలోచన ఒకరికి తోచదు. లోకాభిరామాయణంలో ఇది మొదటి అధ్యాయం.

తర్వాతది నగల సంగతి. మనస్త్రీలకి నగలంటే అదొక వ్యామోహం. ఒకపూట పస్తుండి డబ్బు మిగిల్చి వాచీగొలుసో, గాజులో చేయించుకున్న యిల్లాళ్లున్నారు. నగలు చేయించుకోడం చెడ్డ అని నా ఉద్దేశం కాదు. స్త్రీకి సంఘంలో ఒక ప్రత్యేక స్థానం నగలవల్ల కలుగుతుందని దురభిప్రాయపడే స్త్రీలు లేకపోలేదు. విజ్ఞానార్జనవల్ల సంఘంలో సంపాదించగలిగే స్థానం ముందు నగలిచ్చే గౌరవం సూర్యుని ముందు దివిటీ అని తెలుసుకోనక పోవటమే దీనికి కారణం.

మూడవ ప్రశ్న తమతో సంభాషణలో పాల్గొనని వ్యక్తుల మంచిచెడ్డల గురించి. సాధారణంగా మంచి కనబడదు. కనపడినా దాన్ని గురించి మాట్లాడ్డంలో ఉత్సాహం కనపర్చరు. ఇంక చెడ్డ అంటారా ఎంత మాటాడినా తనివితీరదు. ఫలానా ఆవిడ ఫలానాలాగా దువ్వించని (ఎలాగ దువ్వితే తమకేం) లేదా వయస్సుకితగని కేశాలంకరణ చేసిందని—అంటే ఆడవాళ్ల ఉద్దేశంలో స్త్రీకి ముప్పయి ఏళ్ళు దాటితే ముఖ్యంగా నలుగురైదుగురు పిల్లలుంటే అలంకరణ అనవసరం. సంసారభారం యీడుస్తూ సగం క్రుంగిపోయినట్టు కనపడాలి!

ఇంక కొందరు విపరీత వ్యక్తులున్నారు. ఒకామె పొరుగింటామెను పని ఉన్నట్టు పిలిచి "మీవారు యివాళ ఆఫీసుకి ఎందుకు వెళ్ళలేదని అడుగుతుంది. దీనికి ఏమని సమాధానం యివ్వాలి? లేదా......మీరు కొన్న కొత్త ఆల్మయిరా ఖరీదెంత అని. అంతటితో ఊరుకుంటే బాగుంటుందా! ఎందుకంత దండగ పెట్టి కొన్నారు..... బదిలీ అయే ఉద్యోగాలు కద.. . తీసికెళ్ళడం ఎంత యిబ్బంది..... ఈక్షణం బదిలీ అయిపోయినట్టు...ఇంక ఆల్మయిరా సమస్య ఎలాగా అని తను బాధపడుతూన్నట్టు...ఇటు వంటి అసందర్భపు ..అప్రస్తుత సంభాషణల వల్ల అమూల్యమయిన సమయం వ్యర్థంకావడం తప్ప వేరొకటిలేదు.

కొంతమంది యిల్లాళ్లు పైవిధంగా సంభాషణచేస్తూ ఇంటి గుట్టునికూడ బైటపెట్టడానికి సందేహించరు. తమ భర్తల లోపాల గురించి...పిల్లల దౌర్జన్యం గురించి...అన్నదమ్ముల అనాదరణ గురించి...వదినెగార్ల పొగరు బోదుతనం గురించి! సరే ఇంక సమిష్టికుటుంబాల్లో నయితేనా కథా వస్తువుకి కొరతలేదు. తోటికోడళ్ళ చెడ్డలు అత్తగారు పెడుతూన్న బాధలు యిత్యాది...

అప్రస్తుత ప్రసంగాన్నే అధిక ప్రసంగం అని అనవచ్చు.. ఇది మేలుచేయదు సరికదా కీడు మాత్రం కొన్ని సమయాల్లో చేస్తుంది. అత్యవసరమైన విషయాల గురించి క్లుప్తంగా మాట్లాడటం ఏనాడైతే మన స్త్రీలు నేర్చుకుంటారో ఆనాడు మనలో నిజమైన పరివర్తన కలిగిందని నమ్మాలి. ★

## కాళిదాసు కావ్యాలు:

# కన్యాధర్మ నిరూపణం

**పోతరాజు లలిత**

కవిచక్రవర్తి కాళిదాసుపేరు విననివారూ, ఆయన వ్రాసిన కావ్యములను కొద్దిగనో గొప్పగనో చదువనివారూ అరుదు. ఆయన కావ్యములలోని విశిష్టత - ప్రతి ఒక్క కావ్యము యేదో ఒక ధర్మాన్ని నిరూపిస్తుంది. ఆ ధర్మాన్ని ఆచరించి తీరవలసినదే అని, మృదువుగా శాసిస్తుంది. ఆచరించనందువల్ల కలిగే కష్టనష్టాలను వివరిస్తుంది. కాళిదాసు మొదటి కావ్యమైన రఘువంశములో రాజధర్మాన్ని చక్కగా వివరించాడు. అందు నాయికలందరు గృహిణులే. రెండవదియగు కుమారసంభవములోని నాయిక పార్వతి కొంతవరకు తలిదండ్రులచాటు కన్యగాను తరువాత గృహిణిగాను మనకు సాక్షాత్కరిస్తుంది.

ఇక మేఘసందేశ కావ్యములో నాయిక విరహిణి. కాళిదాసు వ్రాసిన నాటకములలో మొదటిదైన శాకుంతలములో నాయిక శకుంతల మొదట ఋషికన్య. తరువాత భర్తృపరిత్యక్త. కథాంతమునగాని నాయకీనాయకులకు పునస్సమాగమము కలుగదు. ఇక మాళవికాగ్నిమిత్రములో నాయిక మాళవి కన్యయే యైనను ఇంచుమించు స్వతంత్రురాలు. విక్రమోర్వశీయములోని నాయిక ఊర్వశి దేవవేశ్య.

మొత్తముమీద ఆయన వ్రాసిన ఆరు గ్రంథములలోని నాయికలలో పెద్దల చాటు కన్యలు ఇద్దరే కన్పిస్తారు. కుమార సంభవములోని పార్వతి శాకుంతలములోని శకుంతల. ఆమెద్వారా ఉత్తమ కన్యాధర్మాన్ని, ఈమె ద్వారా ఆ ధర్మాన్ని సమముగా నిర్వర్తించనందువల్ల కలిగే కష్టనష్టాలనూ తెలిపినాడు కవి. వీరిరువురిద్వారా కవి ఇచ్చిన సందేశమేమిటో పార్వతి కన్యాధర్మాన్ని యేవిధముగా పాలించిందో, శకుంతల యే విధముగా పాలించలేకపోయిందో గమనిద్దాము.

## పార్వతి

కుమార సంభవములోని పార్వతి, తల్లిదండ్రులచాటు కన్య. ఆమెను తండ్రి పరమేశ్వరునివద్ద పరిచర్యకు నియోగిస్తాడు. ఆమెకూడా శ్రద్ధగా పరిచర్యచేస్తూ మనస్సులో పరమశివునే పతిగా వరిస్తుంది. తరువాత మన్మథుడు శివుని తపోభంగమునకు ప్రయత్నించటమూ, ఈశ్వరఫాల నేత్రాగ్నిచే దగ్ధమవటము జరిగినది. తపస్సుచేతనే తప్ప ఇక యేవిధముగాను శివుని అనుగ్రహాన్ని పొందలేనని నిశ్చయించుకున్న పార్వతి తల్లితండ్రులవద్ద యెట్టకేలకు అనుమతి సంపాదించి తపోవనానికి వెళ్తుంది. ఆమెకు తోడుగా జయ, విజయ అనే చెలికత్తెలు కూడా వెళ్తారు.

పరమ సుకుమారియైనప్పటికీ పార్వతి తపోనియమాలను అతిశ్రద్ధగా పాలిస్తుంది. జటావల్కల ధారిణియై, *స్థండిలశాయినియై ఆకు అలములనైనా భక్షించక ఆమె చేసిన కఠోర తపస్సునకు మహర్షులుసైతము ఆశ్చర్యచకితులై 'అపర్ణ' అని ఆమెను పిలుస్తారు. ఇలా కొంతకాలము గడచినతర్వాత ఒక తరుణ బ్రహ్మచారి పార్వతి ఆశ్రమానికి అతిథియై వస్తాడు.

శివునియందే మనస్సును లగ్నముజేసి తదేక ధ్యాన నిష్ఠలో నున్నప్పటికీ, పార్వతి ఆ అతిథిని గౌరవిస్తుంది. కుశల ప్రశ్నానంతరము పార్వతి తపో కారణాన్ని జయ, విజయల ద్వారా తెలుసుకున్న బ్రహ్మచారి, కలకలనవ్వి, పరమ సుకుమారివైన నీకు, పరీత నిలయుడైన శివుడు తప్ప పతిగా వరించుటకు యెవ్వరు దొరకలేదా? అని ఆక్షేపిస్తాడు.

పరిహాసముకైనను పరమేశ్వరనింద విననోపని పార్వతి కుపితయై అక్కడనుండి వెడలిపోబోతుంది. కాని ఆశ్చర్యము. ఆ బ్రహ్మచారి చూస్తూ వుండగానే పరమశివునిగా మారి ఆమెను అడ్డగించి "ఓ పార్వతీ! ఈ నాటినుండి, నేను నీకు దాసుడను. నీ తపో మహిమచే నన్ను నీవశం చేసుకో గలిగినావు. కోపముమాని అనుగ్రహించు" అని చేయిపట్టుకోబోతాడు. చిరతపః ఫలముగా సాక్షాత్కరించిన పరమేశ్వరుని గాంచి సంభ్రమాశ్చర్యానందములతో పరవశయై లజ్జావనత శిరస్కయౌతుంది పార్వతి.

కాని కన్యాధర్మాన్నిమాత్రము విస్మరింపదు. తల్లి తండ్రులచాటు కన్య తాను. వారి అనుమతి లేకుండా ఎలా స్వతంత్రిస్తుంది. ఆ కారణముచేతనే పాణిగ్రహణార్థమై చేయి జాపిన పరమేశ్వరుని కోరికను మన్నించలేకపోతుంది పార్వతి ఆ సమయమున జయద్వారా పార్వతి ఇచ్చిన సమా

* వ్రతము పూనినవారు విశ్రమించడానికై దర్భలతో శుద్ధిచేసిన ప్రదేశము.

దానము చూడండి యెంత ఉదాత్తరమణీయముగా వుందో!

"ప్రభూ! మా హిమవన్నగాధిరాజునకు కన్యాదానముచేసే భాగ్యాన్ని అనుగ్రహించండి" అని అర్థిస్తుంది జయ. సరేనని అంతర్ధాన మౌతాడు పరమశివుడు. ఆ తరువాత సప్తర్షులను అరుంధతిని హిమవంతునివద్దకు రాయబారము పంపిస్తాడు పరమేశ్వరుడు. హిమవంతుని అంగీకారముతో సకల దేవతా సమక్షాన పార్వతీ పరమేశ్వరులకు యథావిధిగా వివాహము జరుగుతుంది. కన్యాధర్మాన్ని సక్రమముగా నిర్వర్తించిన పార్వతి ఆతరువాత శంకరార్ధాంగ హారిణియే కాక, జగదేకవంద్యురాలవుతుంది.

## శకుంతల

ఇక శాకుంతలములోని శకుంతల మేనకా విశ్వామిత్రుల పుత్రిక. తల్లి తండ్రులచే పరిత్యజింపబడిన శకుంతలను కణ్వమహర్షి శైశవమునుంచి పెంచి పెద్దజేసినాడు. శాకుంతలములోని ప్రథమాంకములో వేటకై వచ్చిన దుష్యంతునితో మునికుమారులు చెప్పిన మాటలివి "రాజా! కణ్వమహర్షి ఆశ్రమంలో లేరు. కాని మహర్షి ఆజ్ఞానుసారముగా వారి కుమార్తెయగు శకుంతల అతిథులను సత్కరించుటకు ఆశ్రమములోనున్నది."

ఈ మాటలు విని దుష్యంతుడు ఆశ్రమములో ప్రవేశిస్తాడు. అక్కడ శకుంతలను జూచి మోహిస్తాడు. శకుంతల కూడా అతనిని ప్రథమవీక్షణములోనే ప్రేమిస్తుంది. ఋషి కన్యయగు ఆమెను మోహించుట అనుచితమని మధనపడుచున్న రాజు ఆమె, మేనకా విశ్వామిత్రుల తనయయని తెలియగానే సంతోషిస్తాడు. ఇందులో అతని ధర్మతత్పరత వెల్లడియౌతుంది మనకు. శకుంతల విరహాన్ని చూడలేని సఖులు వారల సమాగమానికి అవకాశము కల్పిస్తారు. దుష్యంతుడు అన్యాయము చేయడనే విశ్వాసముతో అతనికి ఆత్మార్పణము గావించుకొంటుంది శకుంతల.

క్షత్రియులకు గాంధర్వ వివాహము ధర్మసమ్మతమని దుష్యంతుడు చెప్పితే, 'కాబోలు' ననుకొంటుంది. అంతేకాని తాను జన్మతః క్షత్రియయే యైనప్పటికీ, వ్యవహారికముగా ఋషికన్యకనే అన్న విషయము గుర్తించదు. తన్ను ఇంతకాలముగా పెంచి పెద్దజేసిన కణ్వమహాముని అనుమతి లేకుండా స్వతంత్రించుట తగదేమో అనియైన ఆమెకు తోచదు. దుష్యంతుని ప్రేమలో సర్వము విస్మరించింది శకుంతల ఆ కారణముచేతనే (రాజధానికి వెళ్ళిన దుష్యంతునే స్మరిస్తూ వివశయైయుండుట చేతనే) దూర్వాసుని ఆగమనాన్ని గుర్తించలేకపోతుంది. చివరికి ఆయన శపించిన విషయముకూడా పాపము శకుంతలకు తెలియదు.

కాని ఆశాపమును విన్న అనసూయా ప్రియంవదలు తిరిగి పోవుచున్న ఆయన కాళ్ళపై బడి, ఏదైనా గుర్తును చూపినట్లైన శాప భయము లేకుండునట్లుగా వరమును సంపాదిస్తారు.

కొంతకాలానికి కణ్వమహర్షి ఆశ్రమానికి తిరిగి వచ్చి జరిగినదంతా దివ్యదృష్టిచే తెలుసుకొని గర్భవతిగానున్న శకుంతలను వాత్సల్యముతో, 'చక్రవర్తికి తల్లివి'గమ్మని ఆశీర్వదిస్తాడు. తరువాత వివాహానంతరము పుట్టినింట ఎక్కువకాలముండుట స్త్రీలకు మంచిది కాదని తన శిష్యులైన శార్ఙ్గరవ శారద్వతులను తోడిచ్చి శకుంతలను అత్తవారింటికి పంపుతాడు. పెంచిన మమకారముచే కణ్వమహర్షి క్షమించినను పితాజ్ఞోల్లంఘన ఫలితము, పెద్దలకు తెలియకుండా స్వతంత్రించి రహస్య వివాహ ఫలితము శకుంతలకు అనుభవించక తప్పలేదు. ఏ అతిథి పూజనిమిత్తమై తండ్రి తన్ను ఆశ్రమములో నుంచి వెళ్ళినారో ఆ అతిథిపూజనే అబుద్ధిపూర్వకముగానే యౌగాక, విస్మరించింది శకుంతల. దానిఫలితముగానే నిండుసభలో అబుద్ధిపూర్వకముగానే భర్తచే విస్మరింపబడి అవమానింపబడినది. గుర్తుగా ఇదివరకు దుష్యంతుడిచ్చిన వుంగరము యెక్కడో జారిపోయినది. ఎన్నో నిదర్శనాలు చెప్పికూడా ఆతనిని నమ్మించలేక మీదు మిక్కిలి పరిహాసింప బడినది.

చివరకు నిరాశతో శార్ఙ్గరవ,శారద్వతుల వెంట తిరిగి కణ్వాశ్రమానికి ప్రయాణమౌతుంది శకుంతల. కాని "దుర్వినీతురాలా! నీ స్వాతంత్ర్యమునకుతగినఫల మనుభవించు" అని వారు తిరిగిచూడకుండా ఆమెను తిరస్కరించి వెళ్లిపోతారు. శకుంతల స్వాతంత్ర్యము అసమంజసమైనదనియు, దాని ఫలితాన్ని ఆమె అనుభవింపబోవుచున్నదనియు ఈ పాత్రలద్వారా మనకు సూచిస్తాడు కవి. ఆ ఫలితమే దీర్ఘకాల భర్తృవియోగము, నిరాదరము. ఆశ్రమ ధర్మాలను యేనాడు అతిక్రమించిందో ఆనాడే ఆశ్రమములో నుండే అర్హతను పోగొట్టుకొన్నది శకుంతల. ఆసమయములో తల్లియగు మేనకయేవచ్చి ఆమెను తీసుకొనివెళ్లనిచో గర్భవతియగు శకుంతల స్థితి దురూహ్యము.

దుష్యంతుడు న్యాయవంతుడు కనుక వుంగరము చూచినతరువాతనైనను పశ్చాత్తాపము చెందుతాడు. మారీచాశ్రమములో శకుంతలను గుర్తించి క్షమాభిక్ష నర్థిస్తాడు. చివరికైనను ఆమెను తనరాణిగా అంగీకరించి కుమారుడైన భరతుని రాజ్యాభిషిక్తుని చేస్తాడు. కాని ఈనాటి యువకులను నమ్మి నేటి కన్యలు శకుంతలలాగా ప్రవర్తిస్తే వారి గతి అధోగతియే.

వివాహము అగువరకు స్త్రీకి తల్లిదండ్రులే రక్షకులు, దైవసములు. వారి రక్షణలో వుంటూ వారి అనుమతి లేకుండా ప్రవర్తించుట అధర్మమూ, అవివేకమూను. అంతకన్నకృతఘ్నత వేరే మరియొకటిలేదు. వారి అనుమతి లేకుండా జరిగిన వివాహమువలన ఎట్టి కష్టనష్టములు కలిగినను వారు బాధ్యత వహించరు. ఆమెకర్మ ఆమె అనుభవించవలసినదే. పురుషులు విశ్వసనీయులే అనుకుందాము.

పరమేశ్వరుడు అవిశ్వసనీయుడనేనా పార్వతి అలా సమాధాన మిచ్చినది? కవి పెంచిన తల్లితండ్రులకు కన్యలు యెట్టి గౌరవాన్ని చూపాలో పార్వతిద్వారాను ఆ గౌరవాన్ని తల్లితండ్రుల కివ్వనందువల్ల కలిగే కష్టనష్టాలను శకుంతలద్వారానూ స్పష్టపరుస్తాడు కవి. ప్రేమించవచ్చు, పెండ్లాడవచ్చు, పెద్దల అనుమతి మాత్రం పొందాలి. కనీసం వారికి తెలిసేట్లుగానైనా వివాహమాడాలి. తన కావ్యముల ద్వారా కాళిదాసు ఇచ్చిన ఈ సందేశము ముఖ్యముగా కన్యలకు గమనార్హము. ★




## పసిపిల్లలు: టీకాలు

పసిపిల్లలకు, ఏడు ఎనిమిది నెలలు రాగానే (వేసవికాలంలో ఎండలు ముదరకముందే) ప్రతి ఇంటిలోని పసిపాపలకు టీకాలు వేస్తారు. అలా టీకాలు పసిపిల్లలకు ప్రతి గృహిణి తప్పకుండా వేయించటం చాలా ముఖ్యం. టీకాలు వేయు దినమున ఉదయం ఆ బిడ్డకు తలంటి నీరుపొయ్యాలి. టీకాలు వేసిన మరునటి దినమున విరోచనమునకు ఆముదము ఇవ్వాలి. అలా ఇవ్వడంవల్ల చిన్నపిల్లలకు, మలబద్ధకముగాని, అజీర్తిగాని వుండదు. అజీర్తి, మలబద్ధకము కడుపునయుంటే టీకాలువేసిన తరువాత వారికి జ్వరము వస్తుంది. మలబద్ధకములేని పిల్లలకన్నా, మలబద్ధకము కలిగియున్న పిల్లలకు జ్వరము ఎక్కువగా వస్తుంది. కనుక టీకాలు వేసిన పిల్లలకు మందము కలుగకుండా, ఆముదం పట్టాలి. అంతేకాదు మందము కలుగు పదార్థములు అనగా పప్పులు, అరటిపండ్లు మొదలైనవి పెట్టకూడదు. అలాంటివారికి తేటచారు అన్నము, మజ్జిగఅన్నము పెట్టవలయును. జ్వరము వచ్చువరకు, టీకాలు వేసినను నీళ్ళుపోయవచ్చును. జ్వరము వచ్చిన నీళ్ళు పోయరాదు. కొందరికి టీకాలు వేసిన మూడవరోజున జ్వరము వచ్చుటకు ప్రారంభమగును. మరికొందరికి ఐదవరోజునుండి జ్వరము వచ్చుటకు ప్రారంభించి టీకాలు బాగుగా పొంగి పెద్ద గుల్లలుగాఅయి, వాటి చుట్టు తిరగ ఎఱ్ఱగా వాపువచ్చును. అలాంటప్పుడు కొందరు పిల్లలు పోరుపెట్టుకొంటారు. అపుడు తల్లి వేడిఅన్నములో నెయ్యివేసి ఒక చేతిగుడ్డలో మూటలా కట్టి పట్టుకొని గుల్లలమీద కాచవలెను. అలా కాచిన నొప్పి తగ్గును. ఇలా రెండు దినాలు అయ్యాక ఆ గుల్లలు, నడుము నల్లపడ మొదలుపెట్టును. అలాంటప్పుడు దురద మొదలుపెట్టును. అందువలన తల్లి ఆ గుల్లల మీద తాంబూలములో వేసుకొను సున్నము దినమునకు రెండుమారులు పూసిన ఆ గుల్లలు చితకకుండా అలాగే ఎండి, తుప్పట తొమ్మిది పదిదినములకు వూడిపోవును. దురద పట్టు సమయములో చిన్నపిల్లలు గోకకుండా తల్లి జాగ్రతగా చూచుకొనవలయును. అలా చేయని పక్షంలో వారు గోకిన ఆ రసి ఎచ్చట తగిలిన అచ్చట అదేమాదిరి గుల్లలు లేచును. ఒకొక్కప్పుడు గోకిన గుల్లలవాపువలన, చంకలయందు గడ్డలు కట్టును. అలాంటప్పుడు పిల్లలు చాలా బాధపడుతారు.

కాబట్టి చిన్నపిల్లలుగోకటానికి ప్రయత్నంచేస్తున్నారని తెలిస్తే వెంటనే ఒకగుడ్డ అచ్చట బాండేజిలా కట్టివేయవలయును. అలాకట్టుటవలన చిన్నపిల్లలుగోకుటకు వీలు పడదు. తొందరగామానును. గోకి గుల్లలు చితికిన, అచ్చట 'సిబాజాల్' మాత్రను తెచ్చి పొడిచేసి గుల్లను డెట్టాల్ నీళ్ళతో కడిగి ఆపొడిని పైనవేసి గుడ్డకట్టిన త్వరగామానును. మాత్రకొనలేనివారు సున్నముగాని, లేక లేతవేపాకుచిగురు కొద్దిగా ఉప్పు పసుపు, కొద్దిగాపెరుగువేసి మెత్తగానూరి అచ్చట పట్టించిన త్వరగా గుల్లలు మానిపోవును.

ఎల్. టి. కాంతమ్మ

## నందివర్ధన పువ్వుతో వైద్యము

నందివర్ధన పువ్వుకూడ సువాసనగానే ఉంటుంది. ఒక్కమొక్కనువేసి బాగా ఎరువూ నీళ్ళూ పోస్తుంటే చెట్టు చక్కగా పెరుగుతుంది. చెట్టు పెద్దదయిన తరువాత అంట్లు కట్టుకొనవచ్చును. ఒక్కమొక్కను జాగ్రత్తగా పెంచుకొంటే అనేక మొక్కలను తయారు చేసుకొనవచ్చును. యీ నందివర్ధన పువ్వులలో వైద్యము చెయ్యవచ్చును. కళ్ళుకలిగితే నందివర్ధనపువ్వులు ఉదయం విచ్చగానే తెచ్చి ఒకకుండలోవేసి దానిమీద తడిగుడ్డ మూతవేసి రాత్రులయందు యివి కన్నులమీదవేసి కట్టుకుంటే ఒక వారంరోజులలో కండ్లకలక తగ్గిపోతుంది. కండ్లకలక ఉన్నప్పుడు కళ్ళు మంటలుగా కూడా ఉంటవి. ఈ పువ్వులువేస్తే ఆమంట కూడా మాయమైపోతుంది. మామూలుగా వేడిచేసి కళ్లు మండుతున్నా యీ పువ్వులు పైచెప్పినవిధంగా వేసుకొనవచ్చును. సెగడ్డలకు నందివర్ధనచెట్టు పాలు(కొమ్మ త్రుంచినా, పూవులు త్రుంచినా పాలు వస్తవి) అవి వేస్తె సెగ్గడ్డలు అణిగయినా పోతవి. పగిలయినా పోతవి. చిన్నచిన్న కణుతులకు యీ నందివర్ధనపాలు వేస్తుంటే రెండునెలలలో పూర్తిగా తగ్గిపోతవి. పాలు దొరకనట్లయిన పువ్వులు వేసయినా కట్టుకట్టవచ్చు. అయితే యీ పువ్వులతో వైద్యము చేస్తే ఆలస్యంగా తగ్గుతవి. కాని పాలే శ్రేష్ఠము.

కె. లక్ష్మీరాజ్యం, చిన్నగంజాం.

# ఆప్లికో వర్క్



మనము సర్వసాధారణముగా చిన్న చిన్న గుడ్డపేలికలు చేర్చుతూవుంటాము. ఈ పేలికలను చక్కటి ఆకారములలో కత్తిరించి వాటిని దుస్తులమీద కుట్టడమే ఆప్లికోవర్క్.

దీనిని ఫ్రాకులక్రింద, చుట్టూను, లంగాలకు చుట్టూగాని టేబిల్ క్లాత్ మూలలుగాని కుట్టుకుంటే కంటికి నదరుగా వుంటుంది.

ఆప్లికోవర్క్ చేయడానికి మందపాటి బట్టే పనికివస్తుంది. మనము కుట్టుకోదలచిన ఫ్రాకుగాని, లంగాగాని లేతరంగైతే, ముదురురంగు బట్టతో ఆప్లికో చేయాలి. ఈ విధముగా రంగులు మాచ్ అయేటట్లు వుంటే కుట్టేక బాగుంటుంది.

పైనయిచ్చిన డిజైను ఫ్రాకుల కిందకు లంగాలకూ బాగుంటుంది. ఈ డిజైను మూడునాలుగువేళ్ళ పిల్లల ఫ్రాకులకు కింద చుట్టూ కుడితే బాగుంటుంది. ఇంకా పెద్ద పిల్లల ఫ్రాకులకు, లంగాలకు అయిన పక్షమున దానిసైజు పెంచుకోవాలి. ఫ్రాకుకు 6 పువ్వులు 6 ఆకులు ఉంటే సరిపోతుంది.

డిజైనును ఫ్రాకుచుట్టూ, ఆప్లికో చేయదలచుకొన్న (ఫ్రాకురంగుకు మేచ్ అయే

వి. సుమతి

రంగుగల) బట్టమీదకి కార్బన్ సహాయమున తీసుకోవాలి. బట్టమీద తీసిన డిజైనులో ఒక పువ్వు కత్తిరించి ఫ్రాకుమీది డిజైనుపై వుంచి టాకాలు వేయాలి. ఆతరువాత కాజాకుట్టుతో కుట్టాలి. ఈవిధముగా ఆకును కూడ కత్తిరించి కుట్టాలి. ఆకు మధ్యనున్న ఈనెను కాడకుట్టుతో ఫ్రాకుకు అతికొక్క కుట్టాలి, కాజాకుట్టుకు బట్ట యేరంగో అదే రంగు డి. ఎం. సి. దారం ఉపయోగించవచ్చును. ఈ డిజైనులో ఆకులకు పువ్వులకు ఒకటే రంగుబట్ట వాడిన బాగుండును. సిల్క్ బట్టలు గాని, పువ్వులు గలబట్టలు వాడుట మంచిది కాదు. వీలైనంతవరకు ఫ్రాకుకూడ ప్లెయిన్‌గా వుండిన బాగుండును.





జ్వరము తగ్గినతరువాత తలకునీళ్ళు పోయవలయును. ఇలా రెండుదినములకొకమాటు తలంటి నీళ్ళుపోసి, మరిఒకమాటు విరోచకము నకు ఇచ్చిన, దేహములోనివేడి తగ్గిపోయి, చిన్నపిల్లలు కులాసాగా వుంటారు. అలా చేయనిపక్షంలో, కొందరికి, వేడికడుపులోనేవుండి, కొద్దిదినాలయినతరువాత విరోచనాలు మొదలుపెట్టి పిల్లలను గోడవచేస్తుంది. కనుక పై విధముగా నడుచుకున్న పిల్లలకు టీకాలు త్వరలోమానిపోయి, చిక్కిపోకుండా కులాసాగా యుంటారు. కనుక ప్రతిగృహిణి ఈవిషయాన్ని తప్పకపాటించవలయును. ఈటీకాలు పిల్లలకు ఒకసంవత్సరములోపలనే వేయించవలెను. పెద్దపెరిగి అన్ని తెలిసిన పిల్లలకువేస్తే, వారు ఈ గుల్లలను గోకి, కట్టినగుడ్డలను తిసివేసి, చాలాగొడవలు తామూపడి, తల్లిని తిప్పలు పెట్టుతారు.

## పైత్యం, తలత్రిప్పు

పైత్యమంటే కొందరికి వస్తూ తలత్రిప్పడం పసరు వాంతులు పడుతుంటాయి. అలాంటి వాటికి ఒక చిన్న అల్లం ముక్క తీసుకు శుభ్రంగా కడిగి రోట్లోవేసి బాగా నూరి ఓ అవున్న రసం తీసుకు కొద్దిగా తేనె విచ్చి ఒక్కమాటు గరిట్లోపోసి పొంగించి త్రాగాలి పైత్యం పూర్తిగా తగ్గుతుంది. (అల్లపు రసం తేర్చి తీసి అడుగున వచ్చిన పత్తు) అవగా తెల్లగా వుంటుంది. అది పార వేయాలి. ఓపికున్నవారు ఒక ఆకాకు కటిక పెసలు రోట్లో మెత్తగా రుబ్బి అల్లం జీలకఱ్ఱ వేసి రుబ్బి పుష్పావేసి నేతితో అట్టువేసుకు పుదయం వేళ పరగడుపున తింటే, పైత్యం అన్నమాట వుండదు. పై చెప్పిన చర్మవ్యాధులకు కూడా ఈ అల్లం పెసరట్టు బాగా పనిచేస్తుంది.



# ★ ములగచెట్టు ఉపయోగాలు ★

ములక్కాడలతో మనం కూరలు, పులుసు వండుకుంటాం. ములగచెట్టు ఉపయోగాలింకా ఉన్నాయి. ములగ చెట్టని కొందరంటారు. మునగ చెట్టని కొందరంటారు.

### ఆకు

ఎక్కడైనా దెబ్బ తగిలి వాచినా, బెణుకు పట్టి వాచినా ములగాకుదంచి ఆముదంతో కలిపి వెచ్చపెట్టి వాపుమీదవేస్తే వాపు తీస్తుంది.

### ఆకు కూర

ములగాకుదూసి ముద్దగా అవకుండా పొడి పొడిగానే ఉండేటట్లు కొంచెం కొంచెం తీసుకుని చేతితో నలపాలి. పెసరపప్పుకాని, కందిపప్పుకాని ఉడికించుకుని ఒక పళ్లెంలో ఉంచుకోవాలి. గిన్నె కుంపటి మీద ఉంచి నూనెవేసి మినపప్పు, జీలకఱ్ఱ, మిరపకాయలు పోపువేసి ఇందులో పప్పు, నలిపిన ఆకు, ఉప్పు ఈ పోపులో పడేసి కలిపి కొంచెం నీళ్లు చిలకరించి మూతవేసి 5 నిమిషాలుంచి దింపాలి.

### కొబ్బరితో

పప్పుకూరలాగే దీనికికూడా ఆకు నలిపి సిద్ధం చేసుకోవాలి. గిన్నె కుంపటిమీద కాలేసి మిరపకాయలు, జీలకఱ్ఱ, మినపప్పు పోపువేసి కొబ్బరి కోరువేసి, ఉప్పు, ములగాకువేసి నీళ్లు చిలకరించి 5 నిమిషాలు మూతవేసి ఉంచాలి, తర్వాత గంటెతో ఒక పళ్లెంలోకి తీసుకోవచ్చు.

### నేతిలో

కొంతమంది నెయ్యి కాచినప్పుడు వేడికి కమ్మదనం రావడానికి తమలపాకు వేస్తారు. అలాగే ములగాకుకూడా నెయ్యికాచి దింపగానే వేస్తే నెయ్యి బాగుంటుంది. తర్వాత ఆ ఆకు పిల్లలికిస్తే కమ్మగా ఉంటుందని కనక తినేస్తారు.

### ములగపువ్వు

ములగపువ్వు కింద రాలిపోతుంటుంది. ఆ పువ్వు వృధా కాకుండా విలవ చేసుకుంటే

**పంతుల సౌభాగ్యలక్ష్మి.**

బాగుంటుంది. ఇది రొట్టెల్లో పూరీల్లోకి బాగుంటుంది. పువ్వు పరిశుభ్రంచేసి దానికి తగిన చింతపండు పులుసు తీసుకోవాలి. చింతపండు పులుసులో ఈ పువ్వువేసి, ఉప్పు, పచ్చిమిరప ముక్కలు, కొంచెం ఇంగువ, సాంబారు పొడివేసి ఉడికించాలి. ఉడికాక, ఉడికించిన కందిపప్పు కొబ్బరి కోరువేసి కలిపి దింపాలి. పప్పు కలిపితే గట్టిగా ఉండేటట్లుండాలి కూటు. అంటే మామూలు పప్పు పులుసుల్లో వేసుకున్నకంటే పప్పు ఎక్కువెయ్యాలి. దీనికి పోపు ఆవాలు, జీలకఱ్ఱ వేస్తే చాలు.

### ఇంకొక పద్ధతి

పప్పు ఉడికించి సిద్ధంగా ఉంచుకోవాలి. సెనగపప్పు, కొబ్బరి ముక్కలు, ధనియాలు, కరివేపాకు, మిరప, మిరియాలు, ఇంగువ కొంచెం బియ్యం నేతిలోకాని నూనెలోకాని వేయించి పొడికొట్టి ఉంచుకోవాలి. చింతపండు పులుసులో ములగపువ్వువేసి, ఉప్పు, పచ్చిమిరపచేర్చి ఉడికించాలి. ఉడికాక పప్పు, పొడివేసి కలిపి దింపి ఆవాలు, జీలకఱ్ఱ పోపువెయ్యాలి.

### కాడలు

ములక్కాడలు చాలా విధాలుగా ఉపయోగించవచ్చు. చారులో వేసుకుంటే చాలా బాగుంటుంది. ములక్కాడలు పప్పు పులుసు చేస్తారని చాలామందికి తెలిసినదే.

### ఆవకాయలో

మామిడితో పెట్టిన ఆవకాయలో కొంత ఆవపిండితీసి (ఊరినది) అందులో ములక్కాడ ముక్కలు ఊరేస్తే చాలా బాగుంటాయి. కొందరు బెల్లం ఆవకాయ పెడతారు. అందులో కాడలు బాగుండవు. మూడు గుండలు సమంగా పోసిపెట్టిన కారం ఆవకాయలోనే ఊరెయ్యాలి.

### నువ్వుపిండికూర

ములక్కాడలుడికించి ఉంచుకోవాలి. ఉడికించేటప్పుడే ఉప్పు వెయ్యాలి. బియ్యం, కొబ్బరి, నువ్వు పప్పు కొంచెం బెల్లం రుబ్బి ఉడికిన ముక్కలకి పట్టించాలి. ఆవాలు, మిరప, మినపప్పు పోపువేసి ఆ గిన్నెలో ఈ కూర పడేసి కలిపి కొంచెంసేపుంచి దింపాలి.

### సెనగపప్పుతో

ఉప్పుతో ములక్కాడ ముక్కలు ఉడికించి ఉంచుకోవాలి. నానవేసిన సెనగపప్పు, మిరప, కరివేపాకు, జీలకఱ్ఱ, ఉప్పు (పప్పుకి తగినంత) రుబ్బి ఉడికిన ముక్కలకి పట్టించాలి. ఒక మూకుట్లో నూనెవేసి పిండిముద్ద ఉడికేవరకూ వేయించాలి. ★

## బంగాళదుంపతో గులాబ్ జామ్

[illegible] బంగాళదుంపలు ముక్కలు తరిగివుడికించాలి. వాటిని పొట్టుతీసి మెత్తగారుబ్బి, ఆ ముద్దలో చిటికెడుసోడా వేసికలపాలి. ఒకకప్పు చక్కెరతో తీగపాకముపట్టి పొయ్యిదగ్గరవుంచాలి కడాయి (మూకుడు)లో కప్పుడాల్డావేసిపొయ్యిమీద పెట్టి బంగాళదుంపముద్దను కోడిగుడ్డు ఆకారములోచేసి, ఈ నేతిలో దోరగా వేయించి తీసి పాకములో వేయాలి. ఇదేమాదిరిగాఅన్నీ చేసి పాకములో వేయాలి. ఇది కోవాతో చేసిన గులాబ్ జామ్‌లాగేవుంటుంది. బంగాళదుంపతో చేసినట్టు చెప్పితేగాని తెలియదు. ఒక్కరోజుకంటె నిలవవుండదు.

వడలు:— బంగాళదుంపలు వుడికించి పొట్టుతీసి ఉప్పువేసి మెత్తగారుబ్బాలి. [illegible] పచ్చిమిరపకాయలు, [illegible] జీలకఱ్ఱ కొత్తిమీరకూడ ఈ ముద్దలోవేసి కలపాలి. పొయ్యిమీద డాల్డాపెట్టి బంగాళదుంప ముద్దను నిమ్మకాయంత వుండతీసుకొని మోదుగాకుమీద వడలాగ తట్టి ఎర్రగా వేయించవలెను. ఇవి చాలరుచిగా వుంటాయి. ★

ఆర్. వి. కాంత (నల్గొండ)

ఒ కి ప్పొ వం ట కా లు:

# ★ గవాక్షరీ అప్పడాలు ★

ఈ అప్పడాలు ఖరే గమ్మత్తుగా వుంటాయి. చిన్నముక్క గనక నూనెలో వేస్తే దానంతటఅది పొంగి వేసినముక్క కి డబుల్ అవుతుంది. కారం వుప్పు వుండదు కనక కమ్మగా వుంటాయి. కావాలిసిన సామాన్లు. వీటికి నూనె ఎంతయినా కావాలి.

పెసరపిండి, మినపపిండి, శనగపిండి, కంది పిండి, ఇంగువవుప్పు, నల్లజీలకర్ర, గవాక్షిరి, నూనె.

నాలుగు పిణ్లూ కూడా సమాన తూకాల్లో వుండాలి. అంటే పెసరపిండి పావ్శేరైతే మిగిలిన మూడు పిణ్లూ కూడా అంతే వుండాలి. ఒక్కొక్క పిండినీ విడిగా జల్లించుకుని అన్నీ నాలుగూ కలిపి సుబ్బరుకోవాలి.

కలువలరాయి తీసుకొని శుభ్రంగా కడిగి చేసి పిండికి తగినంతవుప్పు ఇంగువ వేసి మెత్తగా నూరుకోవాలి. దాంతోనే ఈనల్ల జీలకర్రకూడా వేసి మెత్తగా నూరుకోవాలి. ఈగవాక్షిరి అన్నది తెల్లగా పలుకులులాగా వుంటాయి. వీటినికూడా మెత్తగా నూరుకొని ఇందాకటి గుండలో వేసి బాగా కలుపుకోవాలి.

ఒక చిన్నగ్లాసుతో నీళ్లు తీసుకుని ఈ గుండ వేసి బాగా కలిపివెయ్యాలి. నాలుగుపిళ్ల మిశ్రమంలోను ముద్దగుంటచేసి ఈనీళ్ళు పోస్తూ గట్టిగా కలుపుకోవాలి. రోటిని కడిగి, నూనెరాసి, రోకలిని కూడా కడిగి బాగా నూనె రాయాలి. ఈముద్దకి నూనె మర్దనచేస్తూ మెత్తగా దంచుకోవాలి. ముద్దనించి నూనె కారుతున్నదా అనేట్టు నూనెతో మర్దన చేసుకోవాలి. చిన్న ఉసిరి కాయలంత చిన్న ఉండలు చేసుకు పల్చగా ఒత్తుకోవాలి. దీనికి ఒత్తుపిండి ఏమాత్రం ఉండకూడదు. అప్పడం గనక పొగక పీటకి, కర్రకి అంటుకుంటూంటే ఇంకొంత నూనె రాచి ఒత్తుకోవాలి.

ఇల్లా ఒత్తుకున్న అప్పడాలు మద్రాసు అప్పడాలకన్నా చిన్న బిగాపల్చగావుండాలి. ఈఅప్పడాన్ని ఎండలో ఎండబెట్టరాదు. తడిలేనిచోటు, గాలివీచేది, నీడగావున్న చోట ఆరబెట్టుకోవాలి. మధ్యాహ్నపువేళ టిఫినుకు ఖరే రుచిగా కరకరలాడుతూ వుంటాయి. మీ ఫ్రెండ్సుని పిలిచి నూనెలో వేసిన తరువాత దాని తమాషా చూపెట్టండి. కుదరకపోతే నన్ను దీవించకండేం! జాగ్రత్తగా మరోసారి చదివి అర్థంచేసు కున్నాక మచ్చుకి కొంచెం చేసి, తరువాత పెద్ద మొత్తాలకి.

—అద్దంకి శ్రీదేవి.

* * *

# "పాలముంజలు"

ఈ వేసవికాలంలో మధ్యాహ్నంపూట తినుటకు చక్కని తీపి పిండివంట పాలముంజలు; వీటిని తయారుచేయడం సులభం, ఖర్చుకూడా అట్టే కాదు. వీటిని తయారుచేసే విధానం ఈ క్రింద వివరిస్తాను.

పాలగుండ, పంచదార—పదిసేపలాలు, ఏలకాయలు ఒక తులం, పాలు అర్ధశేరు కావాలి.

'పాలగుండ' పచారీ దుకాణాలలో దొరుకుతుంది. 'పాలగుండ' పొడిని జల్లించి, ఉదయాన్నే నీళ్లలో నానపెట్టాలి. మధ్యాహ్నమప్పుడు ఆ పైనీళ్ళు వంచివేయాలి. అర శేరు పాలను విడిగా కాచి, ఒక పొంగు రాగానే వెనుక చెప్పిన పాలగుండను (నాన పెట్టిన దానిని) పాలలో వేసి గరిటెతో బాగుగా కలియపెట్టాలి. పదినిమిషాల తరువాత, పంచదార వేసి కలియబెట్టిన, ఉడికి, చిక్కబడి గోధుమ హల్వాలాగా తయారవుతుంది. అప్పుడు గిన్నె నుదించి, ఒకపీటమీద తెల్లని, శుభ్రమైన వస్త్రమును నాలుపొరలుగా తడిపివేసి, ఆగుడ్డమీద తయారైన పిండిని ముంజెల ఆకారంలో ఎడంఎడంగా వేయవలెను. వాటిపై ఏలకుపొడిని చల్లాలి. ఒక పావుగంట తరువాత అవి చల్లారి తినుటకు మనోహరంగా వుంటాయి. ముంజలు లేనిచోట ఆలోటు తీరుస్తాయి.

శిష్ట్లా రాజేశ్వరి.

* * *

## కిచిడీ

ఈ ఫలహారం ఆంధ్రప్రాంతంలో ఎక్కువ చేస్తారో లేదో తెలియదుగానీ, తెలంగాణంలో మాత్రం చాలా ప్రచారంలోవుంది. ప్రొద్దుటిపూట ఆఫీసులకు, స్కూళ్ళకు వెళ్లేవేళకు దండిగా తినడానికి ఇది చేసినట్లయితే బాగుంటుంది.

కావలసిన పదార్థములు:—అర్ధశేరు సన్న బియ్యం, అర్ధపావు పెసరపప్పు, కొద్దిగా అల్లంముక్క, పావుతులం లవంగాలు, కొద్దిగా దాల్చినిచెక్క, రెండు వెల్లుల్లిపాయలు (ఇష్టమున్నవారికి) తగినంతఉప్పు, పసుపు, కొత్తిమేర, కరివేపాకు అయిదారు పచ్చిమిరపకాయలు రెండు పెద్ద ఉల్లిగడ్డలు.

దీన్ని నూనెతో చెయ్యగూడదు; నెయ్యిగాని, డాల్డాగాని వాడాలి. వండడానికి కళాయిపాత్ర ఉపయోగించాలి. ఇత్తడి గిన్నెలో గూడా చెయ్యవచ్చును కానీ, వేడిమీదనే అందులోనుంచి తీసివెయ్యవలసి వుంటుంది. లవంగాలు, దాళంచెక్క కొంత మంది నూరివేస్తారు, కొందరు దాళంచెక్కను చిన్నతుంపులు చేసి, లవంగాలు ఆ పాళ్ళే వేస్తారు. ఉల్లిగడ్డలు, పచ్చిమిరపకాయలు చీలికలుగా తరిగి వుంచుకోవాలి. అల్లం, వెల్లుల్లిపాయ ముద్ద నూరుకోవాలి. బియ్యం, పెసరపప్పు కలిపి గాలించి, కడిగి బుట్టలో వడిగలవెయ్యాలి. వెడల్పైన పాత్రలో చిన్నగిన్నెడు నెయ్యిపోసి పొయ్యిమీద పెట్టాలి. నెయ్యి కాగిన తరువాత లవంగాలు దాళంచెక్క వెయ్యాలి. వెంటనే అల్లం ముద్దవేసి ఒక నిముషమాగి ఉల్లిపాయ, పచ్చిమిరపకాయ ముక్కలువేసి దోరగా వేయించాలి. అవివేగే సమయానికి సుమారు చూసుకుని బియ్యానికి సరిపడ నీళ్ళు ఆగిన్నెలో పొయ్యాలి. ఈ ఎసట్లో ఉప్పు, పసుపు, కరివేపాకు, కొత్తిమేర వేసి మూతపెట్టాలి. ఎసరుకళపెళలాడినతరువాతకడిగివుంచుకున్న బియ్యం ఎసట్లో వెయ్యాలి బాగా అన్నం మాదిరి ఉడకగానే దింపాలి.

దీన్లో నంచుకోడానికి, టొమేటో పెరుగు పచ్చడిగానీ, పచ్చిఉల్లిగడ్డలు సన్నగా తరిగి పెరుగులో కలిపి ఉప్పు, పసుపువేసి పోపు చేసిందిగానీ రుచిగా వుంటుంది.

తెన్నేటి అహల్యాదేవి. ★

## పురిట్లోనే సంధి

"దంపతులమధ్య కొట్లాట ప్రారంభం కావటం నువ్వ కళ్ళారా చూశావా?" అని డైవోర్సు కోర్టులో జడ్జీ ఒక సాక్షిని అడిగాడు.

"చూడకపోవట మేమిటి? పెళ్లి చేయించిన పురోహితుణ్ణి నేనేకదండీ" అన్నాడు సాక్షి.




## 'దేవుడు వరమిచ్చినా'!

ఇంటి యజమానులు అద్దెకున్న వారిని నానాఅవస్థలు పెట్టడమూ, వారు వాటిని సహించడమూ సహజమే కాని యింటియజమానులు కాక అద్దెకున్నవారిని యమయాతనలు పెట్టేవారు యింకొకరున్నారు. వారెవరోకాదు వారూ అద్దెకున్నవారే అంటే ఒక యింట్లోనే రెండు కుటుంబాలవారు, వేరు వేరు భాగాల్లో కలిసివున్నారనుకోండి వారిలో ఒక కుటుంబమువారు అమాయకులై, రెండవవారు అసాధ్యులైనట్లయితే, వారు యివతలివారిని పెట్టేబాధ అంతా యింతా కాదు.

ఉదాహరణకు, పనివాళ్లకు ఏవో లేనిపోనివన్నీ కల్పించి చెప్పి యివతలివాళ్ళకు పని చెయ్యనియకపోవటం, లైట్లు తాము ఎక్కువ కాల్చి, బిల్లు యివతలివాళ్ల నెత్తిన రుద్దటం, వారింట్లో పంపు తిప్పితే యివతలివాళ్ళకు రావప్పుడు, వీళ్లు పనిచేసుకుంటుంటే, వారికి నీరు అవసరం లేకపోయినా ఊరికే పంపుని తిప్పివుంచటం మొదలగునవి ఇట్లాంటివి వ్రాస్తే ఎన్నోవుంటై.

పాపము! ఇంటి యజమాని ఎంత మంచివాడైతేమాత్రం ఏం ప్రయోజనం? ఇట్లాంటి చిన్న చిన్న తగాదాలలో అతడేమి జోక్యం కలిగించుకుంటాడు? ఇట్లాంటివారితో వేగడం ఎలాగో చెప్పండి! అందుకనే దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడని అనటం

యడవల్లి హేమలతాదేవి,
హైద్రాబాద్.

## "ఎందుకొచ్చిన అవస్థ"

క్రిందటివారం వారపత్రికలో ఎస్ సుగుణగారు "ఢిల్లీలో ఉదయం 11 గంటలవేళ" అనే వ్యాసం చాలా బాగ వ్రాశారు ఇకమీదట బజారు పని మనమే చేసుకోవాలి అనిపిస్తుంది. అయితే ఈ చిన్న, చిన్న వూర్లలో ఆడవాళ్ళు బజార్లకు వెళ్ళడం అంటే నలుగురు నాలుగువిధాలు చెప్పుకొంటారు ఏది ఎలావున్న ఈ నౌకర్లతో గాని లేక మగవాళ్ళతో కాని (కొన్ని వస్తువులు వాళ్ళకు అర్థంకాక పనికిరాని వస్తువులు తెస్తుంటారు) చెప్పటంకన్న మనమే వెళ్లడం మంచిదనిపిస్తుంది ధైర్యం చేసి మనమే వెళ్లామా ఇకవుంది గొడవ ఏ షాపుదగ్గరికి వెళ్ళినా వాడు ఒక అరగంట కానిది వదలడు మనము అడిగే ప్రశ్నకు జవాబు చెప్పక అలా చూస్తు నిలుచుంటాండు మనకే అదోమాదిరి అయిపోయి వెళ్ళిపోవలసిందే మొన్న నా స్నేహితురాలు వచ్చింది ఆమెది కలకత్తా కొంచం పాషనబుల్ గావుంటుంది ఇకేం ఒక అరగంట నిలుచున్నాం వాడు జవాబు చెప్పి లేకదూ కడకు నా స్నేహితురాలికి విసిగి ఏయ్ అబ్బి ఏమీ అలా చూస్తున్నావు? మే మడిగింది వుందా? లేదా! అని అడిగేసింది వాడు కడకు జవాబు ఇచ్చిందేమో లేదనే దానికోసం అరగంట నిరీక్షణ ఇదంతా చూస్తుంటేను మగవాళ్ళకు సరిగా చెప్పి తెప్పించుకోవడమే మేలనిపిస్తుంది

యికపోతే పెద్ద పెద్ద సిటీల్లో అయితే పరవాలేదు మనమాదిరిగా ఎంతో మంది తిరుగుతుంటారు ఈ చిన్న చిన్న వూర్లలో మాత్రం ఎందుకొచ్చిన ఈ అవస్థ

ఆర్. వి. స్వర్ణ, (తిరుపతి)

## మన దేశంలోనే

24-6-57 వనితాలోకం శీర్షిక క్రింద 'స్త్రీలు ప్రయాణీకులు' శ్యామలాదేవిగారు వ్రాసినది చదివేము ముఖ్యంగా ప్రయాణాల్లో ఇబ్బందులు మనదేశంలోనే ఎక్కువ పడుతున్నారు పోతే ఫస్టుక్లాస్ - సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్స్ 'లాకప్' అయిపోవటం, థర్డుక్లాస్ చాలా రష్‌గా వుండటం, ఫస్టుక్లాస్, సెకండ్ క్లాసెస్ వెయిటింగ్ రూమ్స్ లాకప్ అయిపోవటం - అర్థరాత్రివేళలప్పుడు కూడ ప్రయాణీకులు ప్లాట్‌ఫారమ్‌మీదనే పడి కాపులు పడి కూర్చోవటంవల్లనూ, ప్రయాణీకులు చాలా ఇబ్బందులు పడుతున్నారు దగ్గర ప్రయాణాలు చేసేవారైతే అంత ఫరవాలేదుకాని, దూరప్రయాణాలు చేసే వారి అవస్థలు చెప్పలేము

ఎ రంగ (గూటాల)

## స్త్రీలేనా?

"మనవిని విని" అన్న అంశము మీద శ్రీ ఎస్ రామనాథంగారు వ్రాశారు కేవలము పురుషులను కించపరచడమే మహిళా సంఘాల కార్యక్రమమని వ్రాశారు. నిజమాలోచిస్తే స్త్రీలేనా కించపరచేది. ప్రతి క్షణము కుంటేళ్ళలా తిరిగే కాలేజి విద్యార్థులను కించపరచేది పురుషులు కాదా? భర్తచేసే ప్రతి పనిలోను స్త్రీకి బాధ్యత ఉంటుంది కస్తూరిబాగాంధి ప్రతి చిన్న విషయములోను ఆమె భర్తకు సహాయముగనున్నారు. ఆమె సహాయముగ నుండుటచే ఆయనకూడ ప్రతి పనిని ఉత్సాహముగ చేయగలిగారు. కావున స్త్రీలు ఎక్కడో మహిళాసంఘాలలో వారి యుద్దేశములు చెపితే అది పురుషులను కించ పరచడమను కోవడము పొరపాటు.

కె శకుంతలాదేవి రాజమండ్రి.

## 'మనవిని విని'ని చదివి

జూన్ 26వ తేది పత్రికలో ఎస్ రామనాథంగారు వ్రాసిన 'మనవిని విని'ని చదివిన తర్వాత ఎంతైనా ఆశ్చర్యంవేసింది, 'కోమలి నిజమున్' మొదలుకొని 'ఆడదానికి చదువుకుంటే వంటరాదు, భర్తను గౌరవించడం తెలీదు పిల్లల్ని ప్రేమించలేదు' లాటి అభాండాలని నెత్తికి రుద్దుతుంటే తలొంచుకుని భరిస్తే భరించినట్టు, లేక మేమూ మీలాంటి మానవమాత్రులమే, మాకూ మీకుందేగుణాలే వుంటాయి, అని ప్రపంచానికి తెలియ చెప్పడం కూడా నేరమే? సినిమాల్లో,కథల్లో ఎక్కడ చూసినా నిజాన్ని కాజాలని కప్పిపుచ్చి అసలే అధ్వాన్నంగా వున్న చదువుకున్న ఆడపిల్లల్ని మరింత అధోగతి పాల్జేస్తుంటే వూరుకోలేక ప్రతి ఘటించడానికి కూడా స్వతంత్రం లేదూ?

'కస్తూర్బా, గాంధీజీ గొప్పదనానికి కారణం' అన్నదాంట్లో తప్పేం వుంది? అంత సంకుచితంగా ఆలోచించుకోవడం దేనికి? గాంధీజీయేవుంటే ఆయన సంస్కార హృదయం ఎంతైనా సంతోషించేది!"

(56-వ పేజీ చూడండి)




# ఇంటిగుట్టు

ఎలుకపోకటి ఇల్లుచొచ్చి,
ఉలుకులేక, పలుకులేక,
వంచిలోని కందిపప్పు
చల్లగాను బొక్కుచుండె.

పిల్లి ఒకటి అంతలోన
మెల్ల మెల్ల నడుగులిడుచు
ఇల్లుచొచ్చి పొంచిపొంచి
ఎలుక మీద కెగిరిదూకె.

కీచుకీచుమనుచు ఎలుక
పీచమడగి చచ్చిపోయె;
కుక్కయొకటి నక్కినక్కి
నొక్కిపట్టె పిల్లి నపుడు.

చావలేక బ్రతకలేక
"మ్యావు, మ్యావు" మనుచు పిల్లి
కనులు మూసి తెరచుచుండి
కదలుచుండె పారిపోవ.

అవ్వయొకతె అపుడు వచ్చి
అక్కడున్న కర్ర తీసి
గుర్రు గుర్రుమనెడి కుక్క
బుర్ర పగులునట్లు కొట్టె.

మొరుగుకొనుచు కుక్క యపుడు
పరుగులిడుచు పారిపోయె,
నోట నెలుక కరచిపట్టి
తోటలోకి పిల్లి పోయె. ★

"అక్షయ"

# న్యాయ నిర్ణయం

"బయటికి రండి! ఒక్క నిముషం ఇక్కడుండటానికి వీలులేదు" రాజభటులు ఆజ్ఞలను జారీ చేస్తున్నారు, పూరిగుడిసె నివాసులకు, అతి కఠినంగా. ఆ మాఘమాసపు చలిరోజుల్లో ఒక్కొక్కరు బయటికొచ్చారు గజగజ ఒణుక్కుంటూ.

వారికిక అవకాశం లేదు. కాశీనగరపు రాణి యమునా నదిలో స్నానార్థం అక్కడికి వస్తున్నది కనుక నదిఒడ్డునవున్న సామాన్య ప్రజానీకమంతా తప్పక ఆ ఇళ్లు ఖాళీ చేయవలసిందే!

పవిత్ర నదిలో స్నానార్థం రాణి యేతెంచింది ఆ చలికాలపు చల్లని నీరు ఆమె సున్నితమైన శరీరానికి కష్టం కలిగించింది. ఆ చలిబాధకు తట్టుకోలేకపోయింది రాణి. చలి కాచుకుందామనే సదుద్దేశ్యంతో నలువైపులా చూచింది, ఎందుచితుకులు ఎక్కడన్నా కనబడతాయేమోనని.

"నాకు వేడి కావాలి. అక్కడున్న గుడిసెలలో ఒకదానిని కాల్చివేయండి!" అకస్మాత్తుగా దాసీతో అన్నది రాణి.

దాసి ఈ ఆజ్ఞకు చకితురాలైంది; "మహారాణి! ఈ పవిత్రమైన గుడిసెలు కటిక బీదవారికి నీడ ఇస్తున్నాయి. మనమీపని చేయటం వలన ఆ బీదవారెంతగా దుఃఖిస్తారో?" సౌమ్యంగా జవాబిచ్చింది.

ఈ జవాబునే తిరస్కృతిగా భావించింది రాణి. కోపంతో కళ్లల్లో నిప్పులు కురిపించింది రాణి ఇంకొక దాసివైపు తిరిగి "ఈ తలతిక్కదాన్ని తన్ని ఇక్కడనుండి నెట్టు... ఇక నీవు నే చెప్పిన పని చేయి," అంది.

ఆ ఆజ్ఞ శిరసావహించబడింది గుడిసె అగ్నిజ్వాలలతో కప్పివేయబడింది.. అదేగాదు గాలిమూలంగా ఆ గుడిసెల గుంపంతా అగ్నిహోత్రానికి ఆహుతి అయ్యాయి రాణికి కొద్దిగా వెచ్చదనం కావాలనుకుంటే మరింత వచ్చింది. దాంతో ఆమె ఎంతగానో సంతోషించింది.



"శోభశ్రీ"

కావలసినంత వెచ్చదనంతో రాజప్రాసాదానికి చేరింది రాణి. కాని ఆమె వెనకాలే వందలకొలది వ్యక్తుల హాహాకారాలు, శాపాలు కూడగట్టుకు వెంబడించాయని ఆమెకేం తెలుసు?

జరిగిన విషయాలను ఆమూలాగ్రంగా కాశీరాజు తెలుసుకొన్న వెంటనే, ఆశ్చర్యంగా సింహాసనం మీదనుండి లేచాడు, దర్బారులో. రాణివాసానికి అతి రయంగా పరుగు తీశాడు.

"మహారాణి ఏం చేశావు నీవు?" అని దుఃఖాతిరేకంతో పలికాడు రాజు. "నీవు చేసిన భయంకర క్రియకు, అన్యాయానికి ఎందరి జీవితాలు గగ్గోలు పడుతున్నయో గ్రహించావా?"

ఆ రాణి అందాలరాణి. రాజు హృదయాల రాణి. ఆ సంగతి ఆమెకు తెలుసు.

"ఆ వెధవ గడ్డికొంపల్ని గురించి కదూ మీరు మాట్లాడేది? అయినా నేను స్నానం చేసేచోట అవెందుకండి? నేను చేసినదాంట్లో ఏమీ అన్యాయం లేదు!" అంది.

రాజు రాణిని మిక్కిలి మక్కువతో ప్రేమిస్తాడు కాని, ఆమె కంటే కూడ న్యాయంమీద ప్రీతి జాస్తి రాజు కళ్లు మూసుకున్నాడు: "నా ఉద్దేశ్యంలో చట్టరీత్యా అందరూ సమానులే! పూరిగుడిసెలే బీదవారి రాజభవనాలు నీవు చేసిన అన్యాయానికి నీకు.."

వెంటనే ఒక దాసివైపు తిరిగి: "రాణి ధరించిన విలువైన వస్త్రాలు విప్పి, ఆభరణాలు తీసి, చిరిగిన గుడ్డలు కట్టి రాజసభకు తీసుకు రండి."

మహారాణి మారువలికేలోగానే రాణివాసాన్ని వదిలివేశాడు రాజు. దాసి రాజాజ్ఞను శిరసావహించి, రాణిని బిచ్చగత్తె స్వరూపంలో రాజసభకు తెచ్చినప్పుడు సభికులంతా ఆశ్చర్యచకితులైనారు.

గంభీర స్వరంతో రాజు ఈవిధంగా పలికాడు: "స్వయంగా అనుభవిస్తేగాని తెలుసుకోలేరు ఇత

# వారఫలాలు

కుమారి పి. ఉమాశశి

ఆవేళ ఆదివారం. మా అన్నయ్య ఆనాటి పేపరు తీసుకొని మేడ మెట్లెక్కుతున్నాడు. నేను చదువుకొంటున్నదాన్నల్లా చటుక్కున ఆపేసి అన్నయ్యని అనుసరించాను. నేనూ, అన్నయ్యా కలిసి మేడమీద కెళ్ళి వారఫలితాలు చూసుకుంటున్నాము. అసలు మొదట్లో ఈ పిచ్చి నాకొక్కదానికే వుండేది కాని ఇంటర్ పాసయినప్పటినుండి అన్నయ్యకి కూడ వారఫలితాల మీద నమ్మకం కుదిరింది. అన్నయ్య గట్టిగా చదువుకుపోతున్నాడు... "ఈ వారంలో రవి శుక్రులు అనుకూలురు. కాలం ఎప్పుడూ ఒక్కలా నడవదు. కలిమిలేములు కావడి కుండలను లోకోక్తి మీకు బాగా అనుభవం. ఏపరిస్థితుల్లోనూ ధైర్యం వదలవద్దు. . . వారాంతంలో శుభ కార్యాలు నెరవేరుతవి.. " ఇంతలో పదేళ్ళరాము, పన్నెండేళ్ళ రేఖ మేడమీదకు వచ్చారు మేం వారఫలితాలు చూసుకుంటున్నామని తెలిసి, వాళ్ళవి కూడ చూడమని ఒకటే వేధించడం మొదలెట్టారు. వాళ్ళ నక్షత్రాలు నాకు తెలియవు. అందుకని ఎల్లా చెప్పడం? వాళ్ళ నక్షత్రాలు చెబితే వాళ్లే చూసుకుంటామని ఒకటే ఏడుపు.

"అక్కా! నా నక్షత్రం చెప్పు. చెప్తావా, చెప్పవా? ఊ. . చెప్పు"

"చిన్నక్కకి చెబితే నాకూ చెప్పాలి. నువ్వు చెప్పకపోతే పో, మేం అమ్మనడుగుతాం."

"సరే అమ్మనే అడగండి. మీ నక్షత్రాలు నాకు తెలియవు. అయినా చదువుకోరా ఏమిటి మీరు? వెళ్ళు రామూ, రేపు పాఠం ఒప్పచెప్పకపోతే మాష్టారు తిట్టరూ! పొండి చదువుకోండి బాబూ" అన్నా నేను బతిమాలే ధోరణిలో.

ఇంతలో అన్నయ్య పేపరు చదివేసి నాకిచేస్తూ "బతిమాలితే మీరు వింటారా? పొండి. చిన్న వాళ్లు వారఫలితాలు చూచుకోకూడదు వెళ్ళిపొండి." అంటూ వాళ్ళని కిందికి పంపి తను చదువులో నిమగ్నుడయ్యాడు. ఆరోజంతా రేఖ, రామూ మా యిద్దరితో మాట్లాడలేదు. ఒకసారి నేను పలకరించబోతే నామీద యింతెత్తున ఎగిరి నా జట్టు లేనట్లు చెప్పేశారు.

సాయంత్రం నాలుగు గంటలయింది. ఇంకో అరగంటకుగానీ రేడియో సిలోన్‌లో తెలుగుపాటలు రావు. ఆరోజు పొద్దున్న వచ్చిన ఆంధ్ర వారపత్రిక విప్పి చదవడం మొదలుపెట్టాను. 4-25 అయింది. ఆటలకెళ్లిన రేఖా, రామూ పాటలు వినడానికని పరిగెత్తుకు వచ్చేశారు. వారిద్దరూ చాలా సంతోషంగా వున్నారు. "నిన్ను జయించేశాము" అన్నట్లున్నాయి వారి చూపులు. కానీ రామూ కళ్ళలో ఎక్కడో కొంత నిరుత్సాహం భయం తొంగి చూస్తున్నాయి. అయినా రాము సంతోషంగానే వున్నాడు. ఆరోజు సాయంత్రం అన్నయ్య నేను పార్కు కెళ్ళాం. రేఖని, రాముని రమ్మంటే మామీద కోపంచేత రామన్నారు. పార్కునుండి ఇంటికొచ్చేసరికి కాస్త ఆలస్యమయింది. అప్పుడే రేఖ, రామూ అన్నాలు తిని చదువుకుంటున్నారు. మేం రాగానే రాము నాదగ్గరకు పరుగెత్తుకొనివచ్చి "అక్కా నేనివేళ నీదగ్గరే పడుకుంటాను" అన్నాడు. "సరేలే" అన్నా నేను. అన్నయ్య అన్నం తిని తన గదిలోకి వెళ్ళిపోయాడు చదువుకోటానికి. రామూ నేను పడుకునే వరకూ నాకూడా తిరుగుతూనే వున్నాడు.

పదయేటప్పటికి అన్నయ్య గది లోకివెళ్లి పాలగ్లాసు టేబిల్‌మీద పెట్టి "ఇకపడుకో చాల్లే అన్నాయ్ చదువు, అప్పుడే పదయింది" అన్నాను.

"స్నైకేం. పరీక్షలు ముందుగా

---

రుల కష్టాల నెవరైనా. కనుక నా రాణిని, ఈరోజు మొదలు నా భవనంనుండి బహిష్కరిస్తున్నాను!"

రాణివైపు తిరిగి "నీవు మట్టెత్తి డబ్బు సంపాదించి, దానితో తిరిగి ఆ గుడిశెలన్నిటిని కట్టిస్తే గాని, నిన్ను రాజప్రాసాదంలో అడుగు పెట్టనీయను!" అన్నాడు రాజు. ★

 

అయిపోయాయి నీకు. అందుకని నన్ను పడుకోమంటావు. నాకు రేపే పరీక్ష. నన్ను కాస్త చదువు కోనీ."

నాకెందుకొచ్చిందని నోరుమూసుకొని పక్కమీదవాలాను. రామూకి, నాకూ నిద్రాదేవతఒడిలోకి ఆహ్వానం త్వరగానే వచ్చింది.

"ఖంగ్" మని చప్పుడయితే గబుక్కున మెలకువ వచ్చింది. మెల్లిగా కళ్లు తెరిచాను. కిందపడ్డ గ్లాసును తీసుకొని మంచినీళ్లు తాగుతున్నాడు అన్నయ్య.

"ఎంతయిందన్నాయ్ గంట"

"పన్నెండయ్యిందిలే పడుకో"

ఎంత ప్రయత్నించినా నిద్రరావడంలేదు. అయిదు నిమిషాలయింది. హఠాత్తుగా వీధితలుపు టకటక కొట్టిన శబ్దమయింది. గుండెల్లో రాయి పడింది. ఇంత అర్థరాత్రివేళ తలుపు తట్టేవారెవరు చెప్మా. మనింట్లో కాదేమోలే అనుకున్నా. మళ్ళీ కాసేపునిశ్శబ్దం. అదుగో మళ్లీ అదే టకటక ఎవరో నిజంగా మన తలుపే తట్టున్నారు. ఈ ఆలోచన రాగానే భయం పూర్తిగా నన్ను ఆవహించింది. పక్క గదిలోంచి అన్నయ్యగుర్రు సన్నగా స్పష్టంగా వినిపిస్తోంది. అబ్బ ఈ అన్నయ్యకు పక్కమీద వాలీవాలగానే నిద్ర ఎల్లా పడుతుందో. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. చీమ చిటుక్కుమన్నా వినిపించేటట్లుగావుంది. మళ్లీ తలుపుకొట్టిన చప్పుడు. ఒళ్లంతా చెమటలు పట్టేసింది. అసలే వూళ్లో ఈమధ్య దొంగలభయం ఎక్కువగా వుందిట.

ఇంతలో రామూ అటు ఇటు మెదిలాడు. కాస్త ధైర్యంవచ్చింది నాకు ఈసారి వీధి తలుపు కొంచెం గట్టిగా తట్టిన శబ్దం అయ్యింది. రామూ లేచి కూర్చొన్నాడు. రామూను చూచి "రామూ నేను లైట్ వేస్తాను. వీధిలో ఎవరో వచ్చారు కొంచెం కూర్చో బాబూ" అన్నాను. ఈమాటలు వినగానే రామూ ఉలిక్కిపడి "అవునక్కా నేను విన్నాను తలుపుకొట్టిన శబ్దం. బాబోయ్ వాడు దొంగే బాబూ నీవు లేవవద్దు "దొంగ దొంగ" అని అరుస్తూ నాచెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. ఈ కేకలకి నాన్నగారు లేచి లైటువేసి "ఏమిట్రా గోల" అన్నారు.

"వీధిలో ఎవరో తలుపు తట్టున్నారు నాన్నగారూ" అన్నాను.

"కాదునాన్నోయ్, వాడుదొంగ. లాకపోతే అర్థరాత్రెవరూ తలుపు కొట్టరు. వాడునిజంగాదొంగే, మీరు వెళ్ళకండి" అంటూ ఆరున్నొక్క రాగం అందుకున్నాడు రాము.

"దొంగేమిట్రా రామూ, పిచ్చెక్కిందా ఏం. ఎవరో పిలుస్తుంటే తలుపు తీయొద్దూ" అంటూ వీధి తలుపుకేసి పోబోయారు నాన్న.

రామూనన్నొదిలినాన్న కాళ్లుకు చుట్టేసుకొని "వద్దు నాన్నా వాడు దొంగ. నాకు బాగాతెలుసు. మీరు వెళ్ళొద్దు" అంటూ ఒకటే గోల. ఈ గొడవకి అన్నయ్య కళ్లునులుపుకొంటూవచ్చి "ఒరేయ్ రామూ, నిన్ను తన్నేస్తాను అర్థరాత్రివేళ నీగోలేమిట్రా? ఎవరో పిలుస్తుంటే నాన్నగారినితలుపుతీయొద్దంటావా? బుద్ధిలేదూ?" అంటూ వీధిలో లైట్ వేసి తలుపు తీయటాని కెళ్ళాడు, ఎందుకేనా మంచిదని చేతిలో కర్ర పెట్టుకుని. రామూ గట్టిగా ఏడుస్తూ పక్కమీదకెళ్లిపోయి ఒళ్ళంతా దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. రేఖ బిక్కమొహం వేసుకుని, నా చెయ్యిపట్టుకుని నుంచుంది. ఇంతలో అన్నయ్యతలుపుతీశాడు ఆశ్చర్యం. అరె. బాబాయ్! ఇందాకటి నుంచి తలుపు తట్టింది బాబాయ్ అన్నమాట. వాసుబాబాయ్ చేతిసంచీ పట్టుకుని ఇంటిలోపలికి అడుగు పెట్టాడు.

"పది నిమిషాల నుంచి తలుపు తట్టూవుంటే తలుపు తీయకుండా మీ గోలేమిట్రా" అంటూ

గదిలో అద్దెకున్న స్టూడెంటు నాలుగు నెలల అద్దె బకాయిపడ్డాడు. ప్రతి నెలా ఏదో అవాంతరంవచ్చి ఇవ్వలేకపోతున్నాడు. ఐదో నెలలో గృహయజమాని వచ్చి ఇలా అన్నాడు :

"ఇదిగో అబ్బాయ్! ఏదో విధంగా రాజీపడదాం మనం. రెండునెలల అద్దె మాత్రం నువ్వు బాకీలేవనే సరిపెట్టుకుంటాను ఏమంటావ్?"

"మంచిదేనండి. మిగతా రెండునెలలూ బాకీలేనని నేను సరిపెట్టుకుంటాను," అన్నాడు స్టూడెంటు.

బాబాయ్‌మాట విని దుప్పటి తొలగించి రామూ తొంగి చూచాడు. వాడి కళ్లు ఆశ్చర్యంతో మిలమిల లాడాయ్.

"ముందు ఉత్తరం వ్రాయకుండా వస్తే యిల్లాగే జరుగుతుందనుకో బాబాయ్. నరేకాని మ్రెడాస్ బండి లేటేమిటి?" అన్నయ్య తన గదిలోకి వెళ్లిపోతూ అన్నాడు.

"అప్పన్నా. అరగంట లేటు. ఉత్తరం వ్రాయటానికి తీరిక లేకపోయింది. అయినా, దొంగ అంటూ గోలపెట్టారెందుకర్రా."

"అది మా రామూ నడగరా వాసూ" ఆవలిస్తూ అన్నారు నాన్నగారు.

"ఒరేయ్ రామూ, రేఖా యిల్లా రండర్రా మీ కోసం బిస్కట్లు చాకలెట్లు తెచ్చాను తీసుకోండి" అన్నాడు బాబాయ్ సంచీలోని బిస్కట్ల డబ్బా అందుకుంటూ. రామూ, రేఖా అవి తింటూ పక్కల మీద వాలారు. అందరూ ఆరాత్రి గొడవ తలుచుకొని నవ్వుకుంటూ నిద్రలోపడ్డారు.

ఆ రాత్రి రామూ చేసిన గొడవకి కారణం మర్నాడు పొద్దున రేఖ చెప్పిందాకా తెలీలేదు. రేఖకి, రాముకి మేము వాళ్ల వారఫలితాలు చెప్పకపోవడం వల్ల కోపంవచ్చి వాళ్ల నక్షత్రాలు అమ్మని అడిగారుట అమ్మ చెప్పిందట. వాళ్ల స్నేహితులింట్లో వారఫలితాలు పేపర్లో చూసుకున్నారుట. రామూ నక్షత్రానికి ఆ వారంలో దొంగలభయం వున్నదని పేపర్లో రాసివుందిట. అందుకని రామూ ఆరాత్రి అంతగోలచేశాడు. అదీ అసలుగొడవ. 

## ఆగాఖాన్

(3-వ పేజీ తరువాయి)

ఉంచడానికే ఇదంతా" అని వెంటనే ఆగాఖాన్ సమాధానం

ఆయన మొత్తం నాలుగు పెళ్ళిళ్లు చేసుకున్నారు. మొదటిభార్య ఆయన బంధువర్గంలోని స్త్రీ రెండోభార్య ఇటాలియన్ మహిళ ఆమె కుమారుడే సినిమాతార రీటా హేవర్తును పెండ్లాడిన ప్రిన్సు ఎలైఖాన్ (44 సం॥) మూడోభార్య ఫ్రెంచి వనిత ఆమె కుమారునిపేరు ప్రిన్సు సద్రుద్దీన్. నాలుగోభార్య, అంటే ఇప్పుడున్న భార్య ఫ్రెంచి వనితే ఈమెకు పిల్లలులేరు

### రాజకీయ జీవితం

ఆగాఖాన్ బాగా విద్యావంతుడు, మేధావి; అటు ఆధ్యాత్మిక రంగంనుంచి ఇటు గుర్రప్పందాల రంగందాకా అనేక వ్యాపకాలున్న మనిషి రాజకీయంగా మిత వాది అంటే, వివిధ దేశాల రాజకీయ వ్యవస్థలలో పరిస్థితులు ఎలా ఉన్నవి అలా ఉండడమే మంచిదనే వాదానికి చెందినవారన్నమాట అందుచేత సహజంగా ఈయన భారత రాజకీయాల్లో బ్రిటిష్ ప్రభుత్వానికే సన్నిహితులయ్యారు భారత దేశ విభజనకు కారణమైన ముస్లింలీగ్ స్థాపనకు ఈయన తోహదం చేశారు ముస్లిములకు ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పడడంకూడా కొంత వరకూ ఈయనవల్లనే మొదటి ప్రపంచ యుద్ధం కాలంలో ఈయన బ్రిటిష్ ప్రభుత్వానికి చాలా సహాయం చేశారు రౌండు టేబిల్ సమావేశానికి భారత "ప్రతినిధి" గా హాజరై బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి అనుకూల ప్రచారం చేశారు. నానా జాతి సమితి సమావేశ మొకదానికి అధ్యక్షుడుగా పనిచేశారు. ఈయన విధేయతకు మెచ్చి బ్రిటిషు ప్రభుత్వం "హిజ్ హైనెస్" బిరుదు, పదకొండు ఫిరంగి కాల్పుల గౌరవంకూడా ప్రసాదించింది రెండో ప్రపంచ యుద్ధంలోకూడా ఈయన బ్రిటిషువారికి చాలా సహాయం చేశారు

రౌండ్ టేబిల్ సమావేశాన్ని గూర్చి ప్రస్తావిస్తూ పండిట్ నెహ్రూ అప్పట్లో ఇలా అన్నారు: "సామ్రాజ్యవాదులు, భూస్వాములు, పెట్టుబడిదారులు, పారిశ్రామికులు, మత, కుల వాదులు అంతా కలిసిన ఈ సమావేశంలో బ్రిటిష్ ఇండియన్ ప్రతినిధి వర్గానికి అగాఖాన్ నాయకత్వం సబబుగానే ఉంటుంది. ఎందుకంటే ఆయన సామ్రాజ్యవాది, భూస్వామి, పెట్టుబడిదారు, పారిశ్రామికుడు, మత కుల వాది అన్నీని. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి ఆయన ప్రతినిధిగా సరిగా సరిపోయేవారు చిత్రమేమిటంటే ఆయన్ని భారత ప్రజాప్రతినిధిగా పంపించారు!"

విక్టోరియారాణితో విందారగించి, ఫ్లారెన్సునైటింగేల్ తో 'టీ' త్రాగిన ఆగాఖాన్ జనీవా సరోవర తీరానగల స్వగృహంలో మరణించారు ఈయనకు ఈజిప్టులోని అస్వాన్‌వద్ద గోరీ కడతారట

ఆగాఖాన్ తమ తరవాత 49 వ ఇమామ్‌గా మనవడు ప్రిన్సు కరీంఖాన్‌ను నియమించాలని వీలునామా వ్రాశారు తమ గుఱ్ఱాలసాలలకు అధిపతి పెద్దకొడుకు ప్రిన్సు ఎలైను నియమించారు.

★

## మనం, మనసైన్యం

(5-వ పేజీ తరువాయి)

యుద్ధ వ్యూహానికి సంబంధించినవి తప్ప మిగతా పరీక్షా పత్రాలన్నిటికీ ఈ సైనిక విద్యాశాఖ ఆఫీసర్లుకూడా జవాబులు వ్రాయవలసి వుంటుంది. కమిషన్ సర్వీస్‌లో 1956 అక్టోబరు 31 వ తేదీ నాటికి 13 ఏళ్లపాటు కెప్టన్లగాను, ఆరేళ్ళపాటు లెఫ్టినెంట్లగాను పనిచేసిన వారుమాత్రం ప్రమోషన్లకోసం ఈ పరీక్షకు కూర్చోనవసరం లేదు శాశ్వత కమిషన్ ఉద్యోగాలలో పని చేస్తున్న నాన్-రెగ్యులర్ ఆఫీసర్లు కెప్టెన్ పదవి చేరుకోడానికి రెండేళ్ళ సర్వీస్ మాత్రమే మిగిలివున్న వాళ్లు-కూడా ఈ పరీక్షకు హాజరు కానవసరంలేదు. 1959 ఏప్రిల్ మే నెలలో ఉద్యోగ విరమణ వయస్సు వచ్చేవారికీ ఈ మినహాయింపు వర్తిస్తుంది ఈ ప్రమోషన్ పరీక్షలో సైనిక విద్యాశాఖ ఆఫీసర్లు విద్యా విషయిక మనస్తత్వ శాస్త్రం, సైనిక విద్యాభివృద్ధి అవకాశాలు, పారసత్వ పరిజ్ఞానం మొదలైన విషయాలలో పరీక్షా పత్రాలకు జవాబులు వ్రాయవలసి వుంటుంది

* * *

భారత ప్రభుత్వ యాజమాన్యాన నడుస్తున్న జీవిత భీమాసంస్థ సైనిక, నౌకా శాఖలలో పని చేస్తున్న వారందరికీ ఏ విధమైన అదనపు రుసుమూ వసూలు చేయకుండానే బేషరతుగా భీమా పట్టాలు ఇచ్చే రివాజు వున్నది ఈ సౌకర్యాన్ని పారాషూట్ దళాలలోనూ, గ్లైడర్ దళాలలోనూ పని చేస్తున్న వారికికూడా విస్తరింప జేయాలని ప్రభుత్వం నిర్ణయించింది

సైనిక నౌకా శాఖలలో పనిచేసేవారు భీమాపట్టాలను పొందేముందు, ఉత్తరోత్తరా ఎప్పుడూ వైమానిక, పారాషూట్ దళాలలో పనిచేసే ఉద్దేశం లేదని హామీ ఇవ్వవలసిన అవసరం వుండేది. ఇప్పుడది పోయింది 1957 ఫిబ్రవరి 19 నుంచి అమలులోకి వచ్చిన కొత్త ఉత్తర్వు ఫలితంగా సైన్య శాఖలో పనిచేస్తూ ఇతరత్రా అనుభవమున్న వారిని, అవసరమనితోస్తే, సైన్యంలోనే ఏ శాఖలోకైనా మార్చడానికి అధికారం ఏర్పడుతున్నది ★

# సినిమా

## ముడిఫిలిం కొదువ

ముడిఫిలిం దిగుమతిపై ప్రభుత్వ నిర్ణయం ఫిలిం పరిశ్రమలో సర్వత్రా సంచలనం కలిగించింది. ముఖ్యంగా ఫిలిం కావలసినంత కొనుక్కొని నిల్వ చేసుకునే స్తోమతు లేని చిన్న నిర్మాతలు చాలా ఆందోళన చెందుతున్నారు. కొందరు దీనివల్ల పరిశ్రమ దెబ్బతింటుందంటున్నారు. మరికొందరు ఇది ఒకందుకు మంచిదే అంటున్నారు. చిత్రాల నిడివి ఈవిధంగానైనా తగ్గుతుందన్న నమ్మకంతో. ఇది నమ్మకం కాదు. కేవలం అపోహ అని అభిజ్ఞులు కొందరు కొట్టిపారేస్తున్నారు.

ఈ దిగుమతి వ్యవహారాలకు సంబంధించిన నియమ నిబంధనలు ఆగస్టునెలలో వెలువడే వరకు ఖచితంగా ఏం చెప్పలేమంటున్నారు ఆశావాదులు.

"ఇంకా చెప్పేందుకేముంది నూటికి ఇరవైఐదు వంతులు కోత ఖరారుగదా" అంటున్నారు మరొకవర్గం వారు

ఈ సందట్లోనే సరకు నిలవచేసి బ్లాక్ మార్కెట్ వ్యాపారం సాగించే ప్రమాదం నివారించడానికి ఫిలిం నిర్మాతల సంఘం పెద్దలంతా మార్గాలూ మార్గాంతరాలూ ఆలోచిస్తున్నారు.

ఒక కేంద్రసంఘం, దానికి అనుబంధంగా ప్రాంతీయమండలులూ నెలకొల్పి, వచ్చే ఫిలిమును ఎవరెవరికి ఎలా సరఫరాచేయాలో నిర్ణయించి కట్టుదిట్టాలు చేయాలని ఒక పథకం వేశారు

ఈ విషయమై ప్రభుత్వం పరిశీలన జరుపుతోంది. పరిశ్రమ ప్రతినిధులు ఏదో ఒక ఏర్పాటుచేసుకోనకపోతే, ప్రభుత్వమే అందుకు పూనుకోవలసి వస్తుంది ఈ రెండో మార్గం పరిశ్రమలో చాలమందికి నచ్చినట్లు కనబడదు

ఈ వ్యవహారాలకు సంబంధించిన సమస్యలన్నిటి గురించి అఖిలభారత ఫిలిం ఫెడరేషన్ కార్యవర్గం గతవారం మద్రాసులో సమావేశమై చర్చించింది.

### '13 వేలు చాలు'

చిత్రాల నిడివి పదమూడు వేల అడుగులకు పరిమితం చేయాలన్న సూచనను వీరు పరిశీలించినట్లు తెలిసింది. ఇదికాక, ఒక్కొక్క చిత్రం విడుదలకై తీయించే ప్రతుల సంఖ్య నూరూ నూటయాభై ఉండకుండా, గరిష్ఠ ప్రమాణం నిర్ణయించుకోవడం మంచిదని కూడా కొందరు సూచించారు. 24 ప్రతులు మించకుండా ఉంటే బాగుంటుం దన్నారట.

దక్షిణభారతానికి సంబంధించినంతవరకు రెండో సూచన ఆమోదయోగ్యం అయితే కావచ్చుగాని, చిత్రాల నిడివి తగ్గించడం అనేది తేలిక విషయం కాదు.

"అలాటిపని వ్యాపార రీత్యా ఆత్మహత్యా సదృశం" అని ఒక నిర్మాత అన్నారు.

"బొంబాయి చిత్రాలకు ఉన్న మార్కెట్ పెద్దది. వారు పదమూడు పధ్నాలుగు వేలఅడుగుల నిడివితో చిత్రాలు తీసినా చెల్లుతుంది. మన సంగతి వేరు. మన ప్రేక్షకులూ, వారి అవసరాలూ వేరు. పదిహేడు వేల అడుగుల



చందమామావారి "దొంగల్లో దొర" చిత్రంలో ఇ. వి. సరోజ.



భారత చలనచిత్ర సమాఖ్య సభ్యులగౌరవార్థం దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలివారు మద్రాసులో జూలై 10 వాడు సత్కారవిందుచేశారు. ఫిలింఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎం. బి. బిల్లిమోరియా, శ్రీమతి దేవికారాణి, మద్రాసు మేయరు శ్రీ శ్రీనివాసన్, ప్రధాన న్యాయమూర్తి, శ్రీ పి. వి. రాజమన్నారు.

## ముడిఫిలిం పొదుపు ★

లేక పోతే, సామాన్య జనం 'చిన్న సినిమా' అని కొట్టిపారేసే ప్రమాదం ఉంటుంది" అని ఒక ప్రముఖ దర్శక నిర్మాత అన్నారు

* * *

ఒకొక్కసారి చిక్కులు వచ్చినపుడు, అవి పెట్టదలచుకున్న ఇబ్బందులు పెట్టేసి, పోయేటపుడు, ఉన్న కొన్ని సమస్యల పరిష్కారానికి దారిచూపి మరీ పోతాయి. మామూలు పరిస్థితులలో ఓపట్టాన జరగని నిర్ణయాలను చటుక్కున జరిగేట్లు చేస్తాయి. వెనకటికి, యుద్ధం రోజుల్లో ముడిఫిలిం



కళ్యాణివారి "అక్కచెల్లెళ్లు" చిత్రంలో ఒక సన్నివేశం.

సరఫరా దెబ్బ తినడం అప్పుడు చిత్రాల నిడివి పదకొండువేల అడుగులకు పరిమితం కావడం జరిగింది. అందరూ అదే నిడివి చిత్రాలు తీయడంతో, కొత్తచిత్రాలమధ్య (ఈ విషయంలో) పోటీ ఉండేదికాదు దరిమిలా కంట్రోలు పోవడంతో మళ్ళీ యథాస్థితికి వచ్చాము.

ఇప్పటి పరిస్థితుల దృష్ట్యా, ఈ'పొదుపు' ఉద్యమం ఇప్పట్లో పోయేది కాదనిపిస్తుంది

ఇప్పుడూ, నిడివి తగ్గాలన్న సూచన వచ్చింది. పదేళ్ళనాడు లేని ఐకమత్యం ఈనాడు పరిశ్రమలో ప్రవర్తిల్లుతోంది. ఈ సమయంలో పరిశ్రమకు సంబంధించిన వారంతా సంప్రతించుకొని మన చిత్రాల నిడివిని పన్నెండువేలకు కాకపోతే, ఉన్నంతలో చెప్పుకోతగ్గ మేరకైనా తగ్గించే మార్గం నిర్ణయించుకోవడం వాంఛనీయం

దక్షిణభారతంలో అనేక చిత్రాల జయాపజయాల కారణాలను, పరిశీలించి చూడగా చిత్రం చాలా పొడుగ్గా ఉండడం, విజయం కన్న, అందుకు విరుద్ధమైన ఫలితాలకే దోహదం చేస్తున్నట్లు తేలుతోంది.

'పిక్చరు బావుంది కాని బాగా పొడుగు' అన్న విమర్శ "సామాన్య ప్రజానీకం" నోట వినబడడం సామాన్యం అవుతున్నట్లు తేలుతోంది.



# చలనచిత్రనిర్మాత దృక్పథం

## —శ్రీ బి. ఎన్. రెడ్డి వివరణ

['వాయిస్ ఆఫ్ అమెరికా' కార్యక్రమం లో ప్రసారితం]

కె. జె. మోహన్ నమస్కారం అండి మీరు అందరికీ బి ఎన్. రెడ్డిగారనే తెలుసు. మీ పూర్తి పేరు ఏమిటండీ?

బి.ఎన్. రెడ్డి బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి.

ప్రశ్న: మీ స్వగ్రామ మేదండి?

జవాబు కడప జిల్లాలోని 'కొత్తపల్లి.' కానీ, మా తండ్రిగారు వ్యాపారనిమిత్తంగా చాలాకాలం క్రిందట మద్రాసు చేరారు. నా 9 వ సంవత్సరంనుండి నా నివాసం మద్రాసైపోయింది

ప్ర. పాతిక సంవత్సరాలక్రితం మీతో నాకు ప్రప్రథమంగా పరిచయం కలిగి నప్పుడు, మీరు ఎక్కౌంటెన్స్ అండ్ ఆడిటింగ్ పరీక్షలో ఉత్తీర్ణులై, ఒక కంపెనీలో ఆడిట్ అప్రెంటిస్ గా పనిచేస్తున్నట్టు నాకు గుర్తు...నిజమే కదండి?

జ: అవును నిజమేనండి.

ప్ర: అయితే మరి అందుకు పూర్తిగా భిన్నమైన ఈ చిత్రకళారంగంలోకి మీరు ప్రవేశించడానికిగల కారణమేమి టంటారు?

జ: ఏముంది? మామూలుగా హైస్కూల్, కాలేజీల్లో చదివే రోజుల్లో నాటకాలపై నాకున్న వ్యామోహమే దీనికి కారణం.

ప్ర ఆమాత్రం వ్యామోహం ఉన్నా, ఆడిటర్ గా ప్రాక్టీస్ చేస్తూ కళారాధన కూడా చేస్తూండొచ్చుకద పూర్తిగా దానికి స్వస్తి చెప్పి, ఈ ఫిలింరంగంలోకి రావడానికి గల పరిస్థితులు ఏమిటో చెబుతారా?

జ: ఆడిటింగ్ వృత్తికి పూర్తిగా స్వస్తి చెప్పాలనే ఉద్దేశం మొదట్లో నాకు లేదు. 1934 సంవత్సరంలో నేను 'అగ్ఫా ఫొటో కంపెనీ' అకౌంట్స్ ఆడిట్ చేస్తూండేవాణ్ణి ఈ ఆఫీసుకు దగ్గరలోనే స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారి 'ప్రజామిత్ర' ఆఫీసు వుండేది ప్రతిరోజూమధ్యాహ్నం విశ్రాంతి సమయంలో అక్కడికి వెళ్లేవాణ్ణి రామబ్రహ్మంగారు నాకెంతో సన్నిహితులయారు వారి ఆఫీసులో చాలమంది సాహితీపరులతో నాకు పరిచయం లభించింది. ఆ పరిచయాలలో కొన్ని గాఢమైన [illegible] నిలిచిపోయినవి రామబ్రహ్మం [illegible]ప్పట్లో చిత్రం నిర్మాణం చేస్తున్న [illegible] పిక్చర్స్, సరస్వతీటాకీస్ లతో సంబంధముండేది చలనచిత్రాలకు సంబంధించిన విషయాలు వారు చెప్పగా వింటుండేవాణ్ణి. వారిద్వారా ఆనాటి చలనచిత్ర పరిశ్రమకు చెందిన కొందరు పెద్దలతో నాకు పరిచయం కలిగింది అలా పరిచయమైనవారిలో హెచ్. ఎం. రెడ్డిగారు ఒకరు నేను సినిమారంగం లోకి రావడానికి వీరే ప్రధాన కారకులు. శ్రీ హెచ్. ఎం. రెడ్డిగారు చిత్రనిర్మాణం సంకల్పించి ఆర్థికంగా నా సహాయం



కోరారు. లలితకళలమీద, ముఖ్యంగా నాటక కళమీద నాకున్న ఉత్సాహం పురస్కరించుకొని వీరితో 'సరే' నన్నాను. ఆతరువాత నేను, ఆయనా, నా మిత్రులు కొందరితో కలిసి "రోహిణీ పిక్చర్స్ లిమిటెడ్" స్థాపించాము. "గృహలక్ష్మి" చిత్రం తయారు చేశాము. ఆ చిత్రం 1937 లో విడుదలయింది.

ప్ర గృహలక్ష్మి చాలా విజయవంతమయిన చిత్రం. అలాంటప్పుడు రోహిణీ పిక్చర్స్ లోనే మీరుండి, ఇంకొన్ని చిత్రాలు నిర్మించకుండా, వాహినీ పిక్చర్స్ స్థాపించవలసిన అగత్యం ఏమొచ్చిందండి?

జ ఆదర్శాలలోను, దృక్పథాలలోను నాకూ శ్రీ హెచ్ ఎం రెడ్డిగారికి అంగీకారం కుదరలేదు, ఈ కారణంగా రోహిణీ సంస్థనుండి క్రమేపీ నా సన్నిహితులు విడిపోయాము. 1938 సంవత్సరంలో వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ పేరిట వేరేసంస్థను స్థాపించాము. వాహినిలో అన్ని బాధ్యతలు నేనే నిర్వహించడం జరిగింది. ఈ కారణంగా ఆడిటింగ్ వృత్తికి పూర్తిగా స్వస్తి చెప్పవలసివచ్చింది

ప్ర "మీరు నిర్మించిన చిత్రాలు ఉత్తమ కళాఖండాలుగా పండిత పామరుల చేత ప్రశంసలు పొందినప్పటికీ, ఆర్థికంగా విజయవంతం కాలేదన్న వాదొకటి వుంది. అది ఎంతవరకు నిజమండి?

జ "నా చిత్రాలకు ఆర్థిక విజయం లేకుంటే యేనాడో తిరిగి ఆడిటర్ గా ప్రాక్టీస్ పెట్టి యుండేవాణ్ణి. ఆర్థిక విజయమంటే కొందరి దృష్టిలో పెట్టుబడికి మించి అనేకరెట్లు ఆదాయం రావాలని అభిప్రాయం. పెట్టుబడితో పాటు తగుపాటి ఆదాయం వచ్చినా అది ఆర్థిక విజయం అనే నేను భావిస్తాను నేను 'వాహినీ'కి నిర్మించిన చిత్రాలు ఆరు. ఆదాయ వ్యయాలు లెక్కవేస్తే నా చిత్రాలు వాహినీసంస్థకు మంచి లాభాలే తెచ్చిపెట్టాయి.

ప్ర. మీరు నిర్మించిన చిత్రాల్లో మీ దృష్టిలో ఉత్తమ చిత్రం ఏదండి?

జ: నేను తీసిన చిత్రాల్లో నాకు సంతృప్తిని కలిగించిన చిత్రం "బంగారు పాప."

ప్ర ఈ 'బంగారు పాప' చిత్రానికే కదాండి, 1955 సంవత్సరపు ఉత్తమ తెలుగు చిత్రంగా, రాష్ట్రపతి రజిత పతకం బహూకరింపబడింది?

# చలనచిత్రనిర్మాత దృక్పథం

జ : అవునండి.

ప్ర : 1938 సంవత్సరంలోనే 'వాహిని' స్థాపించారుకదా, ఇంతవరకు మీరు ఆరు చిత్రాలుమాత్రమే నిర్మించడానికిగల కారణ మేమిటండి?

జ : దీనికి ముఖ్యంగా రెండు కారణాలున్నాయి. ఒకటి ఆదినుండి నేటిదాకా సంస్థ నిర్వహణాబాధ్యత, నాపై ఉండడం. రెండు: 1945 నుండి 1949 దాకా వాహినీ స్టూడియో నిర్మాణబాధ్యత. ఇవి కారణంగా ఎక్కువ చిత్రాలు నిర్మించలేకపోయాను.

ప్ర : ఆర్థికదృష్టికంటే, కళాదృష్టి ఆదర్శంగా తీసుకుని మీరింతవరకు చిత్రాలు నిర్మిస్తూ వచ్చారు. అందువల్ల అవి పామరుల కంటే పండితులనే ఎక్కువగా ఆకర్షిస్తున్నాయి అనే అభిప్రాయం ప్రజల్లో ఉంది. మీ రీ ఆదర్శాలకే కట్టుబడి వుంటారా? లేక పామరులనుగూడా ఆకర్షించి, ఇంకా ఎక్కువ ఆర్థిక విజయం సాధించగల చిత్రాల నిర్మాణానికి పూనుకుంటారా?

జ : భలే ప్రశ్న వేశారండి! పండిత పామరులను సంతోషపెట్టాలనే నేను చిత్రాలు తీస్తున్నాను. కళాదృష్టి న్నా, ఆర్థిక దృష్టికన్నా ఇంతవరకూ నేను నిర్మించిన చిత్రాలలో "నాకానందం కలిగించే దృక్పథంతోనే, నిర్మాణకృషి సాగించాను. ఈనాడు విచిత్రమైనా ఆర్థికంగా గొప్ప విజయం సాధించినప్పుడు ఆచిత్రాన్ని 'పామరజనాన్ని దృష్టిలోవుంచుకొని వారిని సంతోషపెట్టడానికి ప్రత్యేకంగా తీశారు' అని అంటారు ఆ చిత్రమే కారణాంతరాల వల్ల పెద్ద లాభాలు ఆర్జించలేకపోతే, "ఇది క్లాస్ పిక్చర్, పండితులకు నచ్చే లాగు తీశారు" అంటారు యదార్థంలో ఏచిత్రం కానీ పండిత పామరులను మెప్పించినప్పుడే ఆ చిత్రనిర్మాత కృషి ఫలించినట్లు భావించాలి అందరు నిర్మాతలు లాగా నేనుకూడా నా చిత్రాలు గొప్ప ఆర్థిక విజయం సాధించాలనే నిర్మిస్తున్నాను. గొప్ప ఆర్థిక విజయానికి, చిత్రం మంచిచెడ్డలతోబాటు ప్రదర్శనశాల, పోటీగానడిచే ఇతరచిత్రాలు, ప్రజల నిత్యజీవితంలో పనిపాటల సమయం, మొదలగు అంశాలు ఎన్నో లెక్కించాలి. వీటితోబాటు కొంత అదృష్టంకూడా కలసి రావాలి ఈనాడు సినిమా ప్రేక్షకులలో అధికసంఖ్యాకులు పామరజనం ఈ ప్రేక్షకులే నిర్మాతకు పోషకులు. ఈ సత్యాన్ని గుర్తించి నేను నిర్మాణం సాగిస్తున్నాను. అత్యధిక ప్రేక్షకులను మెప్పించాలనే నా సంకల్పం నీచమైన అభిరుచి-సభ్యతకు దూరమైన సంఘటనలు నాకు రుచింపవు. ఆమాట కొస్తే పామరజనులుకూడ వీటిని హర్షించరు. నా చిత్రాలు ఎక్కువగా పామరజనాన్ని ఆకర్షించలేకపోతున్నవంటే, దీనికి కారణం, నా ప్రయత్నలోపం అనే కంటే-వారిని మెప్పించే కల్పనాశక్తి, చాకచక్యం నాలో తక్కువ కావచ్చు. ముందుముందు ఇంకా ఎక్కువ ప్రయత్నించి, మీరు కోరినట్లు పామరజనాన్ని పరిపూర్ణంగా మెప్పించడానికి ప్రయత్నిస్తానని మనవి చేసున్నాను. పామరజనాన్ని పాటించకుండా నిర్మాణం సాగిస్తున్నానన్న అపో[illegible] పడకండి.



బొంబాయిలో జరిగిన ఒక ఫిలిం ప్రదర్శనలో దిలీప్ కుమార్‌ను చుట్టుముట్టిన అభిమానులు, రేడియో విలేఖరులు.



సెల్వకోటీ పిక్చర్సువారి రెండవ చిత్రానికి ("రత్నకిరీటం") నవయుగ ఫిలింస్ అధిపతి శ్రీ శ్రీనివాసరావు ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు.

# ★ హైదరాబాద్‌లో 'బడాభాయ్' హడావుడి ★

హైదరాబాద్ నగరంలో ఈ మధ్య ఒకరోజు ఉదయం హఠాత్తుగా రిక్షాలన్నీ "నల్లపూసలు" అయి ఊరుకున్నాయి.

'ఏమిటి గిరాకీ' అని ఎవరేనా ఆరా తీసి ఉంటే, రిక్షాలూ, వాటి (తాత్కాలిక) అధికారులూ 'బడాబాయ్' ఫిలిం షూటింగ్ హడావుడిలో ఉన్నట్టు తెలిసేది. ఆ చిత్రం దర్శక నిర్మాత కె. అమర్ నాథ్, తన బృందాన్ని వెంటబెట్టుకుని హైదరాబాద్ వెళ్ళి మూడు వారాలు మజిలీ చేశాడు. కథలో ప్రధానమైన కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలను ఆయన అక్కడ చిత్రించాడు. ఆ సన్నివేశాలకు ప్రధానమని రెండువందల రిక్షాల్లను కిరాయికి పిలిచాడు. ఆయన పిలిచినవి రెండొందలే అయినా, మిగతా రిక్షాలవారు చాలమంది, 'ఇంకో పది రిక్షాలు అవసరం కాకపోతాయా, తమకూ అవకాశం రాకపోతుందా' అన్న ఆశతో షూటింగ్ జరిగేచోటుకు వెళ్ళి అక్కడే తిష్టవేశారు. అదే బాగుందని రచయిత ప్రభాకర్, దర్శకుడు అమర్ నాథ్, వచ్చినవారిని మర్యాద చేసి, రిక్షా లాగేవారి జీవన విధానాలకు సంబంధించిన మంచి చెడ్డలూ, వాళ్ళమాట తీరూ తెన్నూ తెలుసుకుని, కావలసిన విషయాలపై సలహాలు తీసుకున్నారు. కార్యక్రమం అనుకోనంత హుషారుగా, చురుకుగా సాగిపోయింది.

అమర్‌నాథ్ బృందం తిరిగి బొంబాయి వెళ్ళిపోయింది. వాళ్లు వెళ్ళిన మూడో నాటికల్లా ముగ్గురు వ్యక్తులు అతనింటికి వచ్చి నమస్కరించి, తాము హైదరాబాద్‌లో రిక్షాలు లాగేవారలని పరిచయం చేసుకున్నారు. సినిమాలో వేషం ఇవ్వమని దరఖాస్తుకూడా అందచేసుకున్నారు.

"ఎందుకు ఇందులో చేరాలనుకున్నారు" అని అడిగాడు దర్శకుడు.

ఎందుకేమిటి? ఇందులో పనిచేయడం బాగా లాభసాటి. ఊళ్ళో రిక్షాలాగితే గిట్టేదానికన్న సినిమాలో రిక్షాలాగితే ఎక్కువ దొరుకుతుంది.

'వసంత లాగేతలికి చాలు చాలు కట్ అంటారు' కష్టం తక్కువ అని తేల్చారు వాళ్లు

అమర్‌నాథ్ వారు చెప్పింది పూర్తిగా విని, తను చెప్పదలచుకున్నది జాగ్రత్తగా నచ్చచెప్పి, వాళ్ళను మెల్లిగా హైదరాబాద్ పంపించి వేశాడు

మూడోనాటికల్లా మరో నలుగురు వచ్చారు. అలా రాలేనివాళ్లు ఉత్తరాలు రాసుకున్నారు.

అలాటివాళ్ళంతా బొంబాయి నగరం వచ్చి డబ్బులేక చాల అవస్థపడతారు. అందుకని తొందరపడి అలాటిపని చేయొద్దని నచ్చచెబుతూ అమర్ నాథ్ చాలమందికి స్వయంగా ఉత్తరాలు వ్రాశాడు.

'బడాభాయ్' చిత్రంలో అజిత్, కామినీ కౌశల్, అమితే, కుంకుం, అనంత్ కుమార్, నజీర్ హుసేన్ జయంత్, రమేష్ నటిస్తున్నారు. రచన కె. ప్రభాకర్ సంగీతం నాషాద్ ఛాయాగ్రహణం వసంత్ బువా.

★

## సినిమా వార్తలు

రిపబ్లిక్ పిక్చర్స్‌వారి తొలిచిత్రం సగం పూర్తి అయింది. ఆద్యంతం హాస్యరసప్రధానంగా రూపొందుతున్న ఈ చిత్రానికి 'పెళ్ళిసందడి' అని పేరుపెట్టారు. రచయిత సముద్రాల జూనియర్. దర్శకుడు యోగానంద్.

నాగేశ్వరరావు, అంజలీదేవి, గుమ్మడి, సి. ఎస్. ఆర్., చలం, రమణారెడ్డి, డా॥ శివరామకృష్ణయ్య, పి. హేమ[illegible], సురభి బాలసరస్వతి మొదలగువారు పాల్గొంటున్నారు.

ఘంటసాల వెంకటేశ్వరరావు సంగీతం సమకూర్చుతున్నారు. నృత్యదర్శకుడు వసుమర్తి కృష్ణమూర్తి.

నిర్మాత చోడవరపు సీతారాం. ఈ చిత్రం దీపావళి కానుకగా విడుదలకావచ్చునని తెలుస్తోంది.

### వినాయకచవితి

అశ్వరాజ్ వారి "వినాయకచవితి" ఆగస్టు మొదటివారంలో విడుదల కాగలదనుకొంటున్నారు.

ఎన్. టి. రామారావు, జమున, గుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు, రాజనాల ప్రభృతులు నటిస్తున్న ఈ చిత్రానికి సముద్రాల రాఘవాచార్య రచన, దర్శకత్వం నిర్వహించారు.

నిర్మాత కె. గోపాలరావు.

### సారంగధర

ఆగస్టులో విడుదలకాగల మరొక చిత్రం మినర్వాపిక్చర్స్‌వారి "సారంగధర". భానుమతి, రాజసులోచన, ఎన్. టి. రామారావు, రంగారావు, రేలంగి, గుమ్మడి, ముక్కామల, చలం, మిక్కిలినేని మొద



"టీ హౌస్ ఆఫ్ అగస్టు మూన్" లో గ్లెన్‌ఫోర్డ్, మార్లాన్ బ్రాండో

## శ్రీ నాగేశ్వరరావుకు ఆంధ్రలో సన్మానాలు

నాగేశ్వరరావు చలనచిత్ర వజ్రోత్సవాన్ని పురస్కరించుకొని, ఆంధ్రలో పలుచోట్ల ఆయనకు సముచితరీతిని సన్మానం చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. కొన్ని పటణాలలో పురపాలకసంఘాల అధ్వర్యాన అధికారికంగా పౌరసన్మానాలు జరుగుతాయని, పురపాలకసంఘాలు లేని విజయవాడ, గుంటూరులలో స్థానిక ప్రముఖులు అధ్వర్యం వహించి సభలు జరుపుతారని తెలిసింది

వజ్రోత్సవాలు ఈనెల 28 న జరుగుతాయన్న విషయం విదితమే

ఈ సన్మాన సభలు, వీటితరువాత ఆగస్టు నెలలో ఏర్పాటు అవుతున్నాయి.

మొన్న 14 వ తేదీన విజయవాడ పుర ప్రముఖులంతా, ఆంధ్ర వాణిజ్య, పరిశ్రమల మండలి అధ్యక్షుడు శ్రీ బచ్చు వెంకటేశ్వర్లు అధ్యక్షతన విజయాటాకీస్‌లో సభ జరిపారు. కళ, వాణిజ్య, పారిశ్రామికరంగాలకు చెందినవారంతా, మాట్లాడుతూ నాగేశ్వరరావు ప్రతిభాసంపత్తిని ప్రశంసించారు.

అనంతరం ఆగస్టు 11 వ తేదీన ఆయనకు ఘన సన్మానంచేయాలని తీర్మానించారు. ఇందుకు సన్నాహాలు చేయడానికై శ్రీ జి. ఎస్. రాజు అధ్యక్షుడుగా శ్రీ పి జి. వెనర్జీ ప్రధాన కార్యదర్శిగా శ్రీ చెలసాని ఉమామహేశ్వరరావు కోశాధికారిగా మరి 29 గురు సభ్యులుగా ఒక సన్మాన సంఘాన్ని నెలకొల్పారు

వివిధ పట్టణాలలో సన్మానాలు అందుకోవడానికై నాగేశ్వరరావు ఆగస్టు మొదటి వారంలో బయలుదేరవచ్చు

ఈలోగా నగరంలో మూడు నాలుగు సన్మాన సభలు ఏర్పాటు అవుతున్నాయి.

వజ్రోత్సవం జరిగిన మర్నాడు ఇక్కడి చలనచిత్ర నిర్మాతలంతా, నాగేశ్వరరావు గౌరవార్థం విందుచేసి, అభినందనలు తెలుపుతారు. ఆపైన, ఇక్కడి తెలుగు తమిళ కళా సాంస్కృతిక సంఘాల వారి సభలు జరుగుతాయి.

వజ్రోత్సవానికి కోడంబాకంలో వి విజయా గార్డెన్స్‌లో ఘనంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. ★



ఎం. జి. ఎం. వారి "టీ హౌస్ ఆఫ్ ఆగస్టు మూన్"లో జాపనీస్ నటి మిచికో క్యో, గ్లెన్ ఫోర్డ్.

## సినిమా వార్తలు

లగువారంతో నటిస్తున్న ఈ చిత్రం రెండు భాషలలో తయారౌతోంది.

రచన సముద్రాల రాఘవాచార్య, దర్శకత్వం శ్రీనివాస రాఘవన్.

### ఇంటిగుట్టు

సంగీతా ప్రొడక్షన్స్‌వారి తొలికానుక "ఇంటిగుట్టు" నిర్మాణం సగం పూర్తి అయింది. వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో రామారావు, సావిత్రి, పుష్పవల్లి, సూర్యకాంతం, రేలంగి, గుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు మొదలగువారు నటిస్తున్నారు.

కథ, మాటలూ సదాశివబ్రహ్మం, పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాశారు. సంగీత దర్శకుడు, నిర్మాత ఎం. ఎస్. ప్రకాష్.

### తానొకటి తలిస్తే

కాకినాడా ఫిలింస్ వారి చిత్రం "తానొకటితలిస్తే" అడ్డాల నారాయణరావు దర్శకత్వాన తయారవుతోంది. ఇందులో గిరిజ, రాజసులోచన, జగ్గయ్య, రేలంగి, గుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు, సి. ఎస్. ఆర్. నాగయ్య ప్రభృతులు నటిస్తున్నారు. రచన రాఘచంద్, ప్రభాకర్. సంగీతం అశ్వత్థామ నిర్మాత సి. హెచ్. వి బాబూరావు ★

## నయాసన్సార్ వారి రెండవ చిత్రంలో జమున

రష్యన్ కళాకారులతో కలసి "పరదేశీ" చిత్ర నిర్మాణం సాగిస్తున్న నయాసన్సార్ (క్వాజా అహమద్ అబ్బాస్) ఇంటర్ నేషనల్ వారి తరువాతి చిత్రం, "భగవాన్, ఔర్ సైతాన్"లో నాయకిగా తెలుగునటి జమునను బుక్ చేయడం జరిగింది. నయాసన్సార్ భాగస్వామి ఒకరు గతవారం మదరాసువచ్చి కాంట్రాక్టు వ్రాసుకొనివెళ్లారు.

జమున ఇంతకుముందు జూపిటర్ పిక్చర్స్ వారి హిందీచిత్రం "నయా ఆద్మీ"లో నటించింది. తరువాత ఎ. వి ఎం. వారి 'మిస్ మేరీ' ('మిస్సమ్మ' హిందీప్రతి)లో పాల్గొన్నది ఈసారి 'భగ్‌వాన్ ఔర్ సైతాన్'లో ఆమె నాయకభూమిక నిర్వహిసుంది. ఈ చిత్రం నిర్మాణం అక్టోబర్ నెలలో ఆరంభం కావచ్చునని తెలుస్తోంది. కొంత బొంబాయిలోను, మరి కొంత మదరాసులోనూ (బహుశా ఎ. వి. ఎం. స్టుడియోలో) సాగుతుందట.

జమున ఇపుడు పాల్గొంటున్న చిత్రాలు. విజయావారి "అప్పుచేసిపప్పుకూడు" (తెలుగు, తమిళం) అశ్వరాజ్ వారి "వినాయకచవితి", రాజశ్రీవారి "సతీ అనసూయ", శ్రీ రాజరాజేశ్వరీవారి "కృష్ణమాయ", ఎ. వి. ఎం. వారి "భూకైలాస్" (తెలుగు, కన్నడం) అరుణా ఫిలింస్ వారి "బొమ్మలపెళ్లి" (తెలుగు, తమిళం), ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం, చందమామావారి "దొంగల్లో దొర" తెలుగు, తమిళం, ఎం ఆర్. ఎస్. వారి "సంధిప్పు" (తమిళం) ఎవరెస్ట్ మువీ కార్పొరేషన్ వారి "కుమార్ దేవన్" ఎ. వి. ఎం. వారి హిందీ చిత్రం. ★

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

(12-వ పేజీ తరువాయి)

పరమానంద్ కూడా డిటోపని చేసేవాడు.

అంతల్లోకి "జిందగీ యహీహై" అన్న డైలాగు ఒక గద్గద కంఠంలోంచి ఇవతలికి వచ్చేది అది ఇంగ్లాండ్ రిటరన్డ్ కుక్ షీలాదేవీ తాలూకుదన్నమాట.

విశేషం ఏమిటంటే, ఈ పనివాళ్ళు ఆరుగురూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు

ఒక్కొక్కసారి వాళ్లనిచూస్తే "మసి పూసిన మాణిక్యాలు" అనే నవలపేరు జ్ఞాపకం వచ్చేది. కష్టాల్లోవున్న పంచపాండవులూ ద్రౌపదీ గుర్తుకువచ్చేవారు తప్పే అనుకో ఇంకోటి. మా ప్రొడ్యూసరు బావమరిది ఎప్పుడూ వంటింట్లో నే కారట్లాడుతూ ఉండేవాడు షీలాదేవి కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడి జిందగీ జిందగీ అంటూ ఉండేది.

ఆవిడ కీచకుడిగురించి ఎవరికీ ఫిర్యాదు చేసినట్టు కనబడలేదనుకో.

అలాంటి ఏర్పాట్లు జరిగితే ప్రొడ్యూసరు బావమరిదిగారి వీపు చిట్లిపోయేదిగదా. సదరు పనే జరిగితే, చిట్లిపోయిన వీపు బొమ్మలూ, కథా కమామీషూ తెల్లారేసరికల్లా అక్కడి సినిమా పత్రికలో కెక్కిపోయేవికదా.

చెప్పొచ్చిందేమిటంటే, వాళ్ళమాట తీరు తెన్నులూ, ఆ ఫేసులమీద ఎక్స్ప్రెషన్లూ చూచి నేను చాలా కదిలిపోయాను. అంటే మూవ్ అయిపోయానన్నమాట

ఏమిటీ స్వామిభక్తి? ఈ కళానురక్తి? ఈ ఐక్యమత్యం? వీళ్లంతా ఒక్కరేనా? వేర్వేరా? అని ఎంతో పరిశోధన చేశాను.

అడపా తడపా మా ప్రొడ్యూసరుతో అనేసేవాణ్ణి కూడా — "నే నిలా కదిలిపోతున్నానూ, వీళ్ళొక్కళ్లూ, మహా నటులూ, మీ పిక్చరులో ఛాన్సులివ్వరాదా?" అని

ఇలా అనగా ఓరోజున రుమాల్ సింగ్ విన్నాడు ఆనక నన్ను ఒక్కణ్ణీచేసి ఓచోట కూచోపెట్టేసి, దిలీప్ కుమార్ నీ, ప్రేమనాథ్ నీ రాజకపూర్ నీ మించిపోయేలా నటించి చూపించి వదిలాడు యజమానికి రికమెండ్ చేయమని కోరుతూ ఓ పాతిక నా చేతులో పెట్టాడు



మర్నాడు తెల్లారేసరికి, నా దగ్గిర రెండువందల యాభై చేరాయనుకో.

ఇప్పుడు నువ్వు ఊహించగలవా వాళ్లెవరో ఎంతటి ఘనులో? ఎలాటిమునులో మనలో?

"బహుశా శాపంవల్ల ఛాన్సు దొరకని మహానటులు అయివుంటారు. ఆకలిబాధకు తాళలేక చివరకు కళామతల్లికి నమస్కరించి ఇలా డ్రైవర్లుగా, వంటవాళ్లుగా, గుమాస్తాలుగా కుదురుకుని ఉంటారు" అన్నాడు వరహాలరాజు బరువెక్కిన హృదయంతో

లాభం లేదు. నీది బ్రహ్మాండమైన బుర్ర కాదనుకుంటా. విను.

వాళ్ళారుగురిదీ ఒకే ఊరుట. అందులో ముగ్గురు చుటాలట. కొస్తా పొలం పుట్రా, ఇల్లూ వాకిలీ ఉన్నాయిగాని, సినిమాలో చేరాలని ఈ వూరువచ్చారు.

వాళ్ళకి తోచిన ఉత్తమ పద్ధతి ఇది. అడగాల్సిన వాళ్ళందర్నీ ముఖాముఖిని అడిగేసి లేదనిపించుకుని ఆఖరుకు ఈనదగ్గిర ఇలా చేరి దారుణంగా నటించి తమ



"చల్ చల్ గుర్రం..."

ఫొటో: శ్రీరామకృష్ణశ్యామప్రసాద్. —అనకాపల్లి.

ప్రతిభను చూపెంచేస్తున్నారన్న మాట. అన్నం తింటున్నా, కారులో వెళ్తున్నా, ఇంట్లో కూర్చున్నా ఆ నిర్మాత ఈ గొప్ప నటుల ప్రతిభను గుర్తించడం తప్పనిసరి — అని వాళ్లనమ్మారు. ఏదో ఓరోజున గభీమని బుక్ చేసి ఊరుకుంటాడని ఆశపడ్డారు.

వాళ్ల కథలు విన్నాక నా హృదయం మళ్ళీ కరిగి పోయింది. అలాగే చెబుతను అన్నాను. కాని ఈలోగా, నాకే ముప్పు ముంచు కొచ్చింది.

### కల్పితకథ

ఒక రచయిత పత్రికా కార్యాలయానికి కథపంపిస్తూ సంపాదకుని కిలా వ్రాశాడు: "మహాశయా! ఈ కథలోని పాత్రలు, సంఘటనలు కేవలము కల్పితములు. బ్రతికి ఉన్న వారికిగాని, చనిపోయిన వారికిగాని ఈ పాత్రలతో ఎట్టి పోలికలు లేవు"

కథ తిప్పి పంపిస్తూ సంపాదకుడు "అందుచేతనే త్రిప్పి పంపడమైనది" అని జవాబు రాశాడు.

నేను టోకరా ఇచ్చిన ఆసామి మళ్లీ గానా ఆచూకీ కనిపెట్టి, మా ప్రొడ్యూసరుకి ఆకాశరామన్న ఉత్తరం రాసేశాడు. ఇలా నీ కొంపలో చేరి నీతో తిరిగే వాడు హాలీవుడ్ వెళ్లలేదూ నీకు పోకైన టోకరా ఇచ్చాడు సుమీ అని

ఇది ఆయన కంటపడేలోగానే, సెక్రటరీ నాకు చూపించాడు, నేను మళ్లీ నిజం చెప్పినా ఆయన ఇంక నమ్మడన్న నమ్మకం కొద్దీ, చేతిలో రెండొందలు చేరాయన్న ధీమాకొద్దీ నేను ఆయింట్లోంచి "ఫేడౌట్" అయిపోయాను

అది వేరే కథ అనుకో. అని కథ ముగించాడు వరసన్న.

* * *

"చెప్పొచ్చింది ఆయింట్లో జమాల్ రుమాల్, పెరుమాళ్ అండ్ కోల తెలివితేటలు, నేర్పు గమనించావా? వాళ్లు ఏనాటికైనా, చిన్న వేషమైనా సాధిస్తే అది ఈ నేర్పువల్ల వచ్చిన ఫలితమే అవుతుంది. నీకు అంతటి దారుణ తెలివితేటలు ఉన్నాయా వరహాలరాజా? ఇంత బ్రహ్మాండమైన ఊహ నీకు తట్టుతుందా భావి హీరో?" అన్నాడు వరసన్న ఎడిషనల్ డైలాగు రైటరు ప్రజ్ఞను ఉపయోగించి

"లేదు; తట్టదు" అన్నాడు రాజు వినయభయ సంభ్రమాశ్చర్య చకితుడై.

"అయితే లాభంలేదు రైలుదిగి ఇంటికెళ్లిపో తక్షణం" అన్నాడు వరసన్న.

"రైలు పరిగెత్తుతోంటే ఎలాగ?" అన్నాడు రాజు కిటికీలోంచి తొంగిచూసి.

(పైవారం రెండవకథ)

## ★ రాఘవ పాండవీయం ★

...ఉంది... ఇవన్నీ వట్టి ఆలోచనలు, అనుకొన్నాను...!!! ఇంతెందుకూ?.. భీమకవికి రాజ దర్శనం కలుగకుండా చెయ్యాలి! ...అక్కడిదాకా ఎందుకూ..., అసలీ గ్రంథాన్ని ప్రభువుల చూపుల కందకుండా చేస్తే మరీ మంచిది ..అవును యిదే ఉత్తమం..." అని అనుకొంటూ ఆ గ్రంథాన్ని అగ్ని హోత్రుడికి ఆహుతి చేశాడు అర్ధ ఘడియలో.

అతని మనస్సు తేలిక పడింది.

అనుకున్న ప్రకారం, అయిదురోజులూ గడిచిపోయాయి భీమకవి నన్నయభట్టారకుని గృహానికి ఏతెంచాడు భీమకవిని చూడటంతో నన్నయ భట్టారకుని మనస్సులో భయమూ, బెరుకూ వుంటూ వుంది. పైకి మాత్రం గాంభీర్యాన్ని ప్రదర్శిస్తూ అతణ్ణి ఆహ్వానించాడు.

"పండితోత్తమా! . మీ గ్రంథాన్ని ప్రభువులకు అందజేశాము. అయితేనేం! ఆయన ఆమూలాగ్రంగా పఠించి పెదవి విరిచాడు .. అంతటి చచ్చురచన తాని దివరలో ఎచ్చటా చూడలేదన్నాడు. ప్చ్!!! అంతా దైవ నిర్ణయం" అన్నాడు నన్నయ భట్టారకుడు.

భీమకవికి ఆపాదమస్తకం కంపించిపోయింది అతని మస్తిష్కంలో అగ్ని జ్వాలలు పుట్టుకొచ్చాయి. దీర్ఘంగా ఆలోచించి, దివ్యదృష్టితో జరిగిన సంగతంతా తెలుసుకొన్నాడు. నన్నయ భట్టారకుడు చేసిన మోసం అతనికి అవగాహనమైంది.

"నీ పక్క విషయాలు కట్టిపెట్టు. నీ కుతంత్రాలు నాదగ్గర సాగవ్!.. నువ్వు నా గ్రంథాన్ని దగ్ధం చేశావ్!. అయితే ఏం? శాస్త్రంలో వున్న తెలివిని మార్చ లేవుగా? ఇదిగో నువ్వుచేసిన మోసానికి ప్రతి ఫలం" అంటూ ఈయన మంచంపై వున్న ఆంధ్ర వ్యాకరణాన్ని కుత్తువియలుగా త్రుంచి నామరూపాలు లేకుండా చేశాడు.

"అంతే కాదు!.. నువ్వు చేసిన మోసానికి ఈ శిక్ష చాలదు . శాపం యిస్తున్నాను. త్వరలో నువ్వు భారతాన్ని ఆంధ్రీకరిస్తావ్. అది మూడు పర్వాలైనా పూర్తికాకుండా మరణిస్తావ్" అంటూ పురోన్ముఖుడయ్యాడు భీమకవి.

ఆ తర్వాత నన్నయ భట్టారకుడు భారతాన్ని ఆంధ్రీకరించటం, భీమకవి శాపం మూలంగా మూడు పర్వాలైనా పూర్తి గాకుండా మరణించటం జరిగింది . ఆతర్వాత భారతాన్ని, తిక్కన సోమయాజీ, ఎఱ్ఱా ప్రగ్గడ పూర్తి చెయ్యటం మనకు తెలిసిన విషయమే! ★

## కృత్రిమచంద్రగోళాల ప్రయోగం

(31-వ పేజీ తరువాయి)

ఆసియా అనీ, అమెరికా అనీ, యూరప్ అనీ వేరు వేరు ఖండాలు కనిపించవు. ఈ దేశం మాది, ఈ రాజ్యం మాది, ఈ ఇల్లు మాది అనే భేదాలే మాసిపోతాయి బ్రహ్మాండమైన సృష్టిలో భూమి నలుసులోని నలుసనీ, మానవుడు ఆ నలుసులోని నలుసనీ తెలిసివస్తుంది. అప్పుడు బహుశా మానవుడు తనయొక్క, తన కోరికలయొక్క అల్పత్వాన్ని గ్రహించి అల్లర చిల్లర వేషాలు మానేసి నిజమైన మానవత్వం సంపాదించుకుంటాడేమో! అప్పుడు బహుశా ఇంకా అధికవిజ్ఞాన పిపాసతో గ్రహాలనే అధిగమించి దూరాన మినుకు మినుకు మంటున్న నక్షత్రాల కేసే ప్రయాణం సాగిస్తాడేమో! ఎవరు ఊహించగలరు? ★

### అసలు జబ్బు

"డాక్టరుగారూ! ఈ మధ్య నాకు వంట్లో నలతగా వుంటోందండి. జబ్బేమిటో పరీక్షచేసి చెబుతారూ!" అంటూ ఒకావిడ ఆఫీసు లోపలికొచ్చి ఒకాయనన్నడిగింది.

"పరీక్ష చేయకుండానే చెబుతానమ్మా. మొదటిది, మీరు అనవసరంగా లావెక్కారు. కొవ్వు తగ్గించుకోడానికి ప్రయత్నించండి. రెండోది, మీ పళ్లు అట్టే గట్టిగా ఉన్నట్టులేదు. కొత్త పళ్లు కట్టించుకోండి. మూడోది, మీరు కళ్లజోడు పెట్టించుకోండి. పెట్టించుకొన్న తరవాత బయట వున్న బోర్డు చూస్తే ఇది డాక్టరుగారిల్లు కాదనీ, ప్లీడరుగారిల్లనీ తెలుస్తుంది," అన్నాడు ప్లీడరు గుమాస్తా.

## వనితావాణి

(42-వ పేజీ తరువాయి)

ఫలానా అమ్మాయి చదువుకి ఆమె భర్తే కారణం, ఆయనే పట్టుబట్టి చదివించారు. అన్నప్పుడు ఆ స్త్రీ నవమానించినట్టేకదా? మానవత గుణగణాల్ని వ్రాసేప్పుడు "ఇది స్త్రీలల్లోనూ వుంటుంది" అనే వాక్యాలెన్ని చోట్లో చూస్తాం అంటే పురుషులంతా స్త్రీలల్లో కూడా ఆ అవకాశాలున్నందుకి సంతోషిస్తున్నట్టేనా? ★

జానకి, (గుంటూరు.)



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S Sambhu Prasad

# వారి పేరే మీకు హామీ

## — మీరు ఎల్లప్పుడూ పేరుగాంచిన కంపెనీవారు తయారుచేసిన వనస్పతినే కొనండి!

ఈ ప్రసిద్ధిగాంచిన కంపెనీలలో ఒక కంపెనీ తయారుచేసిన వనస్పతినే కావాలని అడగండి

| | |
|---|---|
| అహ్మద్ ఉమర్‌భాయ్ | ఉమ్దా |
| అమ్రిత్ వనస్పతి కంపెనీ లిమిటెడ్ | గోల్డెన్ ఆరో |
| అమ్రిత్‌సర్ సుగర్ మిల్స్ లిమిటెడ్ | రోజ్ |
| బీరార్ ఆయిల్ ఇండస్ట్రీస్ | వనవ్రత |
| బీరార్ స్వదేశ వనస్పతి | స్వదేశీ |
| భారత్ వనస్పతి ప్రోడక్ట్స్ లిమిటెడ్ | రేడియో |
| భావనగర్ వెజిటబుల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | ప్రభాత్ |
| బ్రహ్మప్ప తవనప్పనవర్ ప్రైవేట్ లిమిటెడ్ | బి టి |
| డి సి ఎమ్ వనస్పతి మ్యాన్యుఫేక్చరింగ్ వర్క్స్ | పన్‌ఘట్ |
| ఈస్ట్ ఏసియాటిక్ కంపెనీ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ | ఓ కె |
| ఈస్ట్ కోస్ట్ ఎడ్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | అశోకా |
| గణేష్ ఫ్లోర్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ | ఫస్ట్ క్వాలిటీ |
| హిందూస్తాన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్ | రసోయ్య |
| హిందూస్తాన్ లీవర్ లిమిటెడ్ | లోటస్ |
| ఇండియన్ వెజిటబుల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | లయ[illegible] |
| జగదీశ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్ | అరుణ్ |
| కథియవార్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | — |
| కుసుమ్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | కుసుమ్ |
| మార్గరీన్ & రిఫైన్‌డ్ ఆయిల్స్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్ | ప్రకాశ్ |
| మెట్టూర్ కెమికల్ & ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్ | కామధేను |
| మోది వనస్పతి మ్యాన్యుఫేక్చరింగ్ కంపెనీ | కోజో జెమ్ |
| మైసూర్ వెజిటబుల్ ఆయిల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | చాముండి |
| రాంపూర్ వెజిటబుల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | నటరాజ్ |
| రోహ్‌తాస్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | హనుమాన్ |
| ఎస్ జి వెజిటబుల్ ప్రోడక్ట్స్ | గోపాల్ |
| స్నో వైట్ ఫుడ్ ప్రోడక్ట్స్ కంపెనీ లిమిటెడ్ | బలూక్ |
| స్వాయిక వనస్పతి ప్రోడక్ట్స్ లిమిటెడ్ | స్వాయిక |
| స్వస్తిక్ ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ | [illegible] |
| టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ | [illegible] |
| తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్ | తుషార్ |
| వెజిటబుల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | ప్రతాప్ |
| వెజిటబుల్ విటమిన్ ఫుడ్స్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్ | విటాగి |
| వెస్టరన్ ఇండియా వెజిటబుల్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ | సన్‌ఫ్లవర్ |

మీ వంటకు వాడుటకు ఆరోగ్యదాయకమైన మరియు శక్తినిచ్చే వనస్పతిని కొనుట మీకు అన్ని విధములా లాభకరము కాని మీరు వనస్పతిని కొనునపుడు తయారుచేసేవారి పేరును చూచుట మరవకండి!

వనస్పతి మ్యాన్యుఫేక్చరర్స్ అసోసియేషన్‌లోని సభ్యునిచే తయారుచేయబడిన వనస్పతిని కొంటే అది ప్రభుత్వపు పర్యవేక్షణ క్రిందనున్న కార్ఖానాలో, ప్రభుత్వపు కఠినమైన నిర్ణయముల ప్రకారము తయారుచేయబడినదని మీరు నమ్మవచ్చును అది తాజాగా మరియు పరిశుద్ధముగా ఉండుటకు చేతితో తాకబడకుండా తయారుచేయబడి, డబ్బాలలో సీలు చేయబడును!

# వనస్పతి

## గృహిణులకు వరప్రసాదము!




వనస్పతి మ్యాన్యుఫేక్చరర్స్
అసోసియేషన్ ఆఫ్ ఇండియా వారిచే
ప్రచురింపబడినది

UDRA 4390